శ్రీః

# శ్రీవిజ్ఞానభైరవతన్త్ర

కీటభ్రమరణా వ్యాఖ్యా

మేళ్ళచెఱ్ఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి



**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)

లెక్చరర్

4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA-523157



శ్రీః

శ్రీవిజ్ఞానభైరవతన్త్ర

కీటభ్రమరణా వ్యాఖ్యా

మేళ్ళచెఱ్ఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి

ఫోన్: 9908163627

| | |
|---|---|
| ప్రథమముద్రణ | : మహాశివరాత్రి – శ్రీఖరనామ సంవత్సరము **20–2–2012** |
| ప్రతులు | : **500** |
| పేజీలు | : **136** |
| వెల రూ. | : **100.00** |



Lecturer, V.R.S. & Y.R.N. College, Chirala-523157

**Residence:**

4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, CHIRALA - 523157
Cell :**94401 15411, 9052256311, 08594 - 234038**

D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

## ‘ధారణీయమ్’

‘విజ్ఞానభైరవతన్త్ర’ అంటే ‘చైతన్యాన్ని దాటి ఆవలకు వెళ్లేందుకు ఉన్న సాంకేతిక ప్రక్రియలు’ అని మన పూర్వులచే చెప్పబడినది.

‘తన్త్ర’ అంటే సాంకేతిక ‘ప్రక్రియ‘ లేక ‘పద్ధతి’.

112 ధారణలతో కూడిన ‘విజ్ఞానభైరవతన్త్ర’కు గ్రంథకర్త ఎవరో తెలియదు. ఇది ‘రుద్రయామలసార’మని గ్రంథాంత శ్లోకము చెప్పుచున్నది.

ఈ ధారణలలో ఇది అత్యన్త అనుకూలమైన ‘ధారణ’ అని దేనిని మీరు భావింతురో దానిని గ్రహించి ‘ఆట ఆడుతున్నట్లు సరదాగా’ ప్రయోగం చేయండని, ‘కష్టతరమైన ప్రయత్నాలు చేయవద్దని’, ‘వేడుకగా చేయండని’ చెప్పిన వారు ‘ఓషో’ మహనీయుడు.

ఓషో ఈ ‘విజ్ఞానభైరవతన్త్ర’ గ్రంథాన్ని కూలంకుషంగా ‘అధ్యయనం – అధ్యాపనం’ చేయటంతో అది ‘ది బుక్ ఆఫ్ సీక్రెట్స్’ అనే బృహత్‌గ్రంథంగా ఆంగ్లభాషలో రూపొందింది. ఈ గ్రంథంలో మొదటి 12 ధారణలు తెలుగులో ‘ఓషో’ ప్రచురణగా 272 పేజీలతో వెలువడింది.

కదిలే ఆలోచనల గుంపే మనస్సు. దాన్ని లయం చేయటం ద్వారా ‘భైరవస్థితి’ని ఆనందానుభూతి పొందటమే ధారణను పట్టుకోవటమంటే. అదే అమనస్కరాజయోగము.

జీవితంలో మౌనం, నిశ్శబ్దము, నిర్మలత్వం ముఖ్యమైనవి. అవి ఉంటే వాళ్లల్లో దైవత్వముంటుంది. అదే ధారణ ఫలితము జీవించడం ఒక్కటే వాళ్లకు తెలుసు. సర్వమతాతీత భావన – ‘విజ్ఞానభైరవతన్త్ర’. భావనే భగవంతుడు.

‘విజ్ఞానభైరవతన్త్ర’ అనే గ్రంథాన్ని ఆకళింపు చేసుకొనేందుకు, అందు అడుగిడుటకు సౌలభ్యంగా ఉంటుందని భావించి తెలుగులో ప్రతిపదార్థ తాత్పర్యాలను, వివరణ అందించవలసినదిగా కోరిన వెంటనే ‘కీటభ్రమరణా’ వ్యాఖ్యను రూపొందించినవారు మిత్రవర్యులు శ్రీ మేళ్లచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు వారికి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ధారణీయులకు శుభం కలగాలని కోరుకుంటూ నమస్సులతో...

**– రామోరా**





2

“శ్రీవిజ్ఞానభైరవతన్త్ర”

కీటభ్రమరణావ్యాఖ్యా సమేతమయిన యీ గ్రంథము శ్రీశైల భ్రమరామ్బా సమేత మల్లికార్జునస్వామివార్ల పాదపద్మములకు భక్తితో సమర్పితము

– రామోరా



# విజ్ఞానభైరవధారణారహస్యములు

విశ్వవ్యాప్తంగా ఒకే చైతన్యమున్నది. అది మన సర్వసత్తలందు, సర్వజ్ఞానములందు, సర్వక్రియల యందు వ్యాప్తమయియున్నది. అది లేనిచోటు లేదు. జీవుడు దానిని పొందుటకు పనికిరాని పదార్థము, భావము, భావన, క్రియ లేవు. కావలసినదల్లా ఆశక్తిపై అనుసంధానము. తీవ్ర జిజ్ఞాస. జిజ్ఞాస కూడా ఆశక్తియే. అందువలననే అది తనను జేర్చుకొనటానికి తనకు, తనే ఉపయోగిస్తుంది. ఎచ్చట మనసు కేంద్రీకరించినా ఆ కేంద్రీకరణ చివఱకు నామరూపస్థాయిని దాటి చైతన్యస్థాయిలోనికి వెళ్లిపోతుంది. అదే శుద్ధచైతన్యం. అదే నిర్వికల్పస్థితి. అదే శూన్యం , మోక్షం లేదా భైరవస్థితి. అదే విజ్ఞాన భైరవ / ఆనందభైరవ స్థితి. అదే శాశ్వతము. ఈ విషయమునే చాలా గ్రంథాలు వివరించినవి. చూ॥

ముందు చైతన్యవ్యాప్తి గురించి చూద్దాం.

**"పురుష ఏ వేదగ్ం సర్వం"**

**"సర్వం ఖల్విదం బ్రహ్మ"**

అని శ్రుతులు చైతన్యమే సర్వవ్యాపి అని, అసలు సర్వమంటూ విడిగాలేదని చైతన్యమే అని చెప్తున్నాయి.

**"వస్తుత ఏకైవశక్తిః ఈశ్వరప్రత్యవమర్శరూపా శక్తిః సా, సంవేదనరూపత్వాత్"**

**–** స్పందనిర్ణయః

అందువలన ప్రపంచమంతా "సంవిత్" అనగా చైతన్యరూపము.





ఈ భావనలలో / ధారణలలో శూన్యభావన చెప్పారు. శూన్యం అంటే బౌద్ధుల శూన్యంకాదు. వికల్ప శూన్యత. అయితే వికల్పశూన్యతను బౌద్ధులు గూడా చెప్పారు. కాని వారిశూన్యత అక్కడితో ఆగుతుంది. ఆ శూన్యమే వారిగమ్యం. చూ॥

**సర్వాలమ్బనధర్మైశ్చ సర్వతత్త్వైరశేషతః।**
**సర్వక్లేశాశయైశ్శూన్యం న శూన్యం పరమార్థతః॥**

– ఆచార్య నాగార్జునుడు

కాని యిట్టి శూన్యము మనకు గమ్యంకాదు. ఈ వికల్పశూన్యతకు ఆధారంగా శూన్యగ్రాహకుడైన "నేను" అనబడు చైతన్యమును, మనం అంగీకరిస్తాం. లేనిచో శూన్యాన్ని శూన్యస్థాయిలో ఎవరు గుర్తిస్తున్నారు? ఎవరో గుర్తించనిదే 'శూన్యం' అన్న భావన ఎవరికి వస్తున్నది? చూ॥

**"పారమార్థికీం భిత్తిభూతాం**

**చిద్భూమిమవస్థాప్య శూన్యభావనోక్తా"**

– స్పందనిర్ణయః

కనుక శూన్యానికి సాక్షిగా ఆత్మ ఉన్నది. కనుక నిర్వికల్పకతనుబట్టి శూన్యావస్థ అని ఆత్మవ్యాప్తిని బట్టి పూర్ణావస్థ అని, పూర్ణాహంత అని చెప్తారు.

**సావస్థా కాప్యవిజ్ఞేయా మాదృశాం శూన్యతోచ్యతే।**
**న పునర్లోకరూఢ్యైవ నాస్తిక్యార్థానుపాతినీ॥**

– ఆలోకమాలా

కనుక ఇది నాస్తికశూన్యం కాదు.

ప్రపంచమంతా శూన్యం అనుకొన్నా యీ ప్రపంచాన్ని సృష్టించిన సచ్చిదానందశక్తి లేదా భగవంతుని స్వాతంత్ర్యశక్తి / ఇచ్ఛాశక్తి శూన్యం కాదు. అందువలన సర్వశూన్యస్థితిలో ఆ 'సంవిత్' స్ఫురత్త / స్ఫురణ గా ఉంటుంది.

**"పరాభట్టారికా సంవిత్ ఇచ్ఛాశక్తిపురస్సరమ్।**
**స్థూలప్రమేయపర్యంతం వమంతీ విశ్వమాంతరమ్॥**

– స్పందకారికా

కనుకనే సర్వత్ర ఈ 'చిత్' ఉన్నది. అందుకే విశ్వమంతా "శక్తిస్ఫారం"

**"శక్తయోస్య జగత్ కృత్స్నమ్"** అన్నారు

**"తస్మాచ్ఛబ్దార్థచింతాసు**

**న సావస్థా న యా శివః"** – స్పందకారికా

ఈ 'సంవిత్' / పరాశక్తి / చైతన్యము అఖండమయినను మన ఉపాధి / శరీరభేదాలను బట్టి 'బుద్ధి'గా అవతరించి 'ఖండ'రూపంగా కనబడుతున్నది. అందువలన 'బుద్ధులు, సంవిత్తులు' అంటాము. ఏదయినా వీటికి 'ఆత్మ' ఆధారము.

**"అహం సుఖీ చ దుఃఖీ చ రక్తశ్చేత్యాదిసంవిదః।**

**సుఖాద్యవస్థానుస్యూతే వర్తంతేన్యత్ర తాః స్ఫుటమ్॥"**

– స్పందకారికా

ఈ సుఖాద్యవస్థలు సంవిత్తులు. ఖండ జ్ఞానాలు. వీటికి ఆధారం సర్వావస్థలలోనూ ఉన్న 'నేను'. ఈ 'నేను' చైతన్యమే దానిని

**"అంతఃస్రక్సూత్రకల్పతయా స్థితే"**అన్నారు. కనుక బుద్ధియొక్క దశలన్నింటిలో – అవిక్షణికములయినను – వాటి అధిష్ఠానమయినది ఆత్మచైతన్యము. అది నిత్యమే. కనుక ఈ రకరకాల చింతలకు మధ్యనున్న సంబంధముగాని, ఆధారంగాని, "ఆత్మ"యే. అదే చెప్తారు.

**"ఏకచింతాప్రసక్తస్య యతస్స్యాదపరోదయః।**

**ఉన్మేషస్సతు విజ్ఞేయః స్వయం తముపలక్షయేత్॥"**

– స్పందకారికా

దీనిని వ్యాఖ్యానిస్తూ క్షేమరాజు తన స్పందనిర్ణయంలో,

**"యత ఏకస్యాం విషయవిచారాదిచింతాయాం ప్రసక్తస్య అపరస్యాః చింతాయాః ఝటిత్యుదయః స్యాత్, స చింతాద్వయమధ్యే వ్యాపక ఉన్మేష ఇత్యన్యే"** అన్నారు. అనగా '2' ఆలోచనలమధ్య వ్యాపకపదార్థము 'ఉన్మేషమని' అర్థము. మరొక వ్యాఖ్యాత రమాకాంతపండితుడు "యశ్చాసావనపహ్నవనీయోనుసంధాతా సోనుసంధేయచింతాద్వయవ్యాపకవిశుద్ధచిన్మాత్రస్వరూపః సర్వకారణమాత్మైవోన్మేష ఇత్యుక్తః" అని విశదపఱచినాడు.





సర్వభావనలు మనస్సుతో చేస్తాము. 'మనసు' చైతన్యము యొక్క ఖండము. విషయసంక్రాంతమయి అది ఖండముగా, బుద్ధిగా కనబడుతుంది. విషయాలను తొలగిస్తే అఖండ జ్ఞానము కాగలుగుతుంది. అదే శివశక్తి రూపము. దానియందు ధారణయే 'భైరవదశను' కలిగించును.

**"తథాహి మధురే గీతే స్పర్శే వా చందనాదికే।**

**మాధ్యస్థ్యవిగమే యాసౌ హృదయే స్పందమానతా॥**

**ఆనందశక్తిః సైవోక్తా....**

– తంత్రాలోకము.

ఆనందశక్తిలోకి వెళ్లిన మనం తప్పక ఆత్మదర్శనం/భైరవస్థితిని పొందుతాము. చూ॥

**"యే యే భావా హ్లాదిన ఇహ దృశ్యాస్సుభగసుందరాకృతయః।**

**తేషామనుభవకాలే స్వస్థితిపరిపోషణం సతామర్చా॥**

– జయరథవ్యాఖ్య

అనుభవకాలము అనగా విషయానందానుభవ సమయం. ఇందులో తన 'ఆనందదశ' ను అనుసంధానం చేయడం స్వస్థితి పోషణం. దానివలన ఆనంద భైరవస్థితి. అదే 'పూజ' అని **జయరథుడు** వ్రాసిన విషయాన్నిబట్టి మన చిత్తవృత్తులు ఆ చైతన్య భావాలేనని వాటిమీద చేసిన "ధారణ" మనలను భ్రమరకీట న్యాయంతో (కీటమును భ్రమరం భావనద్వారా భ్రమరంగా చేసినట్లు) శివులనుగా చేస్తోందని స్పష్టము. కనుకనే

**"తత్పరిజ్ఞానే (తత్ = చిత్తం) చిత్తమేవ అంతర్ముఖీభావేన చేతన పదాధ్యారోహాత్ చితిః"** అని **ప్రత్యభిజ్ఞాహృదయము** చెప్పింది. అంటే మన చిత్తమే "చిత్" గా మారుతుంది. చితి అనగా జ్ఞానము / చిత్.

కాగా 'భావన' ముఖ్యం. దానిని నిలిపితే ధారణ. ఈ భావనాధారణల వలన కానిది లేదు. వీటికి ఆధారము కారాని వస్తువున్ను లేదు. **ప్రత్యభిజ్ఞాటీక**లో అదే విషయం ఉంది. చూ॥

**శరీరమపి యే షట్త్రింశత్తత్త్వమయం శివరూపతయా పశ్యంతి, అర్చయన్తి చ తే సిద్ధ్యంతి"**

అనగా శరీరాన్ని కూడా శరీరంగా గాక శివరూపంగా దర్శించి పూజిస్తే మోక్షమే నట. అంతేగాక

**“ఘటాదికమపి తథాభినివిశ్య పశ్యంతి అర్చయంతి చ తే పీతి నాస్త్యత్ర వివాదః”** – అనగా

శివభావనతో “కుండయినా కొండయినా” పూజించదగినదే మోక్ష కారకమే. దీనినే **భట్టవామనుడు** ఒకకారికలో “సంవిత్” అనే పదంతోనే ప్రత్యక్షంగా చెప్పాడు.

**“ఆలంబ్య సంవిదం యస్మాత్ సంవేద్యం న స్వభావతః।**
**తస్మాత్సంవిదిదం సర్వమితి సంవిన్మయో భవేత్॥”**

అనగా “దృశ్యవస్తు స్వభావంగాక దాని తత్త్వమయిన “సంవిత్తును” సహజముగా ఆలంబముగా చేసికొని ధ్యానిస్తే ఇదంతా ‘సంవిత్తు’గానే అవుతుంది. వాడు సంవిన్మయుడవుతాడు. కనుకనే

**అతిక్రుద్ధః ప్రహృష్టో వా కిం కరోమీతి వా మృశన్।**
**ధావన్వా తత్పదం గచ్ఛేత్ యత్ర స్పందః ప్రతిష్ఠితః॥”**

అన్నది **స్పందకారిక.** దీని వివరణ చూద్దాం. యోగులందరు అన్నిరకాల ఉపాయమార్గాలతోను, ఇతర మనోవ్యాపారములను జయించి మనస్సును ఏకాగ్రం చేస్తారు. అయితే అతిక్రోధము అతిహర్షము మొదలగు భావోద్రేకస్థితులలో మన మనస్సులు కూడా ఇతర వ్యాపారములు మాని ఆ క్రోధామర్ష కారణాలలో ఏకాగ్రమవుతాయి. ఈ ఏకాగ్రస్థితిని ఈ స్పందమూలమయిన ‘నేను’ అనబడు చైతన్య పరామర్శకు ప్రయోగిస్తే వెంటనే అంతర్ముఖులవుతారు. యోగికాని వానికి ఇదంతా వ్యర్థ భావోద్రేకమే. చూ॥

**“ఏతాస్వతిక్రోధావస్థాసు స్వరసతఏవ సమస్తాపరవృత్తిక్షయమయీషు యది స్పందతత్త్వ వివిక్తయే సతతముద్యుక్తాః ఝటితి త్యంతర్ముఖీభవంతి యోగినః”**

– స్పందనిర్ణయః

ఇట్టి ధావనం అనగా ఏనుగు తరుముతుంటే పరుగెత్తేవాడు తన భయస్పందతత్త్వ పరిశీలన చేయవలెను. ఇలా, భయసంవిత్తు క్రోధసంవిత్తు, సందేహసంవిత్తు, హర్షసంవిత్తు – వీటిలో తీవ్రస్థితిలో వచ్చే ‘ఇతరవృత్తి క్షయము, ఏకాగ్రతలను” పరిశీలిస్తే తప్పక “స్పందము” దొరుకుతుంది.



**“తత్ర వృత్తిక్షయాత్మకే పదే అవస్థావిశేషః స్పందః ప్రతిష్ఠితః”**

– స్పందనిర్ణయః

ఈ విషయాలే “విజ్ఞానభైరవంలో” ఉన్న ధారణలకు, అందునా ప్రత్యేకంగా,

1. కామక్రోధలోభమోహ – 99శ్లో
2. ఆనందే మహతి – 71శ్లో
3. క్షుతాద్యంతే – 118శ్లో

ఈ శ్లోకాల్లో చెప్పిన విషయాలకు మూలతత్త్వం.

రమాకాంత వ్యాఖ్యలో, **రమాకాంతుడు** “ఏతాశ్చ ప్రబుద్ధస్య (అంటే జ్ఞాని) ప్రత్యయమృశ్యమానాః సద్యః ప్రతిష్ఠిత స్పందోపలబ్ధ్యుపాయతాం భజంతే” అన్నాడు. అనగా

ఈ అవస్థలలో పరామర్శ చేస్తేనే ‘స్పందతత్త్వమయిన” శివతత్త్వము తెలుస్తుంది. అది మానేసి ఆ అవస్థలను అనుకరిస్తే అనగా ఏడుస్తూ, నవ్వుతూ, భయపడుతూ ఉంటే అవి సుఖదుఃఖాది చేతనాఖండాలుగానే మిగులుతాయి. అదే అంటాడు “రమాకాంతుడు” **నత్వనుభూయమానాః, సాహ్యవస్థా దుఃఖాదిమయ్యేవ.** కనుక యోగి చేయవలసినది ఏమంటే **“ఏవమేతాస్వవస్థాసూక్తయుక్త్యా ప్రథమం స్పందశక్తిం పరిశీల్య, తదను తామేవానుసందధత్, సర్వాస్వవస్థాసు, తద్దార్ఢ్యాను ప్రవేశమయీం జీవన్ముక్తతామాహరేత్ సతతోద్యుక్తః”**

– స్పందనిర్ణయః

అనగా అట్టి దశలందు అనుభవంలోకి పోకుండా అప్పటి స్పందశక్తిని, పరిశీలించి దానినే అనుసంధానము (ధారణ) చేస్తే క్రమంగా స్పందతత్త్వం తెలిసి జీవన్ముక్తత వస్తుంది.

ఇంతకూ ధారణ అన్నను ధ్యానము అన్నను దాదాపు ఒకటే. ధ్యానంలో (ధారణలో) 3 విషయాలు ఉన్నాయి. ధ్యానకర్త, ధ్యానవిషయం, ధ్యానక్రియ. క్రమంగా ధ్యేయం అనగా ధ్యాన విషయం మిగులుతుంది. అదే ధారణలో సమాధి అనగా ఏకాగ్రత.

**“ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాత్ ధ్యేయైకగోచరమ్।**
**నివాతదీపవచ్చిత్తం సమాధిరభిధీయతే॥”** – పంచదశీ

ఇట్టి ధారణా ప్రయత్నమునే "ఉద్యమం" అనవచ్చు. ఇది సంవిత్తుయొక్క పరిస్పందం.

**"యోఽ యం విమర్శరూపాయాః ప్రసరంత్యాః స్వసంవిదః।**

**ఝటిత్యుచ్చలనాకారప్రతిభోన్మజ్జనాత్మకః॥**

**ఉద్యమోంతఃపరిస్పందః పూర్ణాహంభావనాత్మకః"**

–శివసూత్రవార్తికమ్

అందుకే ఈ ఉద్యమమును భైరవస్వరూపం అన్నారు.

**"ఉద్యమో భైరవః"** శిసూ.

దీనివలన ఒక సౌకర్యం కూడా ఏర్పడింది. ఈ భావనలకు ధారణలకు ఎక్కడయినా ఎప్పుడయినా ఎవనికయినా అవకాశం వస్తుంది. అదే అంటారు.

**"యత్ర యత్ర మనో యాతి జ్ఞేయం తత్రైవ చింతయేత్।**

**చలిత్వా యాస్యతే కుత్ర సర్వం శివమయం జగత్॥"**

ఈ ధారణలు చేయటం అనేది ఏదో ఒక యోగప్రక్రియ కాదు. భక్తి ప్రక్రియ కూడా. ఎటూ ఇది ఒక జ్ఞానప్రక్రియే గదా. ఇదే భక్తి అని గూడా అన్నారు క్షేమరాజు.

**"న పాద పతనం భక్తిః వ్యాపినః పరమేశితుః।**

**భక్తిర్భావస్వభావానాం తదేకీభావభావనమ్॥"**

కనుక ఏ వస్తువునందయినా, ఏ భావమునందయినా మూలతత్త్వం అయిన స్పందభైరవస్థితి వచ్చేదాక ధారణ చేయాలి. అందులో ధారణా విషయములోని సంవిత్తునుగాని, అన్నింటికి సాక్షిగా ఉన్న ఆత్మరూప భైరవుని గాని అనుసంధానము చేయుటయే యీ ధారణా కదంబ లక్ష్యము. అదే విజ్ఞానభైరవము.

**– మేళ్ళచెఱ్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి**





# శ్రీవిజ్ఞానభైరవతన్త్ర

## “కీటభ్రమరణా” వ్యాఖ్యా

శ్రీ భైరవీ ఉవాచ॥ భైరవీదేవి ఇట్లనెను.

**1. శ్లో॥ శ్రుతం దేవ!మయా సర్వం రుద్రయామలసమ్భవమ్।**
**త్రికభేదమశేషేణ సారాత్సారవిభాగశః॥**

**2. శ్లో॥ అద్యాపి న నివృత్తో మే సంశయః పరమేశ్వర!**

**ప్రతిపదార్థము:–** దేవ = భైరవా!, మయా = నాచేత, రుద్రయామల = రుద్రసంబంధమయిన శివశక్తిరూపమయిన జంటనుండి, సంభవమ్ సంభవించిన, త్రికభేదమ్ = త్రికశాస్త్రభేదము, అశేషేణ = మిగలకుండా, సారాత్సార = సారమునుండి సారమయిన దానియొక్క విభాగశః = విభాగములుగా, సర్వమ్ = సమస్తము, శ్రుతమ్ = నీనుంచి వినబడినది. పరమేశ్వర! = ఈశ్వర! మే = నాయొక్క సంశయః = సందేహము, అద్యాపి = ఇప్పటికీ, న నివృత్తః = తీఅలేదు.

**భావము:–** పరమశివా! ‘రుద్రుడు, రుద్రశక్తి’ అనే జంట (యామల) నుండి వచ్చిన త్రికశాస్త్రసారమంతా సమగ్రంగా నేను నీనుండి విన్నాను. అయినా నా సంశయం పూర్తిగా తీఅలేదు.

**విశేషములు:–** 1. త్రికశాస్త్రము అంటే ‘3’ శాస్త్రములు. సిద్ధతంత్రము, మాలినీ తంత్రము, ఉత్తరశాస్త్రము. ఇవి ఒకదానికన్నా మరొకటి గొప్పవి. అభినవగుప్తుడు మాలినీతంత్రమును గొప్ప తంత్రమని తంత్రాలోకములో చెప్పారు.

---



**కిం రూపం తత్త్వతో దేవ! శబ్దరాశికలామయమ్॥**

**3. శ్లో॥ కిం వా నవాత్మభేదేన భైరవే భైరవాకృతౌ।**
**త్రిశిరోభేదభిన్నం వా కిం వా శక్తిత్రయాత్మకమ్॥**

**4. శ్లో॥ నాదబిన్దుమయం వాపి కిం చంద్రార్ధనిరోధికాః।**
**చక్రారూఢమనచ్కం వా కిం వా శక్తిస్వరూపకమ్॥**

**ప్రతిపదార్థము:–** దేవ = ప్రభూ!, భైరవాకృతౌ = భయంకరస్వరూపుడయిన, భైరవే = భైరవునియందు, రూపమ్ = రూపము, కిం = ఏమిటి? శబ్దరాశి = అకారాది క్షకారాంత శబ్దసమూహముయొక్క, కలామయమ్ = విమర్శాది కలాస్వరూపయినదా!, నవాత్మ = నవశక్తిస్వరూపమయిన, భేదేన = భేదముతో కిం వా = భిన్నముగా ఉండునా? త్రిశిరో = మూడు శిరస్సుల సంబంధమయిన, భేద = భేదముతో, భిన్నం వా = భిన్నమయినదా, కిం వా = లేదా, శక్తిత్రయ = ‘3’ శక్తులు, ఆత్మకమ్ = స్వరూపమయినదా?, నాదబిందుమయమ్ వాపి కిం = నాదబిందుమయమా? చంద్రార్ధ = అర్ధచంద్ర, నిరోధికాః = నిరోధికా స్వరూపమా, చక్రారూఢమ్ = షట్చక్రారూఢమయినదా?, అనచ్కం వా = స్వరరహితమయినదా? కిం వా? = లేక, శక్తిస్వరూపకమ్ = శక్తిస్వరూపమా?

**భావము:–** పరమేశ్వరా! భయంకరాకారుడని పేరుపొందిన భైరవునియొక్క స్వరూపతత్త్వమేమి?

1. శబ్దరాశికలామయమా? అనగా ‘అ’ నుంచి ‘క్ష’వరకు ఉన్న అక్షరరాశి, కలలు అనగా అనుత్తర ఆనంద, ఇచ్ఛ, మొదలగు విమర్శ శక్తులు కలలు. అ అనుత్తారాకారము శివతత్త్వము. ఇ ఇచ్ఛ, ఉ ఆనంద. ‘హ’ కారము విమర్శశక్తి. ‘‘అ + హ’’ ‘‘అహ’’ ఇది శివశక్తి ప్రతీకము. అదే ‘అహం’ అనగా శబ్దబ్రహ్మస్వరూపము అని ఒక ప్రశ్న.

2. నవాత్మరూపమా? అనగా శ్రీనేత్రతంత్రములో చెప్పినట్లు శివ సదాశివ ఈశ్వర విద్యా మాయా కాల నియతి, ప్రకృతి పురుష – అనబడు ‘9’ తత్వములు సమూహ స్వరూపమయిన మృత్యుంజయ మంత్రమా? లేక ‘వామా’ మొదలయిన నవశక్తులరూపమా?

3. త్రిశిరోభైరవమా? అనగా త్రిశిరోభైరవతంత్రములో చెప్పిన "నర, శక్తి, శివ" లేదా మాత, మాన, మేయ లేదా ఇచ్ఛా, జ్ఞాన, క్రియ అను త్రిపుటీమయమయిన తత్త్వమా?

4. శక్తిత్రయ స్వరూపమా? పైన చెప్పిన నరశక్తిశివాత్మకమయిన తత్త్వత్రయమునకు సంబంధించిన అపరా, పరాపరా, పరా అను శక్తుల రూపమా?

5. నాదబిందుమయమా? అనగా, మంత్రవీర్యరూపమయిన ప్రకాశ స్వరూపమయిన బిందువు, (ఇది సమస్త వాచ్యములయిన పదార్థములలోను వ్యాపించిన సత్త) మఱియు, సమస్త శబ్దములయందు అభిన్నంగా వ్యాపకంగా ఉండే విమర్శరూపమయిన, 'నాదము' ఈ నాదబిందువుల స్వరూపమా?

6. అర్ధచంద్రనిరోధికాస్వరూపమా? అనగా ప్రవాహరూపమయిన నాదము ఊర్ధ్వగతిలో చెందే పరిణామాలయిన అర్ధచంద్ర (U) నిరోధికా (▽) స్వరూపమా? (నిరోధికా అంటే సాధారణయోగులను పైకిరాకుండాను, సిద్ధయోగులను క్రిందకు జారకుండాను నిరోధిస్తుంది.)

7. చక్రరూఢతత్త్వమా? అనగా షట్చక్రములందున్న అంతర్వర్ణమాలారూపమా లేక వాటిని ప్రకాశింపజేయు కుండలినీ సర్పాకారమా? లేక అక్షరచక్రమందు సమానంగా స్ఫురించు "అహంత"యా?

8. అనచ్కమా? అనగా 'అచ్' లేని హకారము అనగా 'హ్'అనగా విసర్గ (ః) రూపము. (దీనినే 'ప్రాణకుండలిని' అంటారు.)

9. శక్తి స్వరూపమా? అని దేవి '9' ప్రశ్నలు సంధించింది. వీటిలో ఏది అసలు తత్త్వము?

---

**5. శ్లో॥ పరాపరాయాస్సకలమ్ అపరాయాశ్చ వా పునః।**
**పరాయా యది తద్వత్ స్యాత్ పరత్వం తద్విరుధ్యతే॥**

**6. శ్లో॥ నహి వర్ణవిభేదేన దేహభేదేన వా భవేత్।**
**పరత్వం నిష్కలత్వేన సకలత్వే న తద్భవేత్॥**

**7. శ్లో॥ ప్రసాదం కురు మే నాథ! నిశ్శేషం ఛిన్ధి సంశయమ్।**





**ప్రతిపదార్థము:–** పరాపరాయాః = పరాపరారూపశక్తికి, పునః = మఱల, అపరాయాశ్చ వా = నరరూపతత్త్వానికి, సకలమ్ = కలాసహిత రూపమున్నది. పరాయాః = పరాతత్త్వమునకు, తద్వత్ = పరాపర అపరలవలె, యది స్యాత్ = సకలరూపం ఉంటే, తత్ = ఆ పక్షంలో, పరత్వమ్ = 'పరా' అన్న హోదా. విరుధ్యతే = విరుద్ధమగును. పరత్వమ్ = పరత్వమనుహోదా, వర్ణవిభేదేన = వర్ణములలో ఒక రంగులో, భేదము చేతగాని, దేహభేదేన వా = శరీరభేదము చేతగాని, నహి భవేత్ = సిద్ధించదు గదా! నిష్కలత్వేన = కలాశూన్యతవలన, పరత్వమ్ = పరత్వము సిద్ధించును. సకలత్వే = కలాసహితమయినచో, తత్ = ఆ పరత్వము, న భవేత్ = సిద్ధించదు, నాథ = ప్రభూ! సంశయమ్ = సందేహమును, నిశ్శేషమ్ = పూర్తిగా, ఛింధి = తీర్చుము, మే = నాకు, ప్రసాదమ్ = అనుగ్రహమును, కురు = చేయుము.

**భావము:–** 'పర'కు మిగిలిన అపరా, పరాపరలకు మధ్య భేదం ఉండి తీరాలి. అది వర్ణాలలోనో లేదా రంగులోనో, భేదంవలన రాదు. ఆకారభేదం చేతను రాదు. కలాశూన్యమయితేనే 'పరత్వం' వస్తుంది. కలాసమేతమయితే 'పర' అనటానికి కుదరదు గదా! కనుక ఆ పరతత్త్వ స్వరూపమేమిటి? అనుగ్రహించి నా సందేహమును తీర్చుము.

**విశేషములు:–** స్వాతంత్ర్యశక్తి = పరా, క్రమసృష్టి వాంఛ = పరాపరా, క్రమము = అపరా, ఇదే దేవీత్రయము.

చూ॥ స్వాతంత్ర్యశక్తిః క్రమసంసిసృక్షా క్రమాత్మతా చేతి విభోర్విభూతిః।
తదేవ దేవీత్రయమంతరాస్తామనుత్తరం మే ప్రథయత్ స్వరూపమ్.

– తంత్రాలోకము.(1/5)

---

**శ్రీ భైరవ ఉవాచ – భైరవుడిట్లనెను.**

**సాధు సాధు త్వయా పృష్టం తంత్రసారమిదం ప్రియే॥**

**8. శ్లో॥ గూహనీయతమం భద్రే! తథాపి కథయామి తే।**

**ప్రతిపదార్థము:–** ప్రియే! = ప్రియమయిన పార్వతీ, సాధు సాధు = మంచిది. ఇదమ్ = ఈ విషయము, తంత్రసారమ్ = తంత్రములన్నింటియొక్క సారము.

భద్రే! = సర్వమంగళా! ఇదమ్ = నీవడిగిన యీ విషయము, గూహనీయతమమ్= మిక్కిలి దాచదగినది. తథాపి = అయినను, తే = నీకు, కథయామి = చెప్పెదను.

**భావము:–** ప్రియ పార్వతీ! నీవడిగిన విషయము సామాన్యమయినది కాదు. అది తంత్రములన్నింటికి సారమయిన నవనీతము. అతిరహస్యము. అయినను నీకు వివరించెదను.

---

**యత్కిఞ్చిత్సకలం రూపం భైరవస్య ప్రకీర్తితమ్॥**

**9. శ్లో॥ తదసారతయా దేవి! విజ్ఞేయం శక్రజాలవత్।**

**మాయాస్వప్నోపమం చైవ గన్ధర్వనగరభ్రమమ్॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = దేవీ!, భైరవస్య = భైరవునియొక్క, సకలమ్ = కలాసహితమయిన, రూపమ్ = ఆకారము, యత్కించిత్ = ఏదయితే, కథితమ్ = చెప్పబడినదో, తత్ = అది, శక్రజాలవత్ = ఇంద్రజాలమువలెను, మాయా = మాయతోను, స్వప్న = కలతోను, ఉపమమ్ = సమానముగాను, గంధర్వ నగరోపమం, చైవ = గంధర్వనగరమువంటిదిగాను, అసారతయా = నిస్సార మయినదిగా, విజ్ఞేయమ్ = తెలిసికొనదగినది.

**భావము:–** దేవీ! నీవు అడిగిన భైరవ రూపం విషయంలో సకలమయిన ఏ రూపమయినా కల్పితమే గాని వాస్తవ భైరవరూపము కాదు. రూపములు నిస్సారములు. అవి ఇంద్రజాలము వంటివి. మాయవంటివి, కలలవంటివి. గంధర్వ నగరము వంటివి. గంధర్వ నగరమనగా ఆకాశములో గాలివలన ఏర్పడిన మబ్బుల బొమ్మలు. అవి సత్యము కావు కదా! భైరవునికి నీవడిగిన రూపములన్నియు అటువంటివే.

---

**10. శ్లో॥ ధ్యానార్థం భ్రాన్తబుద్ధీనాం క్రియాడమ్బరవర్తినామ్।**

**కేవలం వర్ణితం పుంసాం వికల్పనిహతాత్మనామ్॥**

**ప్రతిపదార్థము:–** భ్రాంత = భ్రమలుగల, బుద్ధీనామ్ = బుద్ధులుగలవారును, క్రియా = పూజ మొదలగు బాహ్యక్రియలయొక్క, ఆడంబర = పటాటోపమునందు, వర్తినామ్ = ఉండువారును, వికల్ప = రకరకాల ఆలోచనలతో ఆశలతో, నిహత = పాడయిన





ఆత్మనామ్ = మనస్సుగల వారున్ను అయిన, పుంసామ్ = పురుషులయొక్క, ధ్యానార్థం కేవలమ్ = ధ్యానం కొఱకు మాత్రమే, వర్ణితమ్ = వర్ణింపబడినది.

**భావము:–** దేవీ! నిస్సారమయిన రూపవర్ణన నిస్సారులయిన ఉపాసకులకొఱకు చేయబడినది. పూజలు మొదలయిన ఆడంబరమిష్టపడుచు, రకరకాల ఆశలతో ఆశయాలతో చంచల మనస్కులయిన భ్రాంతోపాసకులకు లక్ష్యసిద్ధి కలుగుటకై భైరవునకు రకరకాల రూపాలు చెప్పబడినవి. అంతే తప్ప అవి వాస్తవతత్త్వము కాదు.

---

**11. శ్లో॥ తత్త్వతో న నవాత్మాసౌ శబ్దరాశిర్న భైరవః।**

**న చాసౌ త్రిశిరా దేవో న చ శక్తిత్రయాత్మకః॥**

**ప్రతిపదార్థము:–** అసౌ = ఈ, భైరవః = భైరవుడు, తత్త్వతః = తత్త్వరీత్యా, నవాత్మా = నవాత్మ, న = కాదు, శబ్దరాశిః = శబ్దసమూహము, న = కాదు, అసౌ = ఈ, దేవః = దేవుడు, త్రిశిరాః = త్రిశిరుడయినవాడు, న = కాదు, శక్తిత్రయ = '3' శక్తులే, ఆత్మకః చ = స్వరూపముగా గల వాడున్ను, న = కాదు.

భా॥ స్పష్టము.

---

**12. శ్లో॥ నాదబిన్దుమయో వాపి న చన్ద్రార్ధనిరోధికాః।**

**న చక్రక్రమసమ్భిన్నో న చ శక్తిస్వరూపకః॥**

**ప్రతిపదార్థము:–** నాదబిందుమయో వాపి = నాదబిందుస్వరూపుడయినను, న = కాదు. చంద్రార్ధ = అర్ధచంద్రము, నిరోధికాః = నిరోధికగాని, న = కాదు. చక్రే = చక్రమునందు, క్రమ = క్రమముగా, సంభిన్నః = కలిసిన స్వరూపమున్ను, న = కాదు. శక్తిస్వరూపకశ్చ = శక్తిస్వరూపుడయినవాడున్ను, న = కాదు.

**భావము:–** స్పష్టము.

---

**13. శ్లో॥ అప్రబుద్ధమతీనాం హి ఏతా బాలబిభీషికాః।**

**మాతృమోదకవత్సర్వం ప్రవృత్త్యర్థముదాహృతమ్॥**

**ప్రతిపదార్థము:–** ఏతాః = ఇవి, అప్రబుద్ధ = జ్ఞానంలేని, మతీనామ్ = మతిగలవారికి పెట్టిన, బాలబిభీషికాః = పిల్లబెదరింపు వంటివి. సర్వమ్ = ఇదంతయు, మాతృ = తల్లియిచ్చు, మోదకవత్ = లడ్డువలె, ప్రవృత్త్యర్థమ్ = ఉపాసనలోకి దింపుటకు, ఉదాహృతమ్ = ఉదాహరింపబడినది.

**భావము:–** ఈ రకమయిన రూపములన్ని బాలబిభీషికలు. పిల్లలను బెదిరించి పని చేయించినట్లు. అజ్ఞానులకు బెదురు పెట్టటానికి, ఇందులోనికి దింపటానికి పనికివస్తాయి. లేదా కొన్ని తల్లి 'లడ్డు' పెట్టి పిల్లలచేత పని చేయించినట్లు ఉపాసనలోకి అజ్ఞానిని దింపటానికి పనికివస్తాయి. అంతకు మించి యీ రూపములలో వాస్తవము లేదు.

---

**14. శ్లో॥ దిక్కాలకలనోన్ముక్తా దేశోద్దేశావిశేషిణీ।**
**వ్యపదేష్టుమశక్యాసావకథ్యా పరమార్థతః॥**

**ప్రతిపదార్థము:–** అసౌ = భైరవుని తత్త్వస్థితి, దిక్ = దిక్కులయొక్క, కాల = త్రికాలముల యొక్క, కలనా = గ్రహింపునుండి, ఉన్ముక్తా = విడువబడినది. దేశ = ప్రదేశములలోను, ఉద్దేశ = 'ఇది' అని ఉద్దేశించుటచేతను, అవిశేషిణీ = భేదము లేనిది, వ్యపదేష్టుమ్ = మనస్సులో అనుకొనుటకు, అశక్యా = అసాధ్యమయిన, అసౌ = ఈ తత్త్వదశ, పరమార్థతః = వాస్తవముగా, అకథ్యా = నోటితో చెప్పశక్యము కానిది.

**భావము:–** భైరవుని భైరవస్థితికి దిక్కులు కాలముల నియమము లేదు. అనగా, ఈ దిక్కు అని, ఈ కాలంలో ఉంటుందని చెప్పలేము. సర్వవ్యాప్తము. శాశ్వతము. అలాగే ఈ దేశంలో ఉంటుందని చెప్పలేము. 'ఇది' అని ఉద్దేశించి చూపలేము. రూపరహితమయిన అనుభవము కదా. కనుక ఆలోచనారూపమయిన పశ్యంతీ మధ్యమా వాక్కులకే అందని ఆ పరతత్త్వము వైఖరీవాక్కుకు ఎట్లు అందగలదు. కనుక భైరవతత్త్వమును స్పష్టముగా ఇది అని చెప్పలేము.

---

**15. శ్లో॥ అన్తఃస్వానుభవానన్దా వికల్పోన్ముక్తగోచరా।**
**యావస్థా భరితాకారా భైరవీ భైరవాత్మనః॥**



**ప్రతిపదార్థము:–** అంతః = మనస్సునందు, అనగా పూర్ణాహంతలో, స్వానుభవ = తన ఆత్మయొక్క అనుభవమనే, ఆనందా = ఆనంద స్వరూపమయినదియు, వికల్ప = వివిధమానసిక వృత్తులనుండి, ఉన్ముక్త = విముక్తులయినవారికి విముక్తమయిన దశలో, గోచరా = గోచరించునది అగు, భరితాకారా = పూర్ణాకారమయిన, యా = ఏ స్థితిగలదో, సా = అది, భైరవాత్మనః = భైరవ స్వరూపునియొక్క, భైరవీ = 'భైరవి' అనబడు, అవస్థా = దశ.

**భావము:–** భైరవునియొక్క తత్త్వస్థితి అనుభవైకవేద్యము. పూర్ణాహంతలో అనగా "ఆత్మ" తప్ప మఱి ఏదీ భాసించని స్థితిలో నిర్వికల్పమయిన గంభీరస్థితిలో పూర్ణమయిన జ్ఞానదశయే భైరవుని తత్త్వము. అదే ఆయన స్వరూపము. భరితాకారము = సమస్త విశ్వము భైరవుడే అన్న స్థితి. భరితమ్ = పూర్ణం అని అర్థము.

---

**16. శ్లో॥ తద్వపుస్తత్త్వతో జ్ఞేయం విమలం విశ్వపూరణమ్।**
**ఏవంవిధే పరే తత్త్వే కః పూజ్యః కశ్చ తృప్యతి॥**

**ప్రతిపదార్థము:–** తత్ = ఆ భైరవునియొక్క, వపుః = శరీరము, తత్త్వతః = తత్త్వరీత్యా, విమలమ్ = స్వచ్ఛమయినదిగను, విశ్వ = ప్రపంచమునకు, పూరణం = పూరకము అయినదిగాను, జ్ఞేయం = తెలిసికొనదగినది, పరే = పరమమయిన , తత్త్వే = తత్త్వము, ఏవంవిధే = ఇట్లుండగా, పూజ్య = పూజింపదగిన దేవత, కః = ఎవడు, తృప్యతి = తృప్తినొందును.

**భావము:–** భైరవుని శరీరము నిర్వికల్పస్థితిలో గ్రహించదగిన నిర్మలరూపము. దానియందు ఆయనగారి స్వాతంత్ర్యశక్తి భాసింపజేసిన జగత్తుగూడా కనబడని స్థితి. ప్రపంచమంతా శివరూపముగా ఉండే స్థితి. అదే నిర్మలస్థితి. అదే శరీరము సమస్త జగత్తును తన శక్తితో అవభాసనం చేస్తోంది కనుక అదే విశ్వపూరణము. ఈ స్థితిలో పూజ, పూజకుడు, పూజ్యుడు అంటూ '3' స్థితులు లేవు. ఉన్నదొకటే "పూర్ణాహంత" చిదానందఘనస్థితి. కనుక సాధారణస్థితిలో చేసే పూజలు. మొదలగునవి, అందుకు సంబంధించిన రూపవిశేషములు అన్నియు, బాహ్య క్రియాపటాటోపమే తప్ప తత్త్వదశ కాదు.

---

**17. శ్లో॥ ఏవంవిధా భైరవస్య యావస్థా పరిగీయతే।**
**సా పరా పరరూపేణ పరాదేవీ ప్రకీర్తితా॥**

**ప్రతిపదార్థము:–** భైరవస్య = భైరవునియొక్క, ఏవం విధా = యిటువంటి, యా = ఏ, అవస్థా = నిర్వికల్పమయిన పూర్ణాహంతావస్థ, పరిగీయతే = భైరవావస్థగా / భైరవిగా చెప్పబడుచున్నదో, సా = అది, పరరూపేణ = అతిశయరూపముచేత, పరా = 'పర' అయి, పరాదేవీ = పరాదేవిగా, ప్రకీర్తితా = చెప్పబడినది.

**భావము:–** ఇది భైరవావస్థ. దీనిని భైరవి అని, పర అని, పరాదేవి అని అనెదరు. కారణం ఏమంటే దాని రూపము, 'పరము' అనగా ఉత్కృష్టమయినది.

---

**18. శ్లో॥ శక్తిశక్తిమతోర్యద్వదభేదః సర్వదా స్థితః।**
**అతస్తద్ధర్మధర్మిత్వాత్ పరాశక్తిః పరాత్మనః॥**

**ప్రతిపదార్థము:–** శక్తి = శక్తికి, శక్తిమతోః = శక్తిమంతునకు మధ్య, సర్వదా = ఎల్లప్పుడు, అభేదః = అభేదము, యద్వత్ = ఎలా, స్థితః = ఉన్నదో, అతః = ఇందువలన, తత్ = ఆ పరబ్రహ్మముయొక్క, ధర్మ = సర్వజ్ఞత్వము మొదలగు ధర్మముచేత, ధర్మిత్వాత్ = ధర్మములు గలదగుటవలన, పరాత్మనః = పరమాత్మ యొక్క, శక్తిః = శక్తి, 'పరా' = 'పరాశక్తి' అని పిలువబడును.

**భావము:–** పూర్వశ్లోకములో చెప్పిన భైరవునియొక్క నిర్వికల్పావస్థ అనగా పూర్ణాహంతయే ఆయన స్వరూపము. ఇది శక్తి స్వరూపము. శక్తికి శక్తిమంతునకు ఎల్లప్పుడున్నూ అభేదమే. అగ్నికి దాని దాహకశక్తికి భేదము చూపముగదా! ఈ శక్తియే విశ్వనిర్మాణకారి అయిన భైరవరూపము. దీనికీ గుణములన్నియు భైరవుని నుంచి సంక్రమించినవే. సర్వజ్ఞత, సర్వకర్తృత్వము, సర్వాత్మత మొదలగు ధర్మములు సంక్రమించినవి. కనుక దీనిని 'పరాశక్తి' అందురు. పరమాత్మశక్తి కనుక, 'పరా' అయినది.

---

**19. శ్లో॥ న వహ్నేర్దాహికా శక్తిః వ్యతిరిక్తా విభావ్యతే।**
**కేవలం జ్ఞానసత్తాయాం ప్రారమ్భోఽయం ప్రవేశనే॥**



**ప్రతిపదార్థము:–** దాహికా = తగలబెట్టునట్టి, శక్తిః = అగ్నియొక్క శక్తి, వహ్నేః = అగ్నినుండి, వ్యతిరిక్తా = భిన్నముగా, న విభావ్యతే = కనబడుటలేదు. అయమ్ = అగ్నియొక్క ఈ దాహకస్వభావము, జ్ఞాన = అగ్నిజ్ఞానముయొక్క సత్తాయామ్ = ఉనికియందు, ప్రవేశనే = ప్రవేశింపజేయుటయందు, కేవలమ్ = కేవలము, ప్రారంభః = ప్రారంభదశ అగును.

**భావము:–** అగ్నినుంచి దాని దహనశక్తిని విడదీయలేము. అయితే అగ్నియెట్టిదో తెలిసికొనదలచిన వానికి దాని దాహక స్వభావము అగ్ని జ్ఞానసోపానములలో ప్రథమ సోపానము. అట్లే పరాశక్తి కూడా పరమాత్మనుంచి భిన్నముగా ఎప్పుడునూ దొరకదు. కాని పరాశక్తి పరమశివునిగూర్చి జిజ్ఞాసగలవానికి జ్ఞాన ప్రారంభమునకు తొలిమెట్టు. ఈమె ద్వారానే శివజ్ఞానము ప్రారంభమగును. ప్రథమగురువు ఈమెయే. అగ్నిగుణ జ్ఞానములో దాహకత్వము మొదటిది. తర్వాత వంటకు, చలికాచికొనుటకు ఇంకా అనేక ఉపయోగములకు పనికివచ్చుట తరువాత తెలిసికొనగలము. అట్లే "శక్తి" శక్తిమంతునియొక్క మొదటి గుణము. దానిద్వారా సర్వజ్ఞత, సర్వకర్తృత మొదలగు భైరవస్వరూపధర్మములు పరిచయము కాగలవు. కనుక తత్త్వరూపాంతర్గత మయిన 'శక్తి' భైరవ ప్రాథమికస్థితి కనుక భైరవజ్ఞానములో అది తొలిసోపానము.

---

**20. శ్లో॥ శక్త్యవస్థా ప్రవిష్టస్య నిర్విభాగేన భావనా।**
**తదాసౌ శివరూపీ స్యాత్ శైవీ ముఖమిహోచ్యతే॥**

**ప్రతిపదార్థము:–** శక్త్యవస్థా = పరమశివుని / భైరవుని పరాశక్తిరూపావస్థలోకి, ప్రవిష్టస్య = ప్రవేశించిన తాంత్రికునకు, భావనా = చిత్తవృత్తి, నిర్విభాగేన = నిర్వికల్పముగా అగును. తదా = ఆ నిర్వికల్పస్థితిలో, అసౌ = ఈ అనురూపుడయిన శివతాంత్రికయోగి, శివరూపీ = శివరూపుడు, స్యాత్ = అగును. శైవీ = ఈ శివశక్తి, ఇహ = ఈ తంత్రములయందు, ముఖమ్ = ముఖముగా, ఉచ్యతే = చెప్పబడును.

**భావము:–** శివయోగి తంత్రరీత్యా చేసిన నిర్వకల్పభావనలో శక్త్యవస్థలోనికి ప్రవేశిస్తాడు. అందులో శివుడు ఆయన ప్రాథమిక శక్తిస్థితిలో అనుభవమవుతాడు. అపుడు సాధకుడు శివునితో తాదాత్మ్యం చెంది శివరూపుడవుతాడు. శక్తి శివరూపంగానే శివావేశంతోనే ఉంటుంది. ఈ శక్త్యావేశం పొందినవాడున్నూ

శివుడే. కనుక శివ జ్ఞానానికి ఈ 'శైవశక్తి' ముఖద్వారము వంటిది. లేదా ఒక వ్యక్తిని తెలిసికొనటానికి ముఖం ఎలా ఉపయోగిస్తుందో ఈ శివుని తెలిసికొనటానికి 'శైవీశక్తి' అలా ఉపయోగిస్తుంది. అగ్నిని తెలిసికొనటానికి 'వాహకత్వశక్తి' ప్రధానము కదా! అట్లే ఇదిన్నీ. అనగా శివజ్ఞానానికి 'శక్తి'యే ప్రథమ, ముఖ్య ఉపాయము. ఎందుకంటే వారు అభిన్నంగా ఉంటారు కనుక. ఈ అభేదజ్ఞానమే పరావస్థ. అందులోనే మిగిలినది 'పూర్ణాహంత'. అదే శివశక్తి సామరస్యము అనవచ్చును. దీనినే 'విజ్ఞానభైరవదశ, బోధభైరవదశ' అందురు.

**విశేషములు:-** – 'రమణ మహర్షి బోధ'

శ్రీ రమణుల దివ్యబోధలలో ఈ ధారణాపద్ధతిని సుబోధం చేసే కొన్ని మాటలున్నాయి. వి. కృష్ణ సంకలనం చేసిన 'రమణమార్గం' నుంచి ఉటంకిస్తున్నాను. వీటిని చదివితే యీ ధారణా, భావనా పద్ధతుల ఆంతర్యము, పరంపరీణత అర్థమవుతాయి. చూ॥

''మనస్సు ఆత్మ తేజస్సుకు ప్రతిబింబం మాత్రమే. మనస్సు బాహ్యముఖమవటం అజ్ఞానం. అంతర్ముఖమవటం జ్ఞానం."

"మనస్సును అంతర్ముఖపరచి ఉద్ధృతంగా దూసుకువస్తున్న తలంపులను నిరోధించి హృదయస్థానాన్ని గుర్తించాలి. మనస్సు హృదయంలో మునగగానే నిశ్చలానందం ముంచెత్తుతుంది. అపుడు పరిపూర్ణ జ్ఞానం అవిచ్ఛిన్నంగా ప్రకాశిస్తుంది. మనస్సు హృదయం ఏకం అవుతాయి.

"నీవు అహం స్మృతిలో ఉన్నపుడు – ఆ ఒక్క ఆలోచనే తీవ్రంగా ఉన్నపుడు ఇతర తలంపులు వాటంతట అవే అంతరిస్తాయి."

నీవు జాగ్రత్తగా ప్రతి తలంపును పుట్టగానే కనిపెట్టి నిరోధిస్తుంటే క్రమంగా అంతర్ముఖుడవై ఆత్మలోనికి ప్రవేశిస్తున్నట్లు తెలిసికొనగలవు.

"అంతర్ముఖుడవై నీలోనికి మునిగి విచారిస్తే ఈ 'నేను' అదృశ్యమవుతుంది."

"అహంకారాన్ని తీసివేస్తే అవిద్య పోతుంది. అహంకారాన్ని పరీక్షిస్తే అహంకారం పోయి నిజమయిన ఆత్మ మిగులుతుంది."

"నేను" "నేను" అంటే ఆత్మ. 'నేను ఇది, నేను అది' అనేది అహంకారం. అదే 'మిథ్యా నేను'."





"నేను" అనేదే ప్రథమ తలంపు. 'నేను' పుట్టిన తరువాత ఇతర తలంపులన్ని కలుగుతున్నాయి... నీవు జాగ్రత్తగా ఈ 'నేనును' పట్టుకొంటే ఈ 'నేను' నిన్ను తన మూలమయిన ఆత్మలోనికి తీసికొనివెళ్లి అదృశ్యమవుతుంది."

"ఎపుడయితే మానవుడు ప్రథమంగా నిజాత్మను గ్రహిస్తాడో అపుడు ఏదో ఒక మహాశక్తి తన ఉనికి, సత్తానుండి ఆవిర్భవించి పెరిగి తనను లోగొంటుంది. ఆ శక్తి మనస్సునకు ఆవలిది."

"ఉన్నది ఒకే చైతన్యం. అదే 'నేను' అను తలంపుగా మారి దేహంతో తాదాత్మ్యం చెంది నేత్రాలద్వారా విషయాలను, ప్రపంచాన్ని చూస్తోంది. అగ్నినుండి ఒక కణం బయటకు వచ్చినట్లు ఆత్మనుండి అహంకారం బయటకు వస్తుంది. ఇది దేహంతో తాదాత్మ్యం చెందుతుంది."

**"మొదట్లో మనం ఆత్మను విషయంగా చూస్తున్నాం. కొంత సాధన చేసిన తరువాత 'ఆత్మను' – శూన్యంగా చూస్తాం. మరింత పురోగమించిన తరువాత ఆత్మను ఆత్మగా చూస్తాం. ఈ మూడవదశలో నిజానికి చూడడమంటూ ఉండదు. ఆత్మగా ఉండటమే."**

"మిథ్యా 'నేను'నే వేదాంతపరిభాషలో 'అహంకారం' అంటారు. ఇది జడమూ కాదు. చైతన్యమూ కాదు. చైతన్యమయిన ఆత్మను జడమయిన దేహాన్ని కలుపుతోంది అందుచేత దీనిలో జడచైతన్యములు రెండూ ప్రతిఫలిస్తున్నాయి."

"'నేను' పుట్టినచోటును వెదకమంటున్నాను. ఇంతవఱకే పురుషప్రయత్నం. అపుడు నీలోని ఆత్మే నిన్ను తనలోనికి గుంజివేస్తుంది."

"కనుక సూటిగా మనస్సు ఎక్కడ పుడుతుందో చూడు. మనస్సు అక్కడ లయిస్తుంది.

(కేనేషితం పతతి ప్రేషితం మనః – న దృష్టేః ద్రష్టారం పశ్యేః)

"ఒకసారి దైవానుగ్రహం నిన్ను పట్టుకొంటే వదలదు. ఆత్మదర్శనం చేయించి తీరుతుంది."

"ఆత్మ హృదయం. హృదయం స్వయంప్రకాశమయినది. హృదయం నుండి వెలుగు మెదడుకు ప్రసరిస్తోంది. ఇదే మనస్సుకు స్థానం... అంటే ఆత్మ ప్రకాశపరావర్తనంతో మనస్సు పనిచేస్తుంది.

"తంత్రశాస్త్రం హృదయాన్ని సూర్యమండలమని, సహస్రారాన్ని చంద్ర మండలమని పేర్కొన్నది."

"మనస్సు అంతర్ముఖం కాగానే ఆత్మ వెలుగు ఒక్కసారిగా ప్రవాహంలా వస్తుంది. పగటిపూట చంద్రుని మాదిరి ఆత్మ ప్రకాశంలో మనస్సు వెలవెలపోయి నిరుపయోగమవుతుంది."

(హృదయం ఛాతికి కుడివైపున అని, ఇది మాములు గుండె కాదని మహర్షి, ఇతర గ్రంథాలు చెప్తున్నాయి.)

"హృదయమే జీవునికి మూలస్థానం. ఇది ఆత్మయొక్క పరమకేంద్రం."

"మనస్సు అంతర్ముఖమయినపుడు 'ఆత్మ' అవుతోంది. బాహ్యాముఖమ యినపుడు అహంకారం అవుతుంది."

"మానసికజపం ఉత్తమం."

**"(ధ్యానం అంటే) నిజమయిన అర్థం ఒక విషయంపై దృష్టిని నిశ్చలంగా నిలపటం. నిజానికి ధ్యానమే మన స్వరూపం."**

"మొదట్లో మనకు ఏది ధ్యానం / సాధనంగా ఉందో చివరలో అదే లక్ష్యంగా మారిపోతుంది. ఆత్మస్వరూపం ధ్యానం కాకపోతే ధ్యానం మిమ్ములను ఆత్మదగ్గరకు ఎలా తీసికొని వెళ్లగలదు."

"ఆత్మను తెలిసికొనటానికి ఒకే ఒక సూటి, సులభమయిన మార్గం ఉంది – సకలేంద్రియసంచలనాన్ని నిలిపి ఉన్నట్లు ఉండటం – బి స్టిల్ –"

"భక్తులు భగవంతుడు, స్తుతులు – అంతా ఆత్మే."

"మనస్సు – ప్రాణం" ఒకచోటునుండి పుడుతున్నాయి. కనుక ఈ '2'లో ఏ ఒక్కదానిని నిగ్రహించినా రెండూ వశమౌతాయి. ప్రాణాయామం ద్వారా మనస్సును నిలపడమే యోగం."

"మనస్సు ఆత్మయొక్క పొర."

"మనస్సు తన మూలమయిన ఆత్మతో కలిసి ఆత్మే అయిపోతుంది."

"మనం పరిశీలించనంతవఱకే మనస్సుయొక్క బడాయి. పరిశీలించామా అదృశ్యమయిపోతుంది."





' 'ఆత్మయొక్క శక్తే మనస్సు. పదార్థానికి, శక్తికి భేదంలేదు. ఆధునిక విజ్ఞానశాస్త్రం "పదార్థం శక్తేనని అంగీకరిస్తోంది."

"అహంకారమే జీవుడు."

"దీక్షలన్నింటిలోనికి మౌనదీక్ష మహాశక్తివంతమయినది."

**మహర్షి చెప్పింది** "నేను" అన్న విషయం మీద ధారణ. అదే సూటి మార్గమన్నారు. ఈ శోధనలో ఆత్మానుగ్రహంవలన క్రమంగా ఒక మహాశక్తి ఆత్మజ్ఞానం కలిగిస్తుంది. విజ్ఞానభైరవంలోని ధారణల్లోనూ అదే జరుగుతుంది. ఇలా జరగటానికి యుక్తియుక్తమయిన ఒక మార్గము, హేతువు మహర్షి బోధలలో మనం గ్రహించవచ్చును. మనస్సు, అహంకారం, ధ్యానం, ధారణ – వీటి తత్త్వం గురించి పై మహర్షి బోధలలో ప్రామాణికంగా అయిన సమాచారం ఉంది. తద్వారా సాధ్యమయిన భావనలను ధారణ చేసి ఆత్మస్వరూప వివిదిషలో ముందుకు సాగవచ్చును. అందుకే యీ ముఖ్య బోధలను ఉదాహరించాను.

---

**21. శ్లో॥ యథాలోకేన దీపస్య కిరణైర్భాస్కరస్య చ।**
**జ్ఞాయతే దిగ్విభాగాది తద్వచ్ఛక్త్యా శివః ప్రియే॥**

**ప్రతిపదార్థము:–** ప్రియే = పార్వతీ!, దీపస్య = దీపముయొక్క, ఆలోకేన = వెలుగుచేత, భాస్కరస్య చ = సూర్యునియొక్క, కిరణైః = కిరణములచేత, యథా = ఎట్లు, దిగ్విభాగాది = దిక్కులు, పదార్థములు మొదలగునవి భేదము, జ్ఞాయతే = తెలిసికొనబడుచున్నదో, తద్వత్ = అట్లే, శక్త్యా = శక్తిచేత, శివః = శివుడు, జ్ఞాయతే = ఆయనయొక్క సర్వజ్ఞత్వాది ధర్మములు తెలిసికొనబడును.

**భావము:–** ప్రియ పార్వతీ! దీపప్రకాశమున సూర్యకిరణాలవలన మనకు, మన దిక్కులు, మన పదార్థాలు వాటితోబాటు దీపము దీపదిక్కులు, సూర్యుడు సూర్యదిక్కులు ప్రదేశాలు తెలుస్తాయి. అలానే శివుని శక్తివలన శివుడు, శివుని అనంతశక్తులు తెలుస్తాయి. అనగా శివశక్తి స్ఫారమువలన శివుని సర్వజ్ఞత్వాదులన్నీ తెలుస్తాయి. అందుకనే దేవికి "స్ఫురత్తా, అని, స్ఫురణా" అనియు పేర్లు. ప్రథమ స్పందము అనియు పేరు కనుక ఈ 'శైవీశక్తి లేదాపరాశక్తి' జ్ఞానమార్గమున ముఖ్య సోపానము. దీనివలననే 'శివోఽహం/భైరవోఽహం' అనే ప్రత్యభిజ్ఞ కలుగును.

దీపకాంతి సూర్యకిరణాలు దీపం కన్నా సూర్యునికన్నా భిన్నం కావు. దీపసూర్యులను చూడటానికి ముందు దీపసూర్యులు అవసరం కారు. అట్లే శివశక్తులు అభిన్నులు. స్వయంజ్యోతులు.

---

**శ్రీభైరవీ – ఉవాచ –** శ్రీభైరవీదేవి ఇట్లనెను.

**22. శ్లో॥ దేవ దేవ త్రిశూలాఙ్క! కపాలకృతభూషణ!।**
**దిగ్దేశకాలశూన్యా చ వ్యపదేశవివర్జితా॥**

**23. శ్లో॥ యావస్థా భరితాకారా భైరవస్యోపలభ్యతే।**
**కైరుపాయైర్ముఖం తస్య పరాదేవీ కథం భవేత్।**
**యథా సమ్యగహం వేద్మి తథా మే బ్రూహి భైరవ!॥**

**ప్రతిపదార్థము:–** త్రిశూలాంక! = త్రిశూలము చిహ్నము గలవాడా!, కపాల = కపాలములే, భూషణ = అలంకారముగాగలవాడా!, దిగ్ = దిక్కులోతోను, దేశ = దేశభేదముతోనూ, కాల = కాలభేదముతోను, శూన్యా చ = రహితమయినదియు, వ్యపదేశ = ఇది అనుపేరుతోను, వివర్జితా = రహితమయినదియగు, భరితాకారా = పూర్ణాహంతాస్వరూపమయిన అనగా పూర్ణరూపమయిన, భైరవస్య = భైరవుని యొక్క, యా = ఏ, అవస్థా = నిర్వికల్పశాక్తావస్థగలదో, సా = అది, కైః = ఏ, ఉపాయైః = ఉపాయములచేత, ఉపలభ్యతే = పొందబడును? "పరా" = "పర" అనబడు, దేవీ = ఆ దేవత, తస్య = ఆ భైరవునియొక్క, ముఖమ్ = ముఖముగా, కథమ్ = ఎట్లు, భవేత్ = అగును? భైరవ = ఓ భైరవా? అహమ్ = నేను, సమ్యక్ = చక్కగా, యథా = ఎలా, వేద్మి = ఎఱుగుదునో, తథా = అలా, మే = నాకు, బ్రూహి = చెప్పుము.

**భావము:–** త్రిశూలధారీ! కపాలీ! భైరవదేవా! దిగ్దేశాది సర్వవికల్పశూన్యమయిన నామరూపరహితమయిన భరితావస్థను భైరవస్వరూపంగా చెప్పారు. దానిని భైరవ ముఖంగా చెప్పారు. అది ఎలా భైరవముఖమయింది? ఆ అవస్థను సాధించటానికి ఉపాయములు ఏవి?

**విశేషములు:–** ఎ) శూలము అనగా ఆగమతంత్రము ప్రకారము ఇచ్ఛాజ్ఞాన క్రియా శక్తులు అనే '3' మొనలుగల స్వాతంత్ర్యశక్తియే. ఇది గలవాడు స్వతంత్రుడు శివుడు.



బి) కపాలములు అనగా అహోరాత్రములు రెండున్నూ రెండు కపాలములు. మఱియు, శబ్దార్థములు రెండు రెండు కపాలములు. వాటిద్వారానే భగవదభివ్యక్తి కనుక వాటిని ధరించినట్లు భావన. ఇందులో రాత్రి = పార్వతిరూపము, పగలు ఈశ్వరరూపము. వాక్కు = పార్వతి. అర్థం = పరమేశ్వరుడు.

సి) దేహబుద్ధి, ఉచ్చార, కరం, ధ్యానం, వర్ణ, బీజ, మంత్రాదులు ఉపాయములు. ఇవికాక ఆణవ, శాంభవ, శాక్తోపాయములు, అసలు అనుపాయము ఇలా అన్ని ఉపాయములే.

---

**శ్రీ భైరవ ఉవాచ – భైరవుడిట్లనెను.**

**24. శ్లో॥ ఊర్ధ్వే ప్రాణో హ్యధో జీవో విసర్గాత్మా పరోచ్చరేత్।**
**ఉత్పత్తిద్వితయస్థానే భరణాత్ భరితా స్థితిః॥**

**వాస్తవ ప్రతిపదార్థము:–**

వ్యాఖ్యానాల్లో దీనికి చాలా అర్థాలున్నాయి. వరుసగా వ్రాస్తాను.

వ్యాఖ్యాతలు రకరకాల అర్థాలు వ్రాశారు. అందులో ఊర్ధ్వ అధః అనే పదాలద్వారా వచ్చే ఊర్ధ్వ, అధో విషయాల నన్నింటిని తంత్రసంప్రదాయం ప్రకారం వ్రాశారు. అయితే అచ్చట ఉన్న పదాలకు ఉన్నది ఉన్నట్లుగా ఒక అర్థం వ్రాయటం అవసరమని యీ అర్థం 'వాస్తవ ప్రతిపదార్థం' పేరుతో వ్రాస్తున్నాను. చూ॥

ఊర్ధ్వే = పైన, హి = హకారమున అనగా 'హ్' నందు, ప్రాణః = ప్రాణము / ప్రాణవాయువు, అధః = క్రిందిదయిన, హి = హ / హ్ నందు, జీవః = జీవకమయిన అపానము ఉండును. విసర్గ = ఈ '2' హకారముల రూపమయిన విసర్గలే 'హ్', ఆత్మా = స్వరూపముగాగలది అయిన, జీవః = అపానరూపజీవుడు, వీరిని, విసర్గాత్మా = అంతరంగబహిరంగపదార్థసృష్టిరూపమయిన విమర్శశక్తి రూపమయిన, పరా = అనచ్క హకారరూపమయిన పరావాక్కు పరాశక్తి, ఉచ్చరేత్ = ఉచ్చరించును. నడచును. ఉత్పత్తి ద్వితయ = ప్రాణాపానములు పుట్టు బాహ్యాభ్యంతరములు '2' యొక్క, స్థానే = హృదయద్వాదశాంతములందు, భరణాత్ = నిత్యము స్పందించు 'స్ఫురణ'వలన, భరితా = ఆనంద పూర్ణమయిన, స్థితిః = భైరవీదశ కలుగును.

**భావము:–** శరీరమున పైన ప్రాణవాయువు, నాభిక్రింద అపానవాయువు, 'హ/హ్' రూపమయిన ధ్వనితో ఉండును. ఈ '2'ని విసర్గ అనగా 'హ్' రూపమయిన పరాశక్తి నడుపును. కనుక ఈ '2' ఉత్పత్తి స్థానమునందు పరాశక్తియందు అనగా శ్వాసరూప 'హ్'నందు ధారణ చేసినచో భైరవీదశ కలుగును.

"స్ఫురత్యాత్మా పరాశక్తిః బీజం విశ్వస్య కారణమ్।
తత్రావధానచిత్తస్య భూయో భూయో నివేశనమ్॥

– స్పందకారికా

అని చెప్పిన రీతిన ఆ పరాశక్తి పైన చిత్తధారణ చేయటమే ఈ ధారణా తాత్పర్యము.

వ్యాఖ్యానాలలో చాలా ప్రతిపదార్థాలున్నాయి. వాటిని వరసగా వ్రాస్తాను.
1. ఊర్ధ్వే = ఊర్ధ్వధ్యానశాంతమునందు, ప్రాణఃహి = ప్రాణము, అధః = బాహ్యద్వాదశాంతమునందున్న, జీవః = అపానరూప జీవుడు. వీరిని, విసర్గాత్మా = అంతరంగబహిరంగ పదార్థ సృష్టి రూపమయిన విమర్శశక్తి రూపమున, పరా = హకారరూపమున పరావాక్కు పరాశక్తి, ఉచ్చరేత్ = ఉచ్చరించును. నడుచును. ఉత్పత్తి ద్వితీయ = ప్రాణాపానముల పుట్టు బాహ్యాభ్యంతరములయొక్క, స్థానే =హృదయద్వాదశాంత మందు, భరణాత్ = నిత్యము స్పందించు స్ఫురణ వలన, భరితా = ఆనంద పూర్ణమయిన, స్థితి = భైరవీదశ కలుగును.

**భావము:–** ప్రాణము హృదయము నుండి ద్వాదశాంతముదాకాను, అపానము ద్వాదశాంతమునుండి హృదయముదాకాను నడుచును. ద్వాదశాంతమును ఊర్ధ్వంగాను, హృదయమును అధోభాగంగాను చెప్పారు. ప్రాణమును బ్రహ్మతత్వంగాను, అపానమును జీవతతత్త్వంగానూ భావించాలి. ఈ ప్రాణాపానసంచారము విసర్గరూపమయిన పరాశక్తివలన జరుగుతుంది. 'విసర్గ' అంతరంగ బహిరంగ పదార్థ సృష్టికర్త అయిన విమర్శశక్తియే. ఇది లేనిదే ప్రాణ ప్రవాహము జరుగదు. ఈ శక్తి అక్షరరూపము 'హ' కారము. 'హ' ధ్వని లేనిదే ప్రాణసంచారము లేదుగదా!

అకారము పరమేశ్వరుడు. అదే ప్రాణము. అది పుట్టుచోటు హృదయము. అచ్చటనుంచి ద్వాదశాంతం దాకా సాగుతుంది. మ కారము ద్వాదశాంతములో పుట్టుంది. అది అపానము. అది హృదయములోనికి చేరును. ఈ 2 స్థానాలు హృదయద్వాదశాంతములు ప్రాణపానములకు ఉత్పత్తిస్థానములు. ఈ '2'





స్థానములందు జరుగుచున్న స్ఫురణను భైరవీశక్తి స్పందముగా ధారణ చేసిన వానికి 'భైరవస్థితి' అను పూర్ణదశ లభించును.

**విశేషములు:–** 1. మనము వదలు గాలి మన ముక్కునుంచి ఆకాశములో ఒక చోటివఱకు వేగముగా శ్వాసరూపముగా ప్రసరించి గాలిలో కలిసిపోవును. గాలిలో కలియుటకు ముందు స్థితి అనగా శ్వాసరూపమును కోల్పోవు స్థితి ద్వాదశాంతము. ఇది స్వరప్రశ్న స్వరయోగములలో ప్రసిద్ధమయిన విషయము. ఇది బాహ్య ద్వాదశాంతము. తర్వాత దీని నుంచి వెనక్కు / క్రిందికి హృదయము అంతః ద్వాదశాంతము.

2. దీనికి ద్వాదశాంతమని పేరు వచ్చుటకు కారణము – ఈ చోటు హృదయము నుండి కొలిచి 12 అంగుళములుగా గుర్తించారు. ద్వాదశ = 12. ద్వాదశాంతము అనగా 12 అంగుళములు కొలత ముగిసే చోటు అని అర్థము. ఇక హృదయము అనగా సుషుమ్నా మధ్యభాగము. సుమారుగా మన ఱొమ్ము మధ్యభాగము. అచ్చట నుంచి ప్రాణము=శ్వాస 12 అంగుళములు బయటకు నడుచును.ఇది ఊర్ధ్వము. హృదయము అధోభాగము. దానికిది దీనికది ద్వాదశాంతములు. ఇందు బాహ్య ద్వాదశాంతము శివద్వాదశాంతము. అంతర్ద్వాదశాంతము శక్తిద్వాదశాంతము.

3. విసర్గము అనగా విసృష్టి, సృష్టి వైవిధ్యము. మఱియు విసర్గలుః. వీటి ఉచ్చారణ. హకార స్వరూపము. హకారము దేవీ స్వరూపముగా శివశక్తి సమ్మేళనముగా చెప్పారు. హ్ + అ = హ్ = అనగా అచ్చులేని హ కారము. దీనినే **అనచ్కము** అంటారు. అది అచ్చము దేవీ స్వరూపము. అకారము = అనుత్తరాకారము అంటారు. అదే ప్రాణము, పరమేశ్వరస్వరూపము. ఈ '2' కలిసినది 'హ' కారము. అదే మాయా ప్రతిబింబితచైతన్యము. లేదా చైతన్య ప్రతిబింబితమాయ. దీనినుంచి సృష్టి ప్రారంభము. ఈమె స్ఫురించనిదే జగత్తే లేదు. కనుక 'అకార హకారాల' మధ్య అలాగే శివజీవుల మధ్య, బ్రహ్మ విశ్వముల మధ్య, ఆత్మ – దేహముల మధ్య ఈ పరాశక్తి తప్పక స్పందించును. అదే ఆమె 'ఉచ్చరించటం' అంటే. కనుక హృదయద్వాదశాంతముల మధ్య స్పందించడము ప్రాణాపాన సంచారము లోని 'హకార' ధ్వని అనగా శ్వాసధ్వని యీ జగజ్జననియొక్క శబ్దరూపముగా భావించి ఆమె పయి ధారణ కొనసాగించినచో తప్పక హఠాత్తుగా 'భైరవీస్థితి' లభించును అని తంత్రతాత్పర్యము. "ఆయతనవాన్భవతి' అన్నట్లు.

**ప్రతిపదార్థము-2 :-** ఊర్ధ్వే = పైన ద్వాదశాంతమునందు, ప్రాణః = ప్రాణము అనగా బ్రతుకుట అను పేరుగల ఒక చిత్తవృత్తి (అ), అధః = హృదయస్థానమున, విసర్గాత్మా = అంతరంగ బహిరంగ పదార్థసృష్టిరూపముగల వాడు అయిన (హ), జీవః = అపానరూపజీవుడుండును. పరా = పై వారినిగూడా పరయే (0), ఉచ్చరేత్ = ఉచ్ఛరించును అనగా అంతశ్చక్రమున ఉండి 'అహం' అని ప్రకాశింపజేయును. ఉత్పత్తి = ద్వాదశాంతము, ద్వితయ = 2వది అయిన హృదయముయొక్క, స్థానే = స్థానమునందు, భరణాత్ = మనస్సును ధారణ చేయుటవలన, భరితా = పూర్ణమయిన, స్థితిః = భైరవస్థితి కలుగును.

**భావము:-** ఊర్ధ్వమున జీవనమను (ప్రాణము) చిత్తవృత్తి ఉంటుంది. హృదయము నందు జీవుడు ఉంటాడు. అతను అపాన స్వరూపుడు. లోపల బయటను పదార్థసృష్టికి సాధనమయినవాడు. ఈ '2' జీవజీవనముల మధ్య ప్రకాశం కలిగించేది ''అహం' అను పరాశక్తియే. అచ్చట ధారణ చేసినచో తప్పక సర్వదృశ్యజగత్తు మాయమయి పూర్ణస్థితి అనగా భరితస్థితి అనగా భైరవీతాదాత్మ్యము వచ్చును.

**విశేషములు:-** 1. అపానము అనగా సాధారణభాషలో వాడే తప్పు అర్థము కాదు. ప్రాణపంచకములోనిది ఇది. దీని పని తిన్నదానిని త్రాగినదానిని క్రిందకు నడపడం. తరువాత ఇంకా క్రిందకు అనగా బయటకు నెట్టడం దీనిపని. **బయట ఉన్న ప్రాణవాయువును ఇది లోపలికి తింటుంది కనుక ఇది బాహ్యములో పుట్టి హృదయములోనికి వస్తుందని చెప్పారు.** దీనివలన బ్రతుకుతాము కనుక ఇదే 'జీవుడు'.

2. లోపల బయట ఉన్న పదార్థాలు జీవభావన కనుక అవి జీవసృష్టి క్రిందలెక్క.

3. అంతశ్చక్రము అంటే షట్చక్రాలు అని అర్థము కాదు. షట్చక్రాలలో పేర్చబడిన అక్షరచక్రము. అది 'అ'కారంతో మొదలయి 'హ' కారముతో పూర్తి. అంతశ్చక్రము నందు సమానంగా ఎక్కి ఉండేది పరావాక్కు అనబడు పరాశక్తి. అనగా సర్వవర్ణములందు 'నాద' రూపంగా ఉండే శక్తి యొక్క ఆద్యరూపమే ''పరా''. జీవుడు తనకు తెలియకుండా పరను ఉచ్చరిస్తాడు. ఈ 'పర' ఉచ్చారాలను అన్నింటిని నడుపుతుంది. దీనినే 'అహం' అనే పేరుతో పిలుస్తాము. అహం అనగా అకారము నుండి హకారమువరకు వ్యాపించిన నాదస్వరూపమును 'నేనే' అన్న



అనుసంధానమును చేయగా చేయగా నాదాంతస్వరూపుడయిన భైరవుని భరితస్థితి లభించునని సంగతి.

**ప్రతిపదార్థము-3:-** ఊర్ధ్వమ్ = ఇంద్రియ ప్రసారమార్గమయిన తలయందు దానినుంచి బయటకు, ప్రాణః = ప్రాణము అనగా ప్రాణవాయువు, అధః = క్రింది విషయములందు అనగా ప్రపంచమునందు, విసర్గాత్మా = విషయములందు ప్రవేశించిన, జీవః = అపానరూపుడయిన, విషయ భోగి అయిన జీవుడు, పరా = పరాశక్తి, ఉచ్చరేత్ = ప్రకాశించుచుండును. నడుపుచుండును. ఉత్పత్తి = ప్రాణాపానము ఉత్పత్తి స్థానములయిన లేదా ప్రాణజీవుల ఉత్పత్తి స్థానములయిన, ద్వితయ = హృదయ ద్వాదశాంతములు '2' యొక్క స్థానే = స్థానమునందు, భరణాత్ = వ్యాప్తివలన / ధారణవలన, భరితా = పూర్ణమయిన, స్థితిః = భైరవీస్థితి కలుగును.

**భావము:-** ఇంద్రియములు ప్రసరించేది ఆకాశమార్గం ద్వారా తలద్వారా గదా! కనుక ఊర్ధ్వం అంటే ఇంద్రియప్రసారహేతువయిన ప్రాణము. సూక్ష్మముగా నాదంగా స్పందిస్తూ ఉంటుంది. బాహ్యవిషయాలను మనకు తెలియపరుస్తుంది. అందువలన **ఇది గ్రాహకము.** అపానము అనేది ఈ విషయములందు గ్రాహ్యము లందు భోగం కొఱకు ప్రవేశించే జీవుడు. అనగా అన్నము అన్నభోక్తవంటివారు. ఈ 2 స్థితులలోను అనుసంధానంగా పరాశక్తి ప్రకాశిస్తూ ఉంటుంది. గ్రాహ్యమయిన ఈ అపానజీవుడు హృదయంలోను, గ్రాహక ప్రాణము ద్వాదశాంతములోను శక్తియొక్క పూర్ణస్థితిని ధారణ చేసినచో, 'భైరవీస్థితి' కలుగును.

**విశేషములు:-** ఇక్కడనుంచి ఈ 5 అర్థాలు శివోపాధ్యాయుడు ఈ శ్లోకానికి చెప్పిన అదనపు అర్థాలు. ఆయన వ్యాఖ్యపేరు **'వివృతి'**

**ప్రతిపదార్థము-4:** ఊర్ధ్వే = ప్రాణపానములుదయించే చోటు – ద్వాదశాంతమున, ప్రాణః హి = అకారము అను అచ్చు, అధః = క్రింద అనగా అన్ని అక్షరాలకు చివర, జీవః = హకార రూపుడైన జీవుడుండును. విసర్గాత్మా = విసర్గలోని 'హ' కారోచ్చారణ స్వరూపమయిన, పరా = నాదరూప పరాశక్తి, ఉచ్చరేత్ = వీటిమధ్యన స్ఫురించును. ఉత్పత్తి = అకారహకారముల జన్మస్థానములయిన, ద్వితయ=హృదయ ద్వాదశాంతముల జంటయొక్క, స్థానే = స్థానమునందు, భరణాత్ = అకార హకార విమర్శరూపధారణవలన, భరితా = పూర్ణమయిన, స్థితిః = భైరవీస్థితి కలుగును.

**భావము:-** అకారము సమస్తభాషాశబ్దములకు మూలము. అన్నిటికీ చివరిది హకారము. కనుక 'అహ' అనటం వలన సమస్తశబ్దరాశిని చెప్పినట్లయింది. 'హ' కారములోని 'హ్' అనునది అనచ్క హకారము అంటారు. ఆ రూపముతో పరాశక్తి స్ఫురించును. ఈ 2 హృదయద్వాదశాంతములనే అకార హకార స్థానములందు ధ్యానమును (ధారణ) చేసినచో తప్పక భైరవీస్థితి స్ఫురించును. అనగా 'అనచ్క హ' వీటికి నాదరూపంతో సర్వవర్ణాలతో అభిన్నంగా ప్రకాశించుచున్న నాదమయిని అనుసంధానించినచో ప్రపంచతత్త్వరూపమయిన అభేదరూపమయిన భైరవతత్త్వము గోచరించును.

**ప్రతిపదార్థము - 5 :-** ఊర్ధ్వే = ఉన్నతస్థానమున, ప్రాణః హి = అహంతా పరామర్శ రూపమయిన ప్రాణము. అధః = నిమ్నదశలో, విసర్గాత్మా = విషయ రూపుడయిన, జీవః = ఇదంతా పరామర్శ రూపమయిన జీవుడు, పరా = పరాశక్తి, ఉచ్చరేత్ = వీరిని భాసింపజేయును. ఉత్పత్తి = ప్రమేయముయొక్క, ద్వితయ = ప్రమాణ (దీనితో ప్రకాశ్యము ప్రకాశకము ఉండును) స్థానే = విశ్రాంతి స్థానమైన ప్రమాతయందు, భరణాత్ = ధారణ చేయుటవలన, భరితా = పూర్ణరూపమయిన, స్థితిః = భైరవస్థితి లభించును.

**భావము:-** ప్రాణము అంటే అహంతాస్ఫురణ. దీనిలో ఇచ్ఛ, జ్ఞాన, క్రియాశక్తులు ఉండును. అహంత వలననే విశ్వం వచ్చింది. దీనినుంచి 'ఇదంత' అనగా "ఇది, నాది" అనే స్ఫురణ వచ్చింది. ఇదే జీవదశ. 'జీవుడు'. అపానము అనవచ్చును. ప్రాణము ఊర్ధ్వ లేదా ఉత్తమదశ. జీవుడు అధమదశ. ప్రాణముయొక్క ప్రమేయము లోని వాడు జీవుడు. జీవులు పరాశక్తివలన సంసారంలో ఉంటున్నారు. ఈ శక్తి విశ్వంతో అభిన్నంగానే ఉంటుంది.

ప్రమేయప్రమాణములు ప్రమాత అయిన ఆత్మయందు లయమవుతాయి. అట్టి ప్రమాత స్థానంమీద ధారణవలన పరాశక్తి రూపమయిన ఆనందం పొందిన సాధకునకు "భైరవదశ" లభించును. ప్రాణము = ప్రమాణము. జీవుడు = ప్రమేయము. ఈ '2' కలియుచోటు 'ప్రమాత'. ఈ స్థానమున ధారణవలన 'భైరవస్థితి' లభించును.

**విశేషములు:-** శ్రీ రమణమహర్షి ప్రసంగాల్లో గూడా ఈ భావనా విషయాలు వచ్చాయి.



1. జపమనగా అన్యాలోచనలను అన్నింటిని పరిత్యజించి ఒకే ఆలోచనకు అంటి పెట్టికొని ఉండుట - అని అర్థము. అదే జపముయొక్క ప్రయోజనము. అదే ధ్యానమునకు దారితీయును. ధ్యానము ఆత్మానుభవముగా పరిణమించును.

2. ఆలోచనారాహిత్యమయిన ఇచ్ఛాశక్తి లభించునా అన్న ప్రశ్నకు సమాధానంగా "అంతకంటే ఒక ఆలోచనకు పరిమితమగుటవలన లభించుననుట మంచిది. చివరకు శుద్ధచైతన్యమును మిగిల్చి యీ ఆలోచన గూడా అదృశ్యమగును. అ స్థితిని పొందుటకు ఏకాగ్రత వ్యక్తికి సాయపడును.

**ప్రతిపదార్థము - 6:-** ఊర్ధ్వే = శుద్ధాధ్వయందు, ప్రాణో హి = ప్రాణము, అధః = క్రిందదయిన అశుద్ధాధ్వయందు, జీవః = మనుష్యరూపుడయిన జీవుడు. (ఆత్మతత్త్వము), విసర్గాత్మా = విసర్గరూపమయిన, పరా = పరాశక్తి వీరి మధ్యన, ఉచ్చరేత్ = స్పందించును. ఉత్పత్తి = పుట్టుకకు సంబంధించిన, ద్వితయ = శుద్ధ - అశుద్ధ అను మార్గ ద్వయముయొక్క, స్థానే = స్థానమునందు, భరణాత్ = వ్యాప్తివలన, ధారణవలన, భరితా = పూర్ణమయిన, స్థితిః = భైరవీదశవచ్చును.

**భావము:-** పరమశివునివద్దనుంచి మాయవఱకు శుద్ధ - అధ్వ అంటారు. మాయతో మొదలుకొని చివరి వఱకు అశుద్ధ అధ్వ అంటారు. కారణం మాయవలన శుద్ధత తగ్గిపోయినది కనుక దృశ్యసృష్టి అంత అశుద్ధాధ్వ. దీనిలో శివాత్ భిన్నం అనే భావన ఉంటుంది. దీనికన్న ముందుది శుద్ధ - అధ్వ. అందులో శివునితో అభేద భావన ఉంటుంది. కనుక శుద్ధము. ఈ శుద్ధ అశుద్ధాధ్వల మధ్య శివుని స్వాతంత్ర్య శక్తి అయిన 'పరా' శక్తి ప్రకాశంతోనే ఉంటుంది. ఈ '2' మధ్యన ధారణ చేయడం ద్వారా సాధకుడు భైరవీస్థితిని పొందుతాడు.

**ప్రతిపదార్థము - 7:-** ఊర్ధ్వే = అనుత్తరుడుయిన అకారస్వరూపుడయిన పరమాత్మ సన్నిధియందు, ప్రాణ = హకార రూపమయిన వర్ణము. అధః = దానికి క్రింద లోకంలో దేహంతో, విసర్గాత్మా = విసర్గ (ః) రూపమయిన లేదా సకార రూపమయిన, జీవ = జీవుడుండును. పరా = పరాశక్తి, ఉచ్చరేత్ = 'హం - స' అని ఉచ్చరించుచుండును. ఉత్పత్తి = హకార సకారములయొక్క ఉత్పత్తి స్థానముయొక్క, ద్వితయ = హృదయముద్వారా శాంతము అను '2' యొక్క, స్థానే = స్థానమునందు, భరణాత్ = వర్ణస్వరూపచింతన అనే ధారణవలన, భరితా = పూర్ణమయిన, స్థితిః = భైరవీదశవచ్చును.

**భావము:-** హకారము ప్రాణము, సకారము/ ః , జీవుడు హకారము/ 0, దేవుడు పరాశక్తి, కొందరు హ = దేవుడు, స = జీవుడు అందురు. ఏదయినా అహమ్ – సః, నేను – పరమాత్మ. హం – స – అనేవి మనము శ్వాసవదలడం, తీసికొనడంలో హంసమంత్రము, సాగుతున్నట్లు లెక్క. దానినే **'అజపా'** అంటారు. ఇది పరాశక్తి స్వయంగా చేసేపని. ఇందులో జీవునికి ఆ భావన ఉండదు. యాంత్రికంగా జరిగే ప్రక్రియ. హంస ఉత్పత్తి స్థానములయిన హృదయద్వాదశాంతములందు మనసుపెట్టి హంసనాదమునందు ధారణ చేసినచో భైరవీదశ సిద్ధించును.

**సారాంశము:-** మొత్తంమీద ప్రపంచమున సృష్టినుంచి దేహముదాక లోపల బయట జరిగే 'రాకపోకలు' వాటిమధ్యనున్న సంధానశక్తి వాటిమీద మనసు నిలపటం ద్వారా భైరవీదశ సిద్ధించును. అది ఆయా ఉపాసకులు వారి తంత్రాలు – వీటినిబట్టి ఉంటుంది. సాధారణ యోగులు ఎక్కువగా అజపా విధానమును, స్వరవిధానమును ఆచరించడం ఉన్నది. మనవైపు సంప్రదాయం ఇది. మా గురువుగారు శ్రీతాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు అజపా మంత్రసిద్ధులు. మిగిలినవి ఆయా ప్రాంతాచారమునుబట్టి ఉండవచ్చును. ఇందు హృదయ ద్వాదశాంత ప్రాణాపాన సంచార విషయము స్వరప్రశ్న, పేరుతో జ్యోతిషములోకి ప్రవేశించినది. ప్రశ్నమార్గములో ప్రథమభాగములో దీని ప్రస్తావన ఉన్నది.

---

## ధారణ - 2 (కుమ్భక)

**25 శ్లో॥ మరుతోఽన్తర్బహిర్వాపి వియద్యుగ్మానివర్తనాత్।**
**భైరవ్యా భైరవస్యేత్థం భైరవి! వ్యజ్యతే వపుః॥**

**ప్రతిపదార్థము:-** భైరవి = ఓ భైరవీ! మరుతః = ప్రాణాపానరూపవాయువు యొక్క, వియద్యుగ్మ = 2 ఆకాశముల నుండి అనగా హృదయద్వాదశాంతములనుండి, అనివర్తనాత్ = మఱలక పోవుటవలన (అనువర్తనాత్ అని పాఠాంతరము. అంటే పెట్టుకొని కాసేపు అదే స్థితులో ఉండడం వలన) భైరవ్యాః = భైరవి చేత, భైరవస్య = భైరవునియొక్క, వపుః= శరీరము, అనగా తత్త్వము, వ్యజ్యతే = వ్యక్తము చేయబడును.

18



**భావము:-** ప్రాణము హృదయమునుండి బాహ్యద్వాదశాంతముదాకా అనగా బయట 12 అంగుళములదాకా సాగి గాలిలో కలియును. అట్లే అపానము అదేచోట మొదలయి హృదయంలోనికి వచ్చి లీనమగును. ఈ '2' స్థితులలో మొదటిదయిన ప్రాణము ఆగి 2వదయిన అపానము మొదలగు సందర్భములో ఒక్కక్షణము విశ్రాంతి అనగా శూన్యస్థితి వంటిది కలుగును. అలానే అపానము హృదయములో లీనమయి మఱల ప్రాణము బయలుదేరు విషయములోనూ ఈ స్థితి కలుగును. హృదయాకాశంలో ఒకటి బాహ్యాకాశములో ఒకటి జరుగును. ప్రాణాపానములు ఇలా తిరిగిరాని క్షణాలను, 'మధ్యదశ' అంటారు. ఈ మధ్యదశలోనే యోగులకు భైరవి దయవలన భైరవస్వరూపము వ్యక్తమవుతుంది.

**విశేషములు:-** 1. భైరవీభైరవరూపము అని అర్థము చెప్పవచ్చు. శివుడు ధర్మి , శక్తిమాన్, భైరవి = శక్తి శివధర్మము. వీరు నిత్యానపాయులు. ప్రకాశవిమర్శ స్వరూపము. కనుక భైరవివలన భైరవీసహిత భైరవస్వరూపము వ్యక్తమగును.

2. ఊపిరి తీసుకొన్న సందర్భములో అది పూర్తిగా లోపలికిపోయి లీనమవుతుంది. మఱల ఒక క్షణములో పుట్టి బయటకు వస్తుంది. ఆ క్షణమే తుటి. తుట్యర్థం = భైరవుడు తుట్యర్థం భైరవి అని తంత్రాలోకము మొ॥ గ్రంథములు. దీనిని అంతస్తుటి అంటారు. అట్లే లోపలినుంచి బయటకు వెళ్ళిన గాలి పూర్తిగా ద్వాదశాంతమున లీనమవుతుంది. మఱల అచ్చట అపానం మొదలయి హృదయంలోనికి ప్రవేశించును. ఇందులో ద్వాదశాంతమున లీనమయిన స్థితి బాహ్యతుటి. దాని తుట్యర్థాలున్ను భైరవీభైరవులే. వీటియందు అనగా ఈ మధ్య దశలందు ధారణ చేయుటవలన భైరవతత్త్వము దర్శనమగును. అనగా ఊపిరి పూర్తిగా పీల్చిన చివరిదశ పూర్తిగా వదలిన దశలోనూ ఉండే విరామక్షణము మీద అనుసంధానము చేసినచో తుటిరూపులయిన భైరవీభైరవులదర్శనమగును. ఇది సారాంశము. ఈ '2' స్థితులు 2 కుంభకములు.

3. శైవదర్శనములో ప్రమాతలు 7గురు.

1. శివుడు = శివశక్తులు కలిసి శివ ప్రమాత.
2. మంత్రమహేశ్వరుడు = సదాశివుడు.
3. మంత్రేశ్వరుడు = ఈశ్వరుడు.
4. మంత్రుడు = శుద్ధవిద్య.

5. విజ్ఞానకలుడు = మాయీయమలావృతుడు.

6. ప్రలయాకలుడు = మాయీయ, కర్మమలావృతుడు.

7. సకలుడు = మాయీయ, కర్మ, ఆణవమలాకృతుడు. మనవంటి పురుషులు.

ఇందులో ఇవన్నీ పరిమితుడయిన ప్రమాతయొక్క భేదములు. పూర్ణ పరమశివుని లోని భేదాలు కావు. వీరిలో మొదటి 4 మంది శుద్ధ – అధ్వలోనివారు. మిగిలిన '3' మంది అశుద్ధ – అధ్వలోనివారు. ఇందులో సకలునకు ఈ ఉపాయాలు అవసరము.

4. శ్వాసలో పూరక రేచక కుంభకములు సహజంగానే జరుగుతాయి. పూరకం అనగా గాలిలోనికి పీల్చడం. రేచకం అనగా గాలివదలడం. కుంభకం అనగా గాలిని లోపల ఒక్కక్షణం నిలపడం. ప్రాణాపానాలను హృదయ ద్వాదశాంతాలలో అలా నింపటం ఆంతరకుంభకం బాహ్యకుంభకం అంటారు. ఈ స్థితులను జాగ్రత్తగా ధారణ అనగా పట్టి పరిశీలన చేయటం వలన భైరవతత్త్వము వ్యక్తమగును.

**విశేషములు:–** హృదయము, కంఠము, తాలువులు, లలాటము, బ్రహ్మరంధ్రము, ద్వాదశాంతము – వీటియందు ప్రాణము. హృదయము, ముఖము, ద్వాదశాంతము వీటియందు అపానము నడుచును. ప్రాణము లీనమయిన తర్వాత అపానము పుట్టకముందు ఒక కుంభకము బాహ్యకుంభకము. ఇది బాహ్యద్వాదశాంతమున ఏర్పడును. అపానము లీనమయి ప్రాణము పుట్టేలోపు హృదయంలో అంతః కుంభకము / ఆంతరకుంభకము ఏర్పడును. ఇదే మధ్యదశ. ఇదే తుటి. ఒక క్షణకాలము ఇది ఏర్పడును. ఈ క్షణము యోగి అంతర్ముఖంగా ఉండి ఆ స్థితిని ధారణ చేయటం వలన 'భైరవస్వరూప' దర్శనం అవుతుంది.

---

## ధారణ - 3

**26 శ్లో॥ న వ్రజేన్న విశేత్ శక్తిః మరుద్రూపా వికాసితే।**
**నిర్వికల్పతయా మధ్యే తయా భైరవరూపతా ॥**

**ప్రతిపదార్థము:–** మరుద్రూపా = ప్రాణరూపమయిన, శక్తిః = ప్రాణరూపశక్తి, నవ్రజేత్ = హృదయమునుండి ద్వాదశాంతముదాకా పోరాదు. మరుద్రూపా =



అపానరూపమయిన, శక్తిః = శక్తి, న విశేత్ = ద్వాదశాంతమునుండి హృదయము లోనికి ప్రవేశింపరాదు. నిర్వికల్పతయా = వికల్పాభావరూపమయిన ఉపాయముతో, మధ్యే = మధ్యనాడి అయిన సుషుమ్న, వికాసితే = వికసింపజేయబడినది కాగా, తయా = ఆ వాయురూపశక్తిచేత, భైరవరూపతా = 'నేను భైరవుడును, అన్న పూర్ణాహంత సిద్ధించును.

**భావము:–** ప్రాణవాయువు బయటకుపోరాదు. అపానవాయువు బయటనుంచి లోపలకురారాదు. అనగా యీ స్థితి బాహ్యకుంభక, అంతరకుంభకములందు సిద్ధించును. ముఖ్యంగా అంతరకుంభకము అనగా 'కుంభక ప్రాణాయామములో సిద్ధించును. సాధారణంగా యోగులు సుషుమ్నను తెరిచేందుకు కుంభకమును ఉపయోగించెదరు. ఈ కుంభకమువలన మనస్సు నిశ్చలమవుతుంది. అందువలన వికల్పములు, సంకల్పములు ఉండవు. అదే నిర్వికల్పస్థితి. ఆ స్థితిలో సాధకునికి భైరవీస్థితి లభించును. అనగా మనస్సును కుంభకస్థితులందు ధారణ చేసినచో 'భైరవీస్థితి' సిద్ధించును.

**విశేషములు:–** 1. మనలో ఉన్న భగవంతుని తత్త్వాన్ని మనం కనుగొనలేము. అందుకు కారణము మన ఇంద్రియ వశస్థితి. ఇంద్రియ ప్రసార కారణము మనస్సు బుద్ధి అనబడు అంతఃకరణము. ఇది ఆగినచో ఇంద్రియవ్యాపారములు ఆగును. అది ఆగినచో మనస్సు చచ్చినట్లే. నిర్వికల్పత ఏర్పడుతుంది. అపుడు భగవంతుని రూపం తెలుస్తుంది. అంటే మనస్సు ఆగటం తేలికకాదు. దాన్ని 2 రకాలుగా ఆపవచ్చు. 1. మనస్సును బుద్ధితో సాక్షిగా కలపటం. 2. గాలిని బంధించటం ద్వారా మనస్సును బంధించడం. / మనస్సు – గాలి ఒకదానికొకటి అవయవాలు. అంతఃకరణమే భావప్రధానమయినది. మనస్సు క్రియాప్రధానమైనది. మనస్సు ఒక కోతి అయితే ప్రాణం దానితోక వంటిది. అందువలన ఏది పట్టినా అందులో ఒకటి ఆగుతుంది. కనుక ఈ యోగపద్ధతిని కుంభకం చేయడం ద్వారాగాని, కుంభకమును భావనచేయడంద్వారా గాని భైరవస్థితి పొందవచ్చును.

శ్లో॥ సర్వాః శక్తీః చేతసా దర్శనాద్యాః
స్వే స్వే వేద్యే యౌగపద్యేన విష్వక్।
క్షిప్త్వా మధ్యే హాటకస్తంభభూతః
తిష్ఠన్ విశ్వాకార ఏకోఽవభాసి॥ – కక్ష్యాస్తోత్రం

భగవంతుడు మనస్సుతో దర్శనాది ఇంద్రియశక్తులను ఆయా విషయములందు వ్యాపింపజేసి మేల్కొల్పి శరీరమునందు స్తంభంవలె విశ్వరూపుడై ఈశ్వరుడు ఒక్కడే ఉంటాడు అని కక్ష్యాస్తోత్రం చెప్పింది. అట్టి పరమేశ్వరుని వైపు చూచినంతనే మనస్సు మన్మథునివలె చస్తుంది. అదే

యం పశ్యన్ దీపదర్శం సపది మనసిజః కీటనాశం సనష్టః।
స్వాంతే యోంతః పురీయత్యతిభజన కృతః తం కుమారీయతి ద్రాక్॥
మూలస్తంభాయతే యః త్రిభువన భవనే కోకిలాలాపినీ యమ్।
వామాంగే కల్పవల్లీ శ్రయతి కువ లయశ్యామలా తం భజామి॥

అనే శ్లోకంలో ఉన్న విషయము.

2. ఇలాగే శరీర మధ్యంలో కూటం వలె సర్వసాక్షిగా ఉన్న పరమేశ్వరుని భావించుచు తమతమ కార్యములను చేయటవలనగదా ఉపయోగము సిద్ధించును. భగవద్గీతలో చెప్పినట్లు 'ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్' అనే స్థితి.

3. నిమీలన సమాధి ఉన్మీలనసమాధి అని సమాధి 2 రకాలు. అందులో ఉన్మీలన సమాధి అనేది అసంగకర్మయోగానికి శిఖరము. దీనిలో ఇంద్రియవ్యాపారాలు జరుగుతున్నట్లే ఉంటుంది. కాని మనస్సు పూర్తిగా లక్ష్యంమీదనే ఉంటుంది. ఇది మన 'పరధ్యాస' వంటిది. చూచేవారికి అతను సమాధిలో ఉన్నాడని తెలియదు. ఈ సమాధియే ఇంద్రద్యుమ్నుణ్ణి పరీక్షిత్తును ముంచింది. కళ్ళు తెఱచికొని చూచిగూడ తమను అగౌరవించారని ఇంద్రుద్యుమ్నుని అగస్త్యుడు, శృంగితంఢ్రి అయిన శమీకమహర్షిని, పరీక్షిత్తు శాపతాపాలతో ఇబ్బందిపెట్టి తామూ ఇబ్బందిపడ్డారు. దీనినే 'భైరవీముద్ర' అంటారు.

**అంతర్లక్ష్యోబహిర్దృష్టిః నిమేషోన్మేషవర్జితా।**
**ఇయం సా భైరవీ ముద్రా సర్వతంత్రేషు గోపితా॥**

ఇదంతా కుంభకంవలనగాని భావనవలనగాని మధ్యనాడి వికాసం పొందిన తర్వాత జరుగుతుంది.

4. ఈ స్థితిలోని యోగి తనను అద్దంగాను, తనలోని ఇంద్రియ వికారాలన్నీ దర్పణదృశ్యమాననగరీరూపంగాను, (దక్షిణామూర్తి స్తోత్రంలో చెప్పినట్లు) భావిస్తాడు. ఈ రకమయిన ధ్యానాగ్నిలో జ్ఞానాగ్నిలో ఈ వికారాలను భస్మీకరించి తన రూపాన్ని



అందుకొంటాడు. ఈ సందర్భంలో ఇంద్రియాలు గూడా తటస్థములుగా దేవతారూపంగా ఈ యోగిస్వరూపాన్ని మౌనంగా చూస్తుంటాయి. ప్రాణాపాన గతులు శాంతించిన తర్వాత వచ్చిన అస్పందావస్థలో మధ్యనాడీ వికాసంలో మెరిసే మెఱుపే, 'భైరవీదశ'.

5. ధ్యానం 3 రకాలు.

ఎ) స్థూలధ్యానము = మూర్తిధ్యానము. దేవతామూర్తిని ధ్యానించుట.

బి) జ్యోతిఃధ్యానము = తేజోధ్యానము. జ్యోతిరూపంగా ధ్యానించడం.

సి) సూక్ష్మధ్యానము = బిందుధ్యానము

ఈ ధ్యానం నాభి హృదయం, భ్రూయుగ్మం వద్ద చేయాలి.

"నాభిహృత్భ్రూయుగాన్యాహుః ధ్యానస్థానం మనీషిణః । –యోగరసాయనం

సి) బిందుధ్యానము / సూక్ష్మధ్యానము

దీనిలో కుండలినీశక్తి నేత్రరంధ్రమునుండి బయటకు వచ్చి విహరించును. ఇదే శాంభవీముద్ర / భైరవీముద్ర / వైష్ణవీముద్ర అంటారు. "బహుభాగ్యవశాద్యస్య కుండలీజాగృతాభవేత్ ఆత్మనస్యమాయోగేన నేత్రరంధ్రాద్వినిర్గతా విహరేద్రాజమార్గేచ చంచలత్వాన్న దృశ్యతే.

ఈ ధ్యానం సర్వప్రశస్తమని యోగసర్వస్వంలో ఉంది.

---

## ధారణ - 4

**27 శ్లో॥ కుమ్భితా రేచితా వాపి పూరితా వా యదా భవేత్।**
**తదన్తే శాన్తనామాసౌ శక్త్యా శాంతః ప్రకాశతే ॥**

**ప్రతిపదార్థము:–** శక్తిః = వాయుశక్తి, రేచితా వాపి = రేచకం చివఱ, కుంభితా = కుంభకము చేయబడినదిగను, పూరితా వాపి = పూరింపబడినదై, కుంభితా = కుంభకము చేయబడినదిగను, యదా = ఎప్పుడు, భవేత్ = అగునో, తదంతే = దాని చివర, అసౌ = ఈ సాధకుడు, శాంతనామా = శాంతమయిన నామ రూపములుగల శివుడుండును, కనుక శక్త్యా = వాయుశక్తిచేత, శాంతః = శాంతభైరవరూపుడుగా, ప్రకాశతే = వ్యక్తమగును.

**భావము:–** 25వ శ్లోకంలో చెప్పిన బాహ్యకుంభకం ఆంతరకుంభకం (ఎక్కువగా ప్రసిద్ధం) వీటి చివరి స్థితిలో భైరవుని శాంతరూపము వ్యక్తమగును. శాంతమనగా నామరూపవికారములు లేని విశ్వోత్తీర్ణ రూపమని అర్థము. ఈ దశకు చేరిన సాధకుడు “తత్త్వమసి” న్యాయంతో శాంతమయిన భైరవత్వమును పొందును.

**విశేషములు:–** హృదయమునుండి మొత్తము గాలి బయటకు వదలడం ‘రేచకం’ దాని తరువాత అచ్చట మళ్ళీ “గాలి” ని సంతరించడం – బాహ్య కుంభకం. అట్టి గాలితో లోపల పొట్టనింపడం ఆంతరకుంభకం. ఈ 2 స్థితులలో ధారణ చేసినచో భైరవోదయము.

---

## ధారణ – 5 (కుణ్డలినీ జాగ్రణ)

**28 శ్లో॥ ఆ మూలాత్ కిరణాభాసాం సూక్ష్మాత్ సూక్ష్మతరాత్మికామ్।**
**చిన్తయేత్ తాం ద్విషట్కాన్తే శామ్యన్తీం భైరవోదయః॥**

**ప్రతిపదార్థము:–** ఆ మూలాత్ = మూలాధార చక్రమునుండి, కిరణ = కిరణములతో, ఆభాసామ్ = భాసించునదియు, సూక్ష్మాత్ = సూక్ష్మముకన్న, సూక్ష్మతర = మఱింత సూక్ష్మమైన, ఆత్మికామ్ = స్వరూపముగలదియు, ద్విషట్క = 2 × 6 = 12 చక్రములయొక్క అంతే = చివఱ అనగా ద్వాదశాంతమునందు, శామ్యంతీమ్ = భైరవునిలో లీనమగుచున్న, తామ్ = ఆ వాయుశక్తిని, చింతయేత్ = ధ్యానింపవలయును. అపుడు, భైరవ = భైరవదశయొక్క, ఉదయః = ఉత్పత్తి అగును.

**భావము:–** మూలాధారమునుండి లేదా హృదయమునుండి పైన ద్వాదశాంతం వఱకు కిరణములు వెదజల్లుచూ క్రమక్రమంగా సూక్ష్మపరిమాణం అవుతూ ద్వాదశాంతమున (బ్రహ్మరంధ్రం వద్దకు) భైరవునిలో లయమొందునట్లు ధ్యానింపవలయును. అచ్చట సాధకునికి భైరవోదయమగును. కనుక ఆ శక్తిని ఆసక్తిగా ధ్యానింపవలెను.

**విశేషములు:–** ద్వాదశాంతం అనే సంజ్ఞకు ‘2’ అర్థాలు ఉన్నాయి. 1. ముక్కునుంచి శ్వాస బయలుదేరి 12 అంగుళాలు సాగి ఆగేచోటు. ఇది బాహ్య ద్వాదశాంతం 2. ముక్కునుంచి గాలి లోపలికి హృదయందాకా ‘12’ అంగుళాలకు సాగి ఆగటం



ఆంతర ద్వాదశాంతము. ఇదిగాక ఇంకొక 2 అర్థాలున్నాయి.

1. మూలాధారము నుంచి భ్రూమధ్యం వఱకు 6 చక్రాలు. ఎ) మూలాధారము బి) స్వాధిష్ఠానము సి) మణిపూరము డి) అనాహతము ఇ) విశుద్ధము ఎఫ్) ఆజ్ఞ = స్థూలచక్రాలు.

ఆజ్ఞనుంచి ఓంకారము 6 సూక్ష్మచక్రాలుగా బ్రహ్మరంధ్రము దాటి ద్వాదశాంతము (పిలక పెట్టుకొనే చోటు) దాకా వెళ్లి అచ్చట పీఠకచక్రములో ఆగును. సహస్రారం శక్తిస్థానము. ఇది బిందుస్థానము. బ్రహ్మస్థానము. కనుక స్థూలచక్రాలు 6 సూక్ష్మచక్రాలు 6. కలిసి 12 చక్రాలు. ద్వాదశ అనగా 12. వీటి చివర గనుక “ద్వాదశాంతము”. ఓంకారము యొక్క 6 సూక్ష్మచక్రములు ఇవి. అర్ధచంద్ర, రోధిని, నాదం, శక్తి, వ్యాపిని (సమన, ఉన్మన) అని 6 చక్రాలు. ‘సమన ఉన్మన’ వద్ద అకారభేదం లేదు. కాగా ఈ 6 దశలు దాటి ఓంకారము **“మహాబిందువులో”** లీనమగును.

2. ఇంకొకవరస జన్మాగ్ర, మూలాధార, మూలకంద, నాభి, హృత్, కంఠ, తాలు భ్రూమధ్య లలాట, బ్రహ్మరంధ్రశక్తి, వ్యాపిని – అని మొత్తం 12 చక్రాలు. వీటి చివరను ద్వాదశాంతం అనెదరు. ఏదయినను మొత్తం మీద ద్వాదశాంతము 1. శ్వాసపరంగా 2. చక్రపరంగా ‘2’ రకాలు.

అందులో ఈ శ్లోకంలో చక్రపరమయిన ద్వాదశాంతమే (పీఠకచక్రము) చెప్పబడింది.

---

## ధారణ –6

**29 శ్లో॥ ఉద్గచ్ఛన్తీం తడిద్రూపాం ప్రతిచక్రం క్రమాత్క్రమమ్।**
**ఊర్ధ్వం ముష్టిత్రయం యావత్ తావదన్తే మహోదయః॥**

**ప్రతిపదార్థము:–** ప్రతిచక్రమ్ = ప్రతిచక్రమునందును, క్రమాత్క్రమమ్ = వరసగా, ముష్టిత్రయం యావత్ = ‘3’ పిడికిళ్ల దూరం ఎంతో, తావత్ = అంతవఱకు, ఉద్గచ్ఛంతీమ్ = పైకి వచ్చుచున్న, తటిద్రూపామ్ = మెఱుపువంటి దానినిగా ధ్యానింపవలయును. అంతే = ఆ ముష్టి త్రయావిధి చివర, మహోదయః = మహాభైరవదశ ఉదయించును.

**భావము:–** ముష్టి = 4 అంగుళములు. 4 × 3 = 12 అంగుళములు. ఇవే 12

చక్రముల అవధి. గత శ్లోకములో మూలాధారమునుండి ద్వాదశాంతముదాకా కిరణాలు వెదజల్లుచు సూక్ష్మతరముగా పైకి వచ్చుశక్తిని చింతించడం చెప్పాడు. ఇందులో అదే శక్తి మెఱుపుతీగలా మెరుస్తూ ఒక్కొక్క చక్రమే ఎక్కి వెలిగించుచూ వచ్చే సోపానక్రమంలో ధ్యానించవలెనని చెప్తున్నాడు. అట్టి స్థితిలో చివరిచక్రం పూర్తయిన తరువాత అచ్చటనే భైరవదశ వస్తుంది.

**విశేషములు:-** సాధారణంగా అపానగతిని ఆపి దాని బలంతో ప్రాణాన్ని ముందుకు కుంభకంతో బలంగా నెట్టే వాయువు సుషుమ్నలో ప్రవేశిస్తుంది. ఆ స్థితిలో లేచిన, 'కుండలిని' సుషుమ్నలో ఊర్ధ్వయానం అదే దేవయానం చేసి పరమశివునిలో ఒక క్షణం లీనమవుతుంది. ఇట్టి విషయము ఇచ్చట '6'వ ధారణగా చెప్పబడినది.

---

## ధారణ - 7

**30 శ్లో॥ క్రమద్వాదశకం సమ్యగ్ ద్వాదశాక్షరభేదితమ్।**
**స్థూలసూక్ష్మపరస్థిత్యా ముక్త్వా ముక్త్వాన్తతశ్శివః॥**

**ప్రతిపదార్థము:-** స్థూల = స్థూలమయిన, సూక్ష్మ = సూక్ష్మమయిన, పర = పరమయిన, స్థిత్యా = దశతో, సమ్యక్ = చక్కగా, ద్వాదశ = 12, అక్షర = అక్షరములచేత, భేదితమ్ = భేదింపబడిన, క్రమ = క్రమములో ఉన్న చక్రములయొక్క ద్వాదశకమ్ = '12'ను, ముక్త్వా ముక్త్వా = వదలి వదలి, అంతతః = చివర, శివః = భైరవుడుదయించును. లేదా సాధకుడు భైరవుడగును.

**భావము:-** ఈ శ్లోకములో చేసిన ధ్యానములో 12 అక్షరములతో 12 చక్రములను భేదించినట్లుగా గూడా భావించుట ఇందలి ప్రత్యేకత. అచ్చులు = 16. అందులో 4 అచ్చులు నపుంసకములు. అవి 'ఋ ౠ, ఌ ,ౡ' వీటిని వదలగా '12' అచ్చులు. వరసగా ఇవి ఆయా చక్రములో ఉండినవి. ఆయా చక్రాలను భేదించును. ఇందులో నాభివరకు స్థూలముగాను, తర్వాత సూక్ష్మతరముగాను 'శక్తి' నడుచును. ధ్యానంలో ఈ నాదం మొదట స్థూలంగా, అనగా అక్షరనాదరూపంగా, తర్వాత సూక్ష్మరూపంగా అనగా, స్పందనగా, పరంగా అంటే జ్యోతిరూపంగా మారుచు ద్వాదశాంతమున లీనమగును. ఈ సోపానములో ఆగి ధారణ / ధ్యానం / చింతన చేసి కొంచెం ఆగిన తర్వాత ముందుకు పోవలెను.





**విశేషములు:-** స్థూల సూక్ష్మ పరములు అనగా ఉపాయములు అని కూడా అర్థము చెప్పవచ్చును.

ఎ) క్రియలు - యాగము మొ॥ స్థూలోపాయములు.

బి) ప్రాణాయామమును భావన చేయడం సూక్ష్మ ఉపాయం.

సి) అష్టాంగ / హఠయోగాదుల ద్వారా కుండలినీ ద్వారా భైరవస్థితికి చేరటం - పరోపాయం.

ఇందులో 2వది జ్ఞానమార్గము వంటిది. పిపీలికా మార్గము. '3'వది విహంగమ మార్గము.

---

## ధారణ - 8

**31 శ్లో॥ తయాపూర్యాశు మూర్ధాన్తం భంక్త్వా భ్రూక్షేపసేతునా।**
**నిర్వికల్పం మనః కృత్వా సర్వోర్ధ్వే సర్వగోద్గమః॥**

**ప్రతిపదార్థము:-** మనః = మనస్సును, నిర్వికల్పమ్ = వికల్ప రహితంగా, కృత్వా = చేసి, భ్రూక్షేప = కనుబొమ్మల మెట్టు అను, సేతునా = వంతెనతో, భంక్త్వా = కలిపి లేదా విరిగి / లేదా విరిచి, తయా = ఆ ప్రాణశక్తితో, మూర్ధాంతమ్ = శిరుస్సుయొక్క చివరను అనగా ద్వాదశాంతమును, ఆశు = వెంటనే, ఆపూర్య = నింపి, సర్వోర్ధ్వే = అన్నింటికన్నా (12 చక్రాలకన్నా) పైన, సర్వగ = సర్వవ్యాప్తమయిన భైరవావస్థయొక్క, ఉద్గమః = ఉదయము జరుగును.

**భావము:-** ప్రాణశక్తిని ద్వాదశాంతమునకు తరలించడానికి మనస్సును నిర్వికల్పము అనగా విషయసంకల్పములు లేని దానినిగా చేయాలి. తరువాత ఆజ్ఞాచక్రస్థానమున భ్రూమధ్యమను మెట్టును / వంతెనను ఆధారంగా చేసికొని ద్వాదశాంతము దాక ప్రాణశక్తిని వ్యాపింపజేసి పరకావేశంలో భైరవస్థితిని పొందవలెను.

**విశేషములు:-** 1. నిర్వికల్పము అంటే మరొక అర్థము వాయుశక్తితో భ్రూమధ్యమును భేదించి మనస్సును నిర్వికల్పసమాధిలో లయింపజేసి ద్వాదశాంతమును చేరి - అని అర్థము చెప్పవచ్చును.

2. భ్రూమధ్యము మనస్సుయొక్క స్థానమని అచ్చటనుంచి మనస్సు అధోముఖముగ

ప్రారంభమగును అని యోగశాస్త్రము. అచ్చటి శక్తిని మిథునశక్తిగాను, శివశక్తి ద్వంద్వముగాను, పార్వతీపరమేశ్వరులుగాను, అర్ధనారిగను, ద్విభుజకృష్ణునిగను చెప్తారు. ఈ శక్తిని, 'శివదూతి' అంటారు. అనగా శుద్ధమూర్తి అయిన శివుని వద్ద నుంచి మలినమయిన ప్రపంచము వైపు వచ్చునది గనుక 'శివదూతి' అని పేరని మా గురువుగారు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రులవారి వివరణము. ఇట్టి శివదూతియే భైరవీశక్తి. ఆమెను పట్టి ఊర్ధ్వగతి అయిన సాధకునకు 'శివుని ఆస్థానము' లభించును.

3. ఈమె అభ్యాసాతిశయజ్ఞాత. ఆ అభ్యాసమే ఈ ధారణా కదంబము. అది పట్టుకొని షడధ్వలు అనగా షట్చక్రమార్గము లేదా శైవతంత్రోక్తషడధ్వలు దాటి భైరవుని చేరవలెను. అందువలన ఈ శక్తి 'షడధ్వాతీతసుభగ'.

4. భ్రూస్థానము – రుద్రగ్రంధి. అచ్చటనుంచి దేహము దేహాభిమానము కలుగును. అదే మనస్సుయొక్క స్థానము 'ఫాలస్థేంద్రధనుః ప్రభా' అనగా ఈ శక్తి ఫాలము వైపుకు దోసికొను సందర్భములో మనస్సుకు సంబంధించిన వికల్పములయొక్క 'ఇంద్రధనుస్సు' రంగుల 'చిత్కళ'ల్లో వెలుగుతూ ముందుకు సాగుతుంది. కనుక దానిని ఒక కాలిమెట్టుగా – క్షేపంగా భావించి ఆ సేతువు ద్వారా ద్వాదశాంతమును చేరవలెను. ఈ విషయము ఈశ్వర సత్యనారాయణశర్మగారి సౌందర్యలహరీ వ్యాఖ్యలో చూడదగును. దాని సారాంశము ఇక్కడ వ్రాస్తాను = 5

'మృషాకృత్వా గోత్రస్థలనమథ వైలక్ష్యనమితం
లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే।
చిరాదంతశ్శల్యం దహనకృతమున్మూలితవతా
తులాకోటిక్వాణైః కిలికిలితమీశానరిపుణా॥ – 86

ఈ శ్లోకార్థము శివుని శృంగారం విషయం. ఆయన పొరపాటు న 'గంగ' పేరెత్తాడు. దేవికి కోపము వచ్చిందట. తన చరణకమలంతో భర్తను లలాటం మీద తన్నిందట. సత్యభామ శృంగారంలాగా ఉందిది. ఆమె అందెలు గల్లుమని మ్రోగినవి. ఆ మ్రోత ఇంతకాలం పరాభవాన్ని మనసులో దాచుకొని ఉన్న మన్మథుడు నవ్వినట్లుందట! అద్భుతమయిన ఈ శృంగారకల్పనలో భగవతి భగవంతుని లలాటంమీద తన్నటం ఒక చమత్కారకల్పన. ఈ కల్పనకు ఆధారమయిన యోగవృత్తాంతం చెప్పారు శర్మగారు.





వైలక్ష్యం ఇంటే లక్ష్యరహితదృష్టి అయిన శాంభవీముద్ర. లలాటం అంటే ఆజ్ఞాచక్రము. క్రిందనుండి బయలుదేరిన కుండలిని ఆజ్ఞాచక్రందాటి ముందరికి వేగంగా వెళ్ళటమే యీ శృంగారమునకు యోగభూమిక, అని శర్మగారు వ్రాశారు. ఆజ్ఞాచక్రమువఱకు దేహాభిమానముండును. ఆ దేహాభిమానాన్ని దాటి ఒక్క ఉదుటున వేగంగా సహస్రారంవైపు పరుగిడే నాదమయి నాదధ్వని అందెలరవము కావచ్చును.

6. సాంబపంచాశికలో '50'వ శ్లోకం వద్ద వివృతికారుదు క్షేమరాజు సేతుబంధము గూర్చి చెప్పాడు.

**స్థిత్వా కించిన్మన ఇవ పిబన్ సేతుబంధస్య మధ్యే**

సేతుబంధము అంటే వంతెన. అదే భ్రూమధ్యం. సుషుమ్నలోనిదది. ఇడా పింగళ అను దేవధూమయానాలమధ్య వేసిన బ్రహ్మయానసేతువు. దానిమీదుగా ఊర్ధ్వయానం చేయాలి. దీనినే వ్యాఖ్యాత క్షేమరాజు "నిరోధికోర్ధ్వశక్త్యా తటద్వయాంతర్వాహిప్రాణాపానాద్యుత్తరణోపాయ నాద, నాదాత్మ సృష్టి నిరుద్ధ సమస్తకరంధ్రమార్గే స్థిత్వా" అని చెప్పాడు. ఇడా పింగళలే ప్రాణాపానములు. వాటి నిరోధకమయినది ఊర్ధ్వశక్తి. ప్రాణాపానమును దాటుటకుపాయము నాదము. నాదరూపమయినది సృష్టి. దీనివలన బ్రహ్మరంధ్రమార్గము నిరుద్ధమయి ఉన్నది. కనుక ఇట్టి భ్రూమధ్యసేతువుద్వారా మనస్సును చంపి ద్వాదశాంతమును నాద / వాయు / ప్రాణశక్తితో నింపడం వలన భైరవదశాసిద్ధి కలుగును. ఇదంతా యోగంలో క్రియారూపము. ఇందులో భావనారూపము.

---

## ధారణ-9

**32 శ్లో॥ శిఖిపక్షైశ్చిత్రరూపైః మణ్డలైశ్శూన్యపఞ్చకమ్।**
**ధ్యాయతోఽనుత్తరే శూన్యే ప్రవేశో హృదయే భవేత్॥**

**ప్రతిపదార్థము:–** 1. (శూన్య పంచకము అనగా సూర్యాకాశము. తత్త్వాకాశము. మహాకాశము. చిదాకాశము. పరాకాశము. లేదా – వాక్కు, శబ్దము, చెవి, సమానము, జ్ఞానము లేదా అహంకారము, చిత్తము, బుద్ధి, మనస్సు, జ్ఞానము మఱియు మామూలు ఆకాశములోనే ఉన్న భాగాలు 5. అనగా పైనది, క్రిందది మధ్యది '2' ప్రక్కలది మొత్తం 5 ఆకాశములు లేదా పంచతన్మాత్రలుగా అవ్యక్తంగా ఉన్న పంచభూతతత్త్వములు శూన్యపంచకము.)

1. చిత్రరూపైః = విచిత్రమయిన స్వరూపముగల, శిఖిపక్షైః = నెమలి రెక్కలతోను, మండలైః = అందలి పింఛముతోనున్న , శూన్యపంచకమ్ = ఆకాశపంచకమును, హృదయే = తన హృదయాకాశమునందు, ధ్యాయతః = ధ్యానించువానికి, అనుత్తరే = పరమమయిన, శూన్యే = భైరవరూపమయిన ఆకాశమునందు, ప్రవేశః= ప్రవేశము, భవేత్ = అగును.

**భావము:–** మనకు 5 వైపుల ఉన్న ఆకాశములలో లేదా నెమలికి '5' వైపుల (పైన క్రింద మధ్యన 2 ప్రక్కల) ఉన్న ఆకాశమునందు చిత్ర విచిత్ర వర్ణాలతో ఇంద్రధనుస్సు వంటి రెక్కలు, అందులోని వృత్తములుగల పింఛముండును. దీనిని తన హృదయంలో ధ్యానించినవానికి భైరవీదశ. అనగా ప్రపంచమును శూన్య పంచకరూపంగా ధ్యానించాలి. 5 ఇంద్రియాలు '5' శూన్యాలు. అవి రూపరసగంధాది చిత్త భేదం గలవు. చివఱకు ఇవి శూన్యములే. కనుక శూన్యములు. లేదా మొదట్లో చెప్పిన రకరకాల శూన్యములు. ఈ చిత్ర స్వభావము మనో వాసనాభేదాలు. మనస్సే ఒక నెమలి దాని రెక్కలు సంకల్ప వికల్పాలు. వాటినిండా ఇంద్రియాకాంక్షలు. ఈ విధంగా ప్రపంచమంతా తనకు 5 వైపులా ఉన్నట్లు నెమలితో పోల్చడం ఆ విధంగా ధ్యానించడం వలన ఈ ప్రపంచమంతా 'మాయ' అని గ్రహింపు వస్తుంది. తద్వారా 'పరమభైరవీదశ' సిద్ధించును.

2. శిఖిపక్ష చిత్రరూపైః = అని పాఠాంతరము. దీనికర్థము శిఖిపక్ష = నెమలిరెక్కలవలె, చిత్రరూపైః = విచిత్రమయిన రూపరసాదినానారూపములుగల, మండలైః = ఇంద్రియములచేత, శూన్య = పంచతన్మాత్రలుగానుండుటవలన అవ్యక్తముగా / శూన్యముగానున్న విషయపంచకమును అనగా రూపరసగంధస్పర్శ శబ్దాలను, హృదయే = హృదయమునందు, ధ్యాయతః = ధ్యానించువానికి, అనుత్తరే = శివరూపమయిన, శూన్యే = శూన్యమునందు, ప్రవేశః = ప్రవేశము, భవేత్ = అగును.

**భావము:–** మొదటి అర్థంలో ప్రత్యక్షంగా నెమలిని చూసి దానిని తనతో పోల్చుకొని ఆధ్యాత్మికార్థమును భావించడం వచ్చింది. రెండవ అర్థంలో 'రచయిత' స్వయంగానే ఆధ్మాత్మికార్థం నెమలి ఉపమానంతో చెప్పడం అయింది. మొత్తంమీద తాత్పర్యం ఒకటే. నెమలిచుట్టూ ఉన్న ఱెక్కలు పింఛాలవలె తనచుట్టూ ఇంద్రియాలు, వాటికి సంబంధించిన రూపరసగంధాది విచిత్రవిషయాలున్న రంగురంగుల ప్రపంచ మున్నది. దీనిని దీని తత్త్వాన్ని భావింపగా 'పరమ భైరవీదశ' లభించును.



**విశేషములు:–** 1. మండము అనగా రససారము లేదా మీగడ. అట్టి విషయ సారమును గ్రహిస్తాయి కనుక మండలములు అనగా ఇంద్రియాలు.

2. శూన్యపంచకం అంటే మఱొక అర్థం వ్రాశారు. యోగినీహృదయదీపికలో అమృతానందనాథుడు. అది ఓంకార భేదపరముగా ఉన్నది.

హ్రీం – హ్ + ర్ + ఈ + ం - U -
ఓం – అ – ఉ – మ – ం - U -
ఇందులో ర్ = శూన్యం
ం = శూన్యం 1 బిందు
తర్వాత అర్ధచంద్ర ( U ) నాదముల మధ్య 'రోధిని' (2)
నాద – శక్తులమధ్య నాదాంతము (3)
శక్తి – సమనలమధ్య వ్యాపిక (4)
సమనా ఉన్మనీ – మధ్య శూన్యం (5)

'5' శూన్యాలు చిత్రవర్ణాలు. ఇవి పింఛాకారాలు. అందుకే అచ్చటికి వచ్చిన కుండలిని 'ఫాలస్థేంద్రధనుఃప్రభా' అని లలితాసహస్రనామస్తోత్రములో చెప్పబడినది. వాటిని 'చిత్కళలు' అనవచ్చును. 6వ శూన్యం అనగా ఉన్మనీ / ఉన్మనా – అది పరమాకాశము.

3. ప్రణవాకారము

'హ్రీం లేదా ఓం' మీదగాని అర్ధచంద్రంతో ఇవి మొదలు. అర్ధచంద్రం దృశ్యరూపమే. ఇది భ్రూమధ్యమున సాక్షాత్కరించును. మనం వ్రాతలో గూడా ప్రణవం, బీజాక్షరాలమీద ' ◡̇ ' ఇలా చూపిస్తాము. ఈ అర్ధచంద్రరూపము తరువాత భ్రూమధ్యనుంచి

రోధిని – △ (ఊర్ధ్వ త్రికోణం)
నాదము – %
నాదాంతము (మహానాదం) – ⌐ (నాగలి)
శక్తి – |00
వ్యాపిక – △̥
సమన (మనోన్మని) – ¡
ఉన్మనీ / ఉన్మన – !

తరువాతది మహాబిందుశివు – ○

కనుక రోధిని వద్దనుండి 'సమన' వఱకు సూక్ష్మ షట్చక్రాలనుకోవచ్చు. వీటినే బిందువు (ఫాలమధ్యలో) నుంచి ఉన్మన వఱకు 'నాదనవకం' అంటారు. భ్రూమధ్యంలో అందెల ధ్వని వంటిది వినబడుతుంది.

4. కొందరు శూన్యషట్కం అంటారు. 'ఉన్మనీ + మహాబిందు' కలిసి 6వ శూన్యం అంటారు.

5. రోధిని వెన్నెలవలె, నాదం పద్మరాగంవలె, నాదాంతం మెఱుపువలె ప్రకాశించును. ఇదంతా ధ్యానంలో.

6. అర్ధచంద్రంనుంచి తురీయావస్థ ప్రారంభము, నాదాంతము తుర్యాతీతావస్థలోకి లయమగుట ప్రారంభము.

---

## ధారణ - 10

**33 శ్లో।। ఈదృశేన క్రమేణైవ యత్ర కుత్రాపి చిన్తనా।**
**శూన్యే కుడ్యే పరే పాత్రే స్వయంలీనా వరప్రదా।।**

**ప్రతిపదార్థము:–** ఈదృశేన = ఇంతకుముందు చెప్పినటువంటి, క్రమేణైవ = పద్ధతి / వరస చేతనే, యత్ర కుత్రాపి = తనలోనేకాక, ఎక్కడయినా, శూన్యే = ఆకాశమునందయినను, కుడ్యే = గోడయందయినను, పరే = ఇతరవ్యక్తి యందయినను, పాత్రే = యోగ్యునియందయినను, స్వయమ్ = తనంతతానుగా, లీనా = వ్యాపించిన / అణగిన, చింతనా = ధారణ, వర = శ్రేయస్కరమయిన స్థితిని, ప్రదా = ఇచ్చునది అగును.

**భావము:–** మూలాధారమునుంచి ద్వాదశాంతమువఱకు ఇదే క్రమంతో చేసే యీ భావన తనయందే చేయాలని నియమం లేదు. ధారణ బాగా కుదిరితే గోడమీద నయినా, ఆకాశములోనయినా ఇతరములమీదనయినా, పాత్రుడయిన వ్యక్తియందయినా చేయవచ్చు. అభ్యాసవశమున ఇట్టి భావన ఎచ్చటనయినా స్వయముగా కుదిరి అమరితే తప్పక సాధకునకు, భైరవదశ ఇవ్వగలదు.

---



## ధారణ -11

**34. శ్లో।। కపాలాన్తర్మనో న్యస్య తిష్ఠన్మీలితలోచనః।**
**క్రమేణ మనసో దార్ఢ్యాత్ లక్షయేల్లక్ష్యముత్తమమ్।।**

**ప్రతిపదార్థము:–** కపాల = తలయొక్క, అంతః = మధ్యన, మనః = మనస్సును, న్యస్య = నిలిపి, మీలిత = మూసిన, లోచనః = కన్నులుగలవాడై, తిష్ఠన్ = ఉంటూ, క్రమేణ = క్రమముగా, మనసః = మనస్సుయొక్క, దార్ఢ్యాత్ = దృఢత్వం అనగా ఏకాగ్రత వలన, ఉత్తమమ్ = పరమమయిన, లక్ష్యమ్ = లక్షింపదగిన భైరవస్థితిని, లక్షయేత్ = లక్షించును అనగా కనిపెట్టును.

**భావము:–** కపాలమధ్యమున బ్రహ్మరంధ్రమునందు మనస్సును బాగుగా నిలిపి కనులు మూసికొని క్రమంగా ధారణను దృఢముగా చేయువాడు తప్పక తన లక్ష్యమయిన భైరవీస్థితిని గ్రహింపగలడు.

**విశేషములు:–** 1. 'మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్' అను యోగసూత్రం (3/31) ప్రకారము, బ్రహ్మరంధ్రమునందు వెలుగును ఊహించి దానియందు భైరవదర్శనము గోరుట ఇది.

2. కపాలమధ్యంలో అనగా కపాలములు 2. ప్రకాశము. విమర్శము. వాని మధ్య ప్రపంచమంతా శివశక్తిమయమయినదని గ్రహించి ఈ విమర్శతో గూడిన మనస్సును ప్రకాశవిమర్శ మధ్యమున నిలుపవలెను.

**'కశబ్దేన పరా శక్తిః పాలకః శివసంజ్ఞయా**
**శివశక్తిసమాయోగః కపాలః పరిపఠ్యతే।।** – తంత్రకోశము

3. మీలితలోచనః అనగా భేదదృష్టి వదలిన వాడై అని యర్థము చెప్పవచ్చును. లేదా ఇంద్రియవ్యాపారములు కదలిన వాడై అనియు చెప్పవచ్చును.

---

**35. శ్లో।। మధ్యనాడీ మధ్యసంస్థా బిససూత్రాభరూపయా।**
**ధ్యాతాన్తర్వ్యోమయా దేవ్యా తయా దేవః ప్రకాశతే।।**

**ప్రతిపదార్థము:–** మధ్యనాడీ = మధ్యనాడి అయిన సుషుమ్నయొక్క, మధ్య = మధ్యమునందు (వజ్ర – చిత్రిణీనాడులయొక్క మధ్యలో) సంస్థా = ఉన్న, యా =

ఏ బ్రహ్మనాడి లేదా అందలి కుండలిని, అంతర్వ్యోమ = దహరాకాశమధ్యమున, ధ్యాతా = ధ్యానింపబడినదో, తయా = ఆ, బిససూత్రాభ = తామరతూటి దారమువంటి, రూపయా = రూపముగల, దేవ్యా = బ్రహ్మనాడితో / కుండలినితో, దేవః = భైరవుడు, ప్రకాశతే = ప్రకాశించును.

**భావము:–** మధ్యనాడి సుషుమ్న. దానిలో '3' నాడులుంటాయి. వజ్రా, చిత్రిణీ, బ్రహ్మనాడి. అసలుది ఈ బ్రహ్మనాడి. దీనిలోనే కుండలినీ శక్తి ముందరికి వెళ్లును. ఆ నాడి బిసతంతుతనీయసి. అందలి కుండలినియు అంతేగదా! అట్టిదేవి మనలోని హృదయాకాశమున వ్యాపించినట్లు ధ్యానించినచో భైరవప్రకాశము జరుగును.

**విశేషములు:–** దీనికి ఇతరులు వేరే అర్థాలు చెప్పారు.

1. మధ్యనాడి అయిన సుషుమ్న మధ్యలో ఉన్నది. అది బిసంతువువలె సన్నది. (మిగిలిన అర్థం సమానమే.)

2. మధ్యనాడీ మధ్యలోని (మధ్యసంస్థ) బిసతంతు సమానమయిన ప్రాణశక్తితో – అని అర్థము చెప్పారు. ఇది కొంత వఱకు బాగున్నది.

3. ఈ అర్థాలలో 'ధ్యాతాంతర్వ్యోమయా' అని సమాసం చేశారు. నా సమన్వయం 'ధ్యాతా – అంతర్వ్యోమ – యా' అని చేశాను.

4. దహరాకాశము / హృదయాకాశము – చిదాకాశము – ఏదయినా సుషుమ్నలో / బ్రహ్మనాడిలో కుండలిని నడచు 'ఖాళీ' త్రోవకే పేరు.

5. ఈ భావనలో

'నీలతోయద – నీవారశూకవత్తన్వీ – మొదలయిన మంత్రపుష్పంలోని సుషుమ్నా కుండలినీ వర్ణనను కల్పవచ్చును.

---

## ధారణ – 13

**36. శ్లో॥ కరరుద్ధదృగస్త్రేణ భ్రూభేదాత్ ద్వారరోధనాత్।**
**దృష్టే బిన్దౌ క్రమాల్లీనే తన్మధ్యే పరమా స్థితిః॥**

**ప్రతిపదార్థము:–** కర = చేతులచేత, రుద్ధ = నిరోధింపబడిన, దృక్ = ఇంద్రియములను, అస్త్రేణ = ఆయుధముచేత, ద్వార= ముఖము మొ॥ద్వారములయొక్క, రోధనాత్ = నిరోధించువలన, (అనగా యోనిముద్రతో మలమూత్రద్వారమును ఆపుటవలన), భ్రూ = భ్రూచక్రమయిన ఆజ్ఞయొక్క, భేదాత్ = విఱుపువలన, దృష్టే = దర్శనమిచ్చిన, బిందౌ = బిందువు / చుక్క, క్రమాత్ = వరసగా, లీనే = అదృశ్యముకాగా, తన్మధ్యే = ఆ చిదాకాశమధ్యంలో, పరమా = పరమఘనమయిన, స్థితిః = భైరవీదశ కలుగును.



**భావము:–** షణ్ముఖీముద్ర అని ఒక ముద్ర ఉన్నది. దానితో చెవులు, ముక్కులు, కన్నులు, నోరు మూసి ప్రాణనాదం వింటారు. యోనిముద్రతో మలమూత్ర ద్వారాలను మూసి అపానం మీద అధికారం తెచ్చికొంటారు. ఈ '2' ఆసనాల ప్రభావంతో భ్రూమధ్యంలోని ఆజ్ఞాచక్రం అనబడే గ్రంథి బద్దలయి అచట ఓంకార బిందురూపుడైన పరమేశ్వరుని బిందురూపము ప్రత్యక్షమగును. ఆ బిందువు క్రమంగా అదృశ్యమగును. ఆ బిందువు క్రమంగా అదృశ్యమవుతుంటుంది. ఆ ఆకాశమధ్యంలోనే బిందువు లీనమయిన తర్వాత భైరవీదశ ఉత్పన్నమగును.

**విశేషములు:–** 1. ఒక వ్యాఖ్యానములో కరరుద్ధదృగస్త్రముతోనే ద్వారరోధనం జరుగుతుందని రాశారు. అది కుదరని పని. ఎందుకంటే 'కరరుద్ధ' అని ఇంద్రియాలు రోధించడం జరిగిందని అక్కడే ఉంది. మఱల ద్వారరోధనం అంటే ఇంద్రియాలుకాక వేరే ద్వారాలనే చెప్పాలి. అవి మలమూత్ర ద్వారాలు. అందుకే యోనిముద్ర వాడుతారు. ఈ '2'వలన 'నాదం'తో అభ్యాసం చేస్తారు. కనుక అర్థం మార్చవలసి వచ్చింది.

2. భ్రూమధ్యంలోని 'జ్యోతి' బిందురూపంగా కనబడుతుంది.

**మూలాధారే కుండలినీ భుజంగాకార రూపిణీ**
**జీవాత్మా తిష్ఠతి తత్ర ప్రదీపకలికాకృతిః॥**
**ధ్యాయేత్తేజోమయం బ్రహ్మ తేజోధ్యానం పరాత్పరమ్**
**భ్రువోర్మధ్యే మనోర్ధ్వే చ యత్తేజః ప్రణవాత్మకమ్**
**ధ్యాయేత్ జ్వాలావలీయుక్తం తేజోధ్యానం తదేవ హి॥**

అని యోగసర్వస్వములో చెప్పిన తేజోధ్యానమే యిది. అయితే ఈ తేజస్సు నాదసంబంధమయినది కనుక ఈ నాదబిందువు నాదాంతమయిన చిదాకాశమున లీనము కావటం. దానివలన నిర్వికల్పమయిన 'భైరవీదశ' వచ్చును.

3. కర్ణికాయాం త్రికోణస్థమాత్మానం ప్రణవాకృతిమ్।
జ్వలద్దీపనిభం చోర్ధ్వం నాదరూపం మనోహరమ్ ॥

– షట్చక్రనిరూపణ వ్యాఖ్యా

మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్త్వా కులపథమ్।

– ఆనందలహరి

భ్రూమధ్యే అంతరాత్మానం అరూపం సర్వకారణమ్
ఓంకార జ్యోతిరూపం తు ప్రదీపాభం జగన్మయమ్॥

– షట్చక్ర నిరూపణ వ్యాఖ్య

"ప్రదీపాభజ్యోతిః ప్రణవవిరచనా రూపవర్ణప్రకాశః"

– శ్రీతత్త్వ చింతామణి

"ప్రదీపనికరాకారం మనోత్రాస్తేతినిర్మలమ్
లింగం తత్కర్ణికాంతస్థం త్రికోణమతిసుందరమ్।
సౌదామినీసమం తస్మిన్ వేదాదిం సంస్మరేద్బుధః
తస్మిన్ ప్రదీపసదృశో ఽప్యంతరాత్మా వ్యవస్థితః ॥

– చక్రకౌముది

4. లేదా కరరుద్ధ దృగస్త్రేణ = అంటే కంటిని చేతితో కప్పడం ద్వారా వచ్చే అంతర్దృష్టి అని చెప్పవచ్చును. దీనినిబట్టి స్పష్టమయినది.

1. ఆజ్ఞాచక్రంలో మనస్సున్నది. అది దీపమాలిక వంటిది. దాని మధ్యలో లింగం, త్రికోణము, దానియందు మెఱుపుతీగవంటి ఓంకారము దానిమధ్యన దీపంవలె అంతరాత్మ ఉన్నది. ఇన్ని ఉన్నది అణువుకన్న తక్కువ వ్యాసంగల స్థలంలో కనుక వీటిని అన్యోన్యం తార్మారుగా వ్యవహరిస్తారు. మొత్తంమీద ఈ బిందువు క్రమంగా లీనమయి ద్వాదశాంతమున పరమబిందువులో అదృశ్యమగును. ఇట్టి భావనను ధారణ చేయవలయును.

**2. షణ్ముఖముద్రా లక్షణము**

"సిద్ధాసనం సమాసాద్య కర్ణాక్షినాసికాముఖమ్
అంగుష్ఠతర్జనీమధ్యానామికాభిశ్చ సాధయేత్"।



"సవ్యపార్ష్ణిం గుదే స్థాప్య దక్షిణం చ ధ్వజోపరి,
యోనిముద్రాబంధ ఏష భవేదాసనముత్తమమ్"

– చూ॥ 26వ శ్లోక వ్యాఖ్య.

---

## ధారణ - 14

**37. శ్లో॥ ధామాన్తః క్షోభసంభూతసూక్ష్మాగ్నితిలకాకృతిమ్।**
**బిన్దుం శిఖాన్తే హృదయే లయాన్తే ధ్యాయతో లయః॥**

**ప్రతిపదార్థము:–** ధామ = కంటికాంతియొక్క, అంతఃక్షోభ = నులుముకొనుటచే, సంభూత = ఏర్పడిన, సూక్ష్మ = సూక్ష్మమయిన, అగ్నితిలక = నిప్పురవ్వయొక్క, ఆకృతిమ్ = ఆకృతివంటి ఆకృతిగల, బిందుమ్ = బిందువును, శిఖాంతే = ద్వాదశాంతమున (శిఖ = పిలక – శిఖాంతం = పిలకవద్ద ఉన్న అవధి), హృదయే = హృదయమునందు, లయాంతే = లయము పొందిన తరువాత, ధ్యాయతః = ధ్యానించువానికి, లయః = కలిసిపోవుట (భైరవదశలో) జరుగును.

**భావము:–** మనం కంటిని బాగా రుద్దినపుడు కళ్లముందర ఏర్పడే రకరకాల నిప్పురవ్వల వంటి దృశ్యాలలో ఒక రవ్వను నిత్యము తమ హృదయమునందు, తమ ద్వాదశాంతమునందు (తలమీద పిలక పెట్టుకొనే చోటు) వికల్పరహితముగా ధ్యానించిన వానికి భైరవతత్త్వంలో లయించే భాగ్యం కలుగును.

**విశేషములు:–** 'ధామ' అనగా కాంతి / చోటు అని అర్థము. ఇందులో 'కంటి కాంతి' అనుకోవటానికి స్పష్ట సూచనలేదు. వ్యాఖ్యాతలను బట్టి, చిత్కళాధ్యాన సంప్రదాయమునుబట్టి ఆ అర్థము చెప్పవచ్చును. చిత్కళలనగా కంటిని రుద్దినపుడు అదిమి వదిలినపుడు కనబడే రంగురంగుల దృశ్యములు.

2. కనుక మఱొక అర్థం చెప్పవచ్చును.

కాంతిని క్షోభపెట్టినపుడు రాలే, దీపపు నిప్పురవ్వలలో ఒకరవ్వ వంటి బిందువును ధ్యానింపుమని పోలికగా చెప్పినట్లు భావన చేయవచ్చును. ఇంతకన్నా పదానుగుణంగా అర్థం ఇలా చెప్పవచ్చును.

ధామ = స్థానమునందలి – అని చెప్పాలి.

కాగా ప్రాయ్యి / అగ్నికుండము – వీటిలో కట్టెలను కదపడం అంతఃక్షోభ. దానివలన రేగిన నిప్పురవ్వల ఆకారంగల ఒక బిందువును ధ్యానించడం అనే అర్థము 'పద' అర్థసమన్వయానికి సరిపోతుంది.

---

## ధారణ – 15

**38. శ్లో॥ అనాహతే పాత్రకర్ణేఽ భగ్నశబ్దే సరిద్ద్రుతే।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి॥**

**ప్రతిపదార్థము:–** పాత్రకర్ణే = పాత్రలే కర్ణములుగా గలదియు, అభగ్న = భంగపడని అనగా నిరంతరమయిన, శబ్దే = ధ్వనిగలదియు, సరిత్ = నదివలె, ద్రుతే = వేగముగా వచ్చునదియు, అనాహతే = కొట్టబడని, శబ్దబ్రహ్మణి = దశవిధ నాదబ్రహ్మమునందు, నిష్ణాతః = కుశలుడైనవాడు, పరమ్ = పరమమయిన, బ్రహ్మ = భైరవుని, అధిగచ్ఛతి = పొందును.

**భావము:–** షణ్ముఖముద్ర వలన ఈ ప్రాణధ్వనిని వినవచ్చును. ఇంతకన్న చక్కగా '2' పాత్రలద్వారా వినవచ్చును. చెవులకు 2 పాత్రలనుగాని, చేతులనే సంపుటములుగా పెట్టిగాని ఈ ప్రాణనాదమును వినవచ్చును. అందువలన ఇది పాత్ర కర్ణము. ప్రాణధ్వని చచ్చేంతవరకు వినబడుతూనే ఉంటుంది. నదివలె ప్రవహించుతూనే ఉంటుంది. ఈ శబ్దము ఎవరూ దేనినీ వాయించడం వలన వచ్చినది కాదు. కనుక అనాహతము. అనాహత చక్రము (హృదయము) నుండి వచ్చే నాదమిది. ఈ నాదము నుపాసించిన వానికి అనగా నాదయోగం నేర్చుకొని, దశవిధనాదములు పొందిన వానికి, లేదా అట్లు అన్నింటిని ఈ నాదముమీద ధారణ చేసినవానికి భైరవసామరస్యం సిద్ధించును.

---

## ధారణ – 16

**39. శ్లో॥ ప్రణవాదిసముచ్చారాత్ ప్లుతాన్తే శూన్యభావనాత్।**
**శూన్యయా పరయా శక్త్యా శూన్యతామేతి భైరవి॥**

**ప్రతిపదార్థము:–** భైరవి! = ఓ భైరవీ!, ప్లుతాంతే = ప్లుతస్వరము యొక్క చివర, శూన్యభావనాత్ = శూన్యమును భావించునట్టి, ప్రణవ = ఓంకారము, ఆది = మొదలగు బీజాక్షరములయొక్క, సముచ్చారాత్ = సుదీర్ఘమయిన ఉచ్చారణవలన, శూన్యయా = స్వరవ్యంజనాది శూన్యమయిన, పరయా శక్త్యా = పరానాద శక్తిద్వారా, శూన్యతామ్ = వికల్పశూన్యమయిన భైరవస్థితిని, ఏతి = పొందును.

**భావము:–** హ్రస్వము దీర్ఘము ప్లుతము అని '3' రకాల ఉచ్చారణలున్నాయి. అ క ర ల వ ఇలా ఒక హ్రస్వాన్ని ఉచ్చారణ చేసే కాలమును ఒక 'మాత్ర' అందురు. దీర్ఘమునకు 2 మాత్రల కాలము పట్టును. అనగా 2 హ్రస్వములకాలము. ప్లుతమును ఉచ్చరించుటకు '3' మాత్రల నుంచి ఎంతైనా కాలము పట్టును. ఏ అచ్చునయినా అవసరమునుబట్టి 'ప్లుతం'లో పలుకవచ్చును. దూరంగా ఉన్నవారిని పిలవటానికి శోకము మొదలయిన భావాలు ప్రకటించటానికి సంగీతానికి ఆలాపనకు ఈ ప్లుతము అవసరం. ఇదంతా 'నాదమే'. ప్లుత ఉచ్చారణ దాటిన తర్వాత మన 'నాదం' గ్రుక్క తిరగక 'లయం' అవుతుంది. అలా 'లయం' అయ్యేచోట 'శూన్యమును' బాగా మనస్సుతో ధారణ చేయాలి. ఈ నాదం ముందెక్కడ పుట్టుతుందో అచ్చటనే చివరకు లయమవుతుంది. నాదాద్యంతాలు పరమేశ్వర రూపమే. నాదం ప్రాణశక్తి అయితే నాదాంతము పర భైరవుడే. కనుక ఓం, హ్రీం, శ్రీం, క్లీం ఇలా ఏ మంత్రమయినా బిందువుపైన 'అర్ధమాత్ర'తో ఉచ్చారణ చేస్తే చివరలో 'శూన్యం' వస్తుంది. అచ్చటనే అ–ఉ–మ మేశ్వరతత్త్వం. బీజాక్షరాలను రాసేటపుడు ఇలా రాయాలి. ఓం ◡̇ ఇలా ఇందులో అ–ఉ–మ—◡—O ఇలా వరస. అర్ధచంద్ర నుంచి బిందువుదాకా వచ్చే వరసను '32'వ శ్లోకవ్యాఖ్యలో చూడదగును. ప్లుతం అయినాక చివర వచ్చే అర్ధచంద్రరూప – అర్ధమంత్రోచ్చారణ తర్వాత మధ్యలోని నాదనవకం గుర్చి భావన చేయకుండా నేరుగా శూన్యమయిన నిర్వికల్ప భైరవస్థితిని ధ్యానించుట ఇందులో చెప్పబడినది.

మొత్తము మీద ఒక ఖాళీ కంచుగిన్నెను 1 గంటను కొట్టినపుడు వచ్చే అసలు ధ్వని ఆగిన తర్వాత వచ్చే 'హమ్మింగ్' వంటి ఝుంకారనాదం అర్ధమాత్ర అంటారు. అదే అనురణనధ్వని. దానియందు మనస్సును నిల్పవలయును. తద్వారా ఆ వర్ణాది శూన్యమయిన పరానాదశక్తి తప్పక సర్వవికల్పశూన్యమయిన భైరవదశలో దించి వదలును.

---

## ధారణ - 17

**40. శ్లో॥ యస్య కస్యాపి వర్ణస్య పూర్వాన్తావనుభావయేత్।**
**శూన్యయా శూన్యభూతోఽసౌ శూన్యాకారః పుమాన్ భవేత్॥**

**ప్రతిపదార్థము:–** యస్య కస్యాపి = ఏదో ఒక, వర్ణస్య = అక్షరముయొక్క, పూర్వ = ఉచ్చారణ పూర్వస్థితిని, అంతౌ = ఉచ్చారణ తరువాత స్థితిని, శూన్యయా = అక్షరశూన్యమయిన నాదశక్తితో, అనుభావయేత్ = అనుసరించి భావన (ధారణ) చేయవలయును. శూన్యభూతః = ధారణవలన శూన్యంగా అయిన, అసౌ = ఈ సాధకుడు, శూన్యాకారః = నిర్వికల్పపరమాకాశరూపుడయిన, పుమాన్ = పురుషుడుగా (భైరవుడుగా) భవేత్ = అగును.

**భావము:–** పద్యంలో చెప్పినట్లు ప్రణవం, బీజాక్షరాలు మాత్రమే అనిలేదు. ఏ అక్షరమయినా ఉచ్చారణకు ముందు, ఉచ్చారణానంతరము ఉన్న స్థితులలో ఉన్న, 'పరావాగ్రూపము' గుర్తించవలయును. పరా పశ్యంతీ స్థితులు అక్షర శూన్యములు. అట్టి శూన్యస్థితియందు ధారణ చేసినచో తప్పక శబ్దబ్రహ్మ రూపమును వదలి పరబ్రహ్మ రూపము పొందగలడు.

---

## ధారణ - 18 (నాద)

**41. శ్లో॥ తంత్ర్యాదివాద్యశబ్దేషు దీర్ఘేషు క్రమసంస్థితేః।**
**అనన్యచేతాః ప్రత్యన్తే పరవ్యోమవపుర్భవేత్॥**

**ప్రతిపదార్థము:–** దీర్ఘేషు = పొడవయిన, తంత్ర్యాది = తీగ మొదలగునవిగల, వాద్య = వీణమొదలగు వాద్యములయొక్క, శబ్దేషు = ధ్వనులయందు, అనన్యచేతాః = ఏకాగ్రమయిన మనస్సుగల సాధకుడు, క్రమ = క్రమముగా, సంస్థితేః = ధారణవలన, ప్రత్యంతే= ఆ ధ్వనులయొక్క ప్రతి చివఱ/నాదాంతమునందు, పరవ్యోమ = పరమాకాశరూపుడయిన భైరవుని, వపుః = శరీరముగలవాడు, భవేత్ = అగును.

**భావము:–** వీణ మొదలగు (మద్దెలలు మొదలగు వాద్యములు కుదరవు) తంత్రీవాద్యములు, వేణువు మొదలగు వాద్యములు చక్కగా పాడునపుడు, వాటి దీర్ఘస్థితిలో ఆరోహావరోహములలో క్రమముగా ఎక్కి దిగిన సాధకుడు వాటి చివర





శూన్యస్థితిని / లీనస్థితిని సావధానంగా ధారణ చేసినచో పరమాకాశరూపమయిన 'భైరవస్థితి' లభించును.

---

## ధారణ - 19 (బీజమన్త్ర)

**42. శ్లో॥ పిణ్డమన్త్రస్య సర్వస్య స్థూలవర్ణక్రమేణ తు।**
**అర్ధేన్దుబిన్దునాదాన్తశూన్యోచ్చారాద్భవేత్ శివః॥**

**ప్రతిపదార్థము:–** సర్వస్య = ప్రతి ఒక, పిండ = కొన్ని అక్షరాల ముద్దగా అయిన, మంత్రస్య = మంత్రమయిన ఓంకారము, హ్రీంకారము మొ॥ మంత్రముయొక్క, స్థూల = స్థూలమయిన (అ ఉ మ – / హ ర – ఈ ) వర్ణ = అక్షరాలయొక్క, క్రమేణ తు = వరసతో, అర్ధేందు = అర్ధచంద్రముయొక్క, బిందు = బిందువుయొక్క, నాదాంత = నాదాంతముయొక్క, శూన్య = వర్ణశూన్యమయిన, ఉచ్చారాత్ = ఉచ్చారణవలన, శివః = శివుడుగా, భవేత్ = అగును.

**భావము:–** కొన్ని అక్షరాలు కలిసి ఒక అచ్చుతో ముద్దగా తయారయ్యే మంత్రాలనే, పిండమంత్రాలంటారు. పిండం అనగా ముద్ద అని అర్థం. ఇట్టి మంత్రాలను స్థూలంగా రాసేటపుడు 'ఓం, హ్రీం' ఇలా రాయాలి. ఇందులో 'అ ఉ మ–ఁం' ఇలా వరస ఉంటుంది. ఇదే స్థూలవర్ణక్రమం ఈ వరసలో అర్ధచంద్రాన్ని తర్వాత బిందువును, తర్వాత నాదాంతమును, దాని తర్వాత శూన్యమును ఉచ్చరించుట అనగా భావించుట వలన భైరవదశాసిద్ధి.

**విశేషములు:–** స్థూలవర్ణక్రమంలో భావన కనుక మనం రాసే వరసలో భావన ఇది. అందువలన ముందు అర్ధచంద్రం తర్వాత బిందువు. వచ్చాయి. మామూలుగా అయితే అ ఉ మ తర్వాత బిందువు తర్వాత అర్ధచంద్రం కనబడ్తాయి. కనుక నాదనవకంలో వరస అది. ఇటువంటి వరసలో నాదధ్యానం ఇంతకుముందు చెప్పిందే మరల చెప్పినట్లయింది. తేడా ఏమంటే సర్వపిండమంత్రాలకు ఇదేనని చెప్పటమే. కనుక శ్లోకం వ్యర్థమవుతుంది. కనుక, స్థూలవర్ణక్రమంతోనే ఈ ధ్యానం చెప్పినట్లని భావించితే ఇది భిన్నమయిన ధారణ అవుతుంది. కనుక స్థూలక్రమంలోనే ఈ ధ్యానం అని చెప్పటం సమంజసం.

2. ఇతర వ్యాఖ్యాతలు 'స్థూలవర్ణక్రమం అన్నమాటకు ప్రాధాన్యం ఇవ్వకుండా తమ మామూలు వరసను పాటించాలని చెప్తూ శ్లోకంలోని వరసను మార్చాలని

సూచించారు. 'బిన్ద్వర్ధచంద్ర' అని మార్చాలని వారి ఉద్దేశ్యం' కాని నవీనధారణ కాబోదు. అదే చిక్కు సంఖ్య కుదరదుగదా!

3. అయితే స్థూలక్రమంలో అర్ధచంద్రం తరువాత బిందువు రాస్తాం కనుక ఆ క్రమంలోనయినా భావన చేయడం మంచిదని శ్లోకభావము. అయితే ఈ వరసలో 'బిందువు' ఏమిటి? అని ప్రశ్న వస్తుంది. 'బిందువు' బ్రహ్మమును సూచించే సంకేతము. బిందువనబడే నాదాంతమయిన శూన్యమది. దాని స్థితి వర్ణశూన్యము. పైగా నిర్వికల్పకము. దానిదాకా 'ఉచ్చారణ' / భావనచేయడం వలన శివత్వం వచ్చును. ఇదే భిన్నంగా కనిపించే ధారణ. ఇదే స్థూలవర్ణ క్రమం.

4. శివోపాధ్యాయవ్యాఖ్యలో

అ – బొడ్డు
ఉ – హృదయం
మ – ముఖం
బిందు – భ్రూమధ్యం
అర్ధచంద్ర – నుదురు
నిరోధిని – నుదుటిపైన
నాద – శిరస్సుమీద
నాదాంతం – బ్రహ్మరంధ్రము
శక్తి – చర్మము
వ్యాపిని – పిలక మొదట్లో
సమన – పిలకమధ్యన
ఉన్మన – పిలకకు అవతలి అంచు

అనే వివరాలు వ్రాశారు. కాని యీ శ్లోకానికి ఇవన్నీ అవసరం లేదనిపిస్తున్నది. స్థూలవర్ణక్రమం గనుక ఇవన్నీ స్థూలవర్ణక్రమంలో లేవు కనుక 'బిందువునే' పరమాకాశంగా నాదాంతంగా స్వీకరించి ఆ భావనారూపమయిన ఉచ్చారం వలన భైరవీసిద్ధి అని చెప్పడం సమంజసం.

5) ఉచ్చారం – ఇది అర్ధచంద్రం వరకు సాధ్యం – అనురణనధ్వని అర్ధచంద్రాకారంలో జరిగేది. దానిని పొడగించడం ద్వారా పరమాకాశబిందువు దాకా వెళ్ళాం. అయితే అనురూణన ధ్వని తర్వాత కనబడనివాటికి భావన తప్ప 'ఉచ్చారం' అసాధ్యము. కనుక ఉచ్చారం అంటే కొంత వరకు మాత్రమే. తర్వాత భావన మాత్రమే.





6) ఓంకారధ్యానానికి సంబంధించి ఒక మంచి శ్లోకం. ఇది శివోపాధ్యాయ వ్యాఖ్యలో ఉదాహృతము. ఎవరిదో తెలియదు.

**ఓమితి స్ఫురదురస్యనాహతం**
**గర్భగుంఫితసమస్తవాఙ్మయమ్।**
**దంధ్వనీతి హృది యత్పరం పదం**
**తత్సదక్షరముపాస్మహే మహః॥**

దీని ప్రకారముగా ఓంకారం మీద ఉన్న బిందువును మొత్తం మీద పరబ్రహ్మ స్వరూపంగా భావించాలి. నాదనవకంగా సంకేతించి భావన చేస్తే 'బిందువు' నాదంలో ఒక భాగముమాత్రమే.

---

## ధారణ - 20

**43. శ్లో॥ పృష్ఠశూన్యం మూలశూన్యం యుగపద్భావయేచ్చ యః।**
**యుగపన్నిర్వికల్పత్వాత్ నిర్వికల్పోదయస్తతః॥**

**ప్రతిపదార్థము:–** యః = ఏ సాధకుడు, పృష్ఠ = దేహంయొక్క వెనుక / క్రిందివైపున్న , శూన్యమ్ = శూన్యస్థితిని, మూల = ముందు / పైన వైపున్న, శూన్యమ్ = శూన్యస్థితిని, యుగపత్ = ఒక్కసారిగా, భావయేచ్చ = భావించునో, తస్య = వానికి, తతః = ఆ భావనవలన, యుగపత్ = ఒక్కసారిగా, నిర్వికల్పత్వాత్ = వికల్పరాహిత్యమువలన, నిర్వికల్ప = వికల్పశూన్యమయిన బ్రహ్మముయొక్క, ఉదయః = ఉదయము జరుగును.

**భావము:–** పైన క్రింద లేదా ముందు వెనుక (తన దేహానికి) వికల్పశూన్యమయిన ఆకాశమును అనగా పరమాకాశ రూపమయిన భైరవుని ధ్యానించినచో నిర్వికల్పదశ లభించును.

**విశేషములు:–** 1. ఈ శ్లోకంలో 2 సార్లు "యుగపత్" వచ్చింది. అర్థంలో మార్పు చాలా తక్కువ. ఈ శ్లోకానికి ప్రతిగా మఱొక శ్లోకం ఉంది. అది యిది

**"శరీరనిరపేక్షిణ్యా శక్త్యా శూన్యమనా భవేత్।**

**పృష్ఠశూన్యం మూలశూన్యం హృచ్ఛూన్యం భావయేత్ స్థిరమ్"**

అని ఉన్నది. ఇది శివోపాధ్యాయుడు వ్యాఖ్యానించిన అదనపు శ్లోకము. ఆయన మరొక రచయితయొక్క శ్లోకం గూడా తన వ్యాఖ్యానములో చూపాడు.

**"ఊర్ధ్వశూన్యమధశ్శూన్యం మధ్యేశూన్యం నిరాశ్రయమ్।**

**త్రిశూన్యం యో-భిజానాతి స భవేత్కులనందనః॥**

అన్న యీ శ్లోకంలో ఊర్ధ్వ, అధః, మధ్యదయిన హృదయం – వచ్చాయి. కాగా నా అభిప్రాయం ఏమంటే అసలు శ్లోకంలో "పృష్ఠశూన్యం, మూలశూన్యం హృచ్ఛూన్యం భావయేచ్చ యః" అని పాఠం ఉండి ఉంటుందని, లేఖకదోషం వలన 'యుగపత్' పడిందని. కాగా ఈ మార్పువలన ఇతర గ్రంథాలతో, సామ్యం, ఈ శ్లోకం వ్యర్థమయిన, 'యుగపత్' శివ ఉపాధ్యాయుడు వ్యాఖ్యానించిన అదనపు శ్లోకం – అవసరం లేకపోతాయి. అంతా బాగుంటుంది.

2. అసలు శ్లోకంలో పృష్ఠ – మూల – తేడా. పృష్ఠం మూలం – సమానంగా అర్థం చెప్పవచ్చును. శరీరానికి క్రిందిభాగం పృష్ఠం అనవచ్చు. మూలం అనవచ్చు. కాని అర్థం కుదరదు. పదం వ్యర్థం పునరుక్తం అవుతుంది. పృష్ఠం వెనుక, మూలం క్రింద అని చెప్పితే అసలుదయిన ఊర్ధ్వం రాదు. కనుక కుదరదు. "ఊర్ధ్వమూలమధశ్శాఖం" అనటాన్ని బట్టి దేహంయొక్క 'మూలం' అంటే "ఊర్ధ్వం" అనుకోవాలి. అపుడు "పృష్ఠం" అంటే క్రిందిభాగం కావాలి. లేదా మనం మార్చిన పాఠం మంచిదనుకుంటే, ఊర్ధ్వశూన్యం, హృదయశూన్యం. పృష్ఠ (అనగా వెనుక లేదా క్రింద) శూన్యమును భావింపవలెనను అర్థము వచ్చును.

3. ఈ శ్లోకమున శరీరముయొక్క "ఊర్ధ్వ అధః" భాగాలలో శూన్యధ్యానం చెప్పాడు.

4. దీనిలోకి పూర్వశ్లోకం నుంచి "నిజదేహే" అన్నది అనువృత్తిగా తెచ్చికొనాలి.

---

## ధారణ – 21

**44. శ్లో॥ పృష్ఠశూన్యం మూలశూన్యం యుగపద్భావయేచ్చ యః।**
**శరీరనిరపేక్షిణ్యా శక్త్యా శూన్యమనా భవేత్॥**



**ప్రతిపదార్థము:–** పృష్ఠశూన్యమ్ = వీపునందలి శూన్య (ఆకాశ)మును, మూలశూన్యం చ = మూలాధార సంబంధమయిన శూన్యమునున్ను, యుగపత్ = ఒక్కసారిగా, యః = ఏ సాధకుడు, భావయేత్ = భావించునో, అతడు, శరీర = దేహంతో, నిరపేక్షిణ్యా = అవసరంలేని, శక్త్యా = భావనాశక్తితో (లేదా కుండలినీ శక్తితో), శూన్య = నిర్వికల్పమయిన, మనాః = మనస్సుగలవాడు, భవేత్ = అగును.

**భావము:–** ఊర్ధ్వశూన్యం, మధ్యశూన్యం, అధశ్శూన్యం అని దహరాకాశవిభాగం చేయబడింది. అందులో పృష్ఠ శూన్యం అంటే వీపునందు వెన్నులోని శూన్యద్వయం వస్తుంది. మూలశూన్యం అంటే అధశ్శూన్యం వస్తుంది. ఈ మొత్తం శూన్యాలను ఒకేసారి ధారణ చేసినప్పుడు భావన నిర్వికల్ప అనగా దేహరహితమయిన శూన్యంతో నిండుతుంది. ఆ శూన్యసత్తలో స్ఫురించే నిర్వికల్పమయిన చైతన్యంతో మనస్సు నిండుతుంది. కనుక భైరవ (శివ) సామరస్యం వస్తుంది.

---

అధికపాఠం

**శ్లో॥** పృష్ఠశ్యూనం మూలశూన్యం హృచ్ఛూన్యం భావయేత్ స్థిరమ్।
యుగపన్నిర్వికల్పత్వాత్ నిర్వికల్పోదయస్తతః॥

**ప్రతిపదార్థము:–** పృష్ఠశూన్యమ్ = వీపునందలి ఊర్ధ్వశూన్యమును, మూలశూన్యమ్ = వీపునందలి అధశ్శూన్యమును, హృచ్ఛూన్యమ్ = వీపునందలి మధ్యశూన్యమును, స్థిరమ్ = స్థిరముగా, యుగపత్ = ఒకేసారిగా భావయేత్ = ధారణ చేయవలయును. నిర్వికల్పత్వాత్ = ఈ శూన్యత్రయం నిర్వికల్పం కనుక, తతః= ఈ భావనవలన, నిర్వికల్ప = వికల్పరహిత జ్ఞానరూపుడయిన భైరవతత్త్వంయొక్క, ఉదయః = ఆవిర్భావం జరుగును.

**భావము:–** పై శ్లోకంలోని విషయమే మరల వివరింపబడినది. శూన్యత్రయాన్ని ధారణచేస్తే మనస్సులో మిగిలినది శూన్యమే. నిర్వికల్పమే. అది తనలోని 'అహం' రూపచైతన్యమే. ఆ నిర్వికల్పదశను తరువాత గుర్తించగలిగేది ఆ చైతన్యమే. కనుక శూన్యధారణ అనేది విషయశూన్యత. మేఘశూన్యమయిన ఆకాశంలో వస్తుతత్త్వమయిన ఆకాశం మాత్రమే మిగిలినట్లు వికల్పశూన్యమయిన శూన్యత్రయధారణలో అధిష్ఠానతత్త్వమయిన పూర్ణభైరవస్వరూపచైతన్యమే మిగిలి ఉంటుంది. అదే మనం కనుక సాధకుడు భైరవసాయుజ్యంతో జీవన్ముక్తుడు కాగలడు.

నోట్ : ఈ శ్లోకాలు 2గా ఉన్నా భావం ఒక్కటే. ఇది శివోపాధ్యాయుడు వ్యాఖ్యానం చేసిన ”ప్రతి“లో కనబడినది. ఇతర పాఠాలలోను ఉన్నది. భావనలసంఖ్యలో ఇందువలన భేదమురాదు. మొత్తం శూన్యధారణే కదా!

---

### ధారణ - 22

**45. శ్లో॥ తనూదేశే శూన్యతైవ క్షణమాత్రం విభావయేత్।**
**నిర్వికల్పం నిర్వికల్పో నిర్వికల్పస్వరూపభాక్॥**

**ప్రతిపదార్థము:–** తనూదేశే = స్థూలశరీరమునందు, శూన్యతైవ = శూన్యతమాత్రమే ఉన్నది అని, క్షణమాత్రమ్ = ఒకక్షణము, నిర్వికల్పమ్ = వికల్పరహితంగా, విభావయేత్ = 'ధారణ' చేయవలెను. నిర్వికల్ప = అట్టి భావనతో నిర్వికల్పస్థితిలో ఉన్న సాధకుడు, నిర్వికల్ప = వికల్పరహితుడయిన భైరవునియొక్క, స్వరూప = స్వరూపములను, భాక్ = పొందువాడగును.

**భావము:–** ఈ స్థూలశరీరమునందు అంతా శూన్యతయే. మిథ్యాత్వమే అని ఒక క్షణం వికల్పరహితమయిన మనస్సుతో ధ్యానించిన నిర్వికల్పసాధకునకు సత్యరూపమయిన ప్రపంచాది వికల్పరహితమయిన 'భైరవస్థితి' లభించును.

**విశేషములు:–** పూర్వశ్లోకమునందు శరీరముయొక్క పైన క్రింద భావన చెప్పబడినది. ఇప్పుడు 'శరీరము' మొత్తం శూన్యమను భావన చెప్పబడినది. తన శరీరము ఒక మిథ్య అని శూన్యంగా భావించడం ఇందులోని తేడా.

2. దీనినిబట్టి చూస్తే పూర్వశ్లోకంలో అసలు పాఠమే సత్యమనవచ్చును. అందులో శరీరాతీతమయిన మూల పృష్ఠాలను, అంతకుముందు సర్వదిక్కులను చెప్పి యిపుడు 'శరీరమునే' శూన్యంగా చెప్తున్నాడు. కనుకనే తర్వాత శ్లోకములో దేహంలో పలిద్రవ్యం గూర్చి చెప్తున్నాడు. కనుక పూర్వశ్లోకంలో '3'వ విశేషాన్నిబట్టి సమన్వయము మంచిది.

---

### ధారణ - 23

**46. శ్లో॥ సర్వం దేహగతం ద్రవ్యం వియద్వ్యాప్తం మృగేక్షణే!।**
**విభావయేత్ తతస్తస్య భావనా సా స్థిరా భవేత్॥**



**ప్రతిపదార్థము:–** మృగేక్షణే! = లేడికన్నులవంటి కన్నులగలదానా! పార్వతీ!, దేహ = శరీరమునందు, గతమ్ = ఉన్న, సర్వమ్ = సమస్తమయిన, ద్రవ్యమ్ = అస్థిమాంసాది పదార్థసమూహము, వియత్ = శూన్యముచేత లేదా పరమాకాశమయిన పరబ్రహ్మము చేత, వ్యాప్తమ్ = వ్యాపింపబడిన దానినిగా, విభావయేత్ = భావింపవలయును. తతః = అందువలన, తస్య = ఆ సాధకునకు, సా = ఆ, భావనా = శూన్యం మిథ్య అను భావన లేదా పరమాకాశరూపమయిన భైరవరూపమే అను భావన. స్థిరా = స్థిరమయినదిగా, భవేత్ = అగును.

**భావము:–** దేహంలోని ద్రవ్యమంతా వస్తుతః ద్రవ్యముగాదు. అది అనిర్వచనీయము. మిథ్య అంతా భైరవస్వరూపము అది పరమాకాశరూపమని భావన చేసినచో ఆ భావన స్థిరమగును.

**విశేషములు:–** ఈ 3 శ్లోకములు కలిపి భావనచేసినచో శరీరము చుట్టూ, పైన క్రింద, ముందు, వెనుక, స్వయంగా శరీరము, చివఱకు, శరీరంలోపలి ద్రవ్యరాశి అంతా శూన్యమని, పరమభైరవస్వరూపమని భావనలు చెప్పబడినవి. వీటిలో ఏ ఒక్క భావనయినా భైరవస్థితిని ప్రసాదించును.

---

### ధారణ - 24

**47. శ్లో॥ దేహాన్తరే త్వగ్విభాగం భిత్తిభూతం విచిన్తయేత్।**
**న కిఞ్చిదన్తరే తస్య ధ్యాయన్నధ్యేయభాగ్భవేత్॥**

**ప్రతిపదార్థము:–** దేహాంతరే = తన దేహములోపల, త్వగ్విభాగమ్ = చర్మముయొక్క లోపలిపొరను, భిత్తిభూతమ్ = ఒక గోడగా, విచింతయేత్ = ధ్యానింపవలయును. తస్య = ఆ చర్మము సంచియొక్క, అంతరే = లోపల, కించిత్ = ఏ కొంచెమును, న ధ్యాయన్ = ధ్యానింపనివాడు, అధ్యేయ = ధ్యానాతీతమయిన పరవస్తువును, భాక్ = పొందువాడు, భవేత్ = అగును.

**భావము:–** దేహములోపల చర్మముయొక్క లోపలి భాగమును '4' వైపుల ఉన్న గోడగా భావించాలి. దాని మధ్యలో ఉన్న పదార్థమునుగాక శూన్యమును భావింపవలెను. అట్టివాడు ధ్యానాతీతమయిన పరబ్రహ్మమును పొందగలడు.

**విశేషములు:–** 1. 'దిగ్విభాగం' - అను పాఠాంతరమున్నది. అపుడయినా

దేహాంతరమందు గోడలుగా దిక్కులనూహించడం.

2. ఈ భావనలో తేడా లోపలి పదార్థమును అసలు ధ్యానంలోకి రానీయకుండా శూన్యమును అనగా వ్యాప్తమయిన పరమాకాశరూపమునూహించడం లేదా అంతా శూన్యముగా వదలడమే ధ్యానము. చర్మభిత్తిని మాత్రము ఊహించాలి. ఖాళీ డబ్బా ధ్యానం అనాలి.

3. ధ్యానించువాడు మాయీయ అహంకారము పుర్యష్టక ప్రమాత.

ధ్యానింపబడువాడు శుద్ధ 'అహం'కారము. శుద్ధప్రమాత.

---

## ధారణ - 25

**48. శ్లో॥ హృద్యాకాశే నిలీనాక్షః పద్మసంపుటమధ్యగః।**
**అనన్యచేతాః సుభగే! పరం సౌభాగ్యమాప్నుయాత్॥**

**ప్రతిపదార్థము:-** సుభగే = సౌభాగ్యవతీ! హృది = హృదయమునందలి, ఆకాశే = సుషుమ్నా సంబంధమయిన ఆకాశమునందు, నిలీన = అణగిపోయిన, అక్షః = కన్నులు / ఇంద్రియములుగలవాడై, పద్మ = హృదయ పద్మముయొక్క, సంపుట = దొప్పయందు, మధ్యగః = మధ్యలో ఉన్నవాడై, అనన్యచేతాః = ఏకాగ్రమనస్కుడయిన భావకుడు, పరమ్ = పరబ్రహ్మరూపమయిన / గొప్ప, సౌభాగ్యమ్ = సౌభాగ్యమును / అదృష్టమును, ఆప్నుయాత్ = పొందవలెను.

**భావము:-** హృదయాకాశము అనగా సుషుమ్నలోని ఆకాశము. అదే దహరాకాశము. దానియందు ఇంద్రియములను లీనం చేయాలి. హృదయ పద్మమధ్యంలో నిలిచి నిశ్చలమనస్సుతో భావన చేయువాడు పరమసౌభాగ్యమును పొందును.

**విశేషములు:-** 1. కొందరు హృద్యమయిన అనగా మనోహరమయిన ఆకాశము అని అర్థం చెప్పారు. అక్షం అనగా మనస్సు లేదా ఇంద్రియాలు, లేదా కన్నులు.

2. పద్మసంపుటం అంటే పైన ఉండే సహస్రారం. క్రింది ఉండే మూలాధారం కావచ్చును లేదా ఊర్ధ్వాధఃకమలాల మధ్య అని కొందరు చెప్పారు. లేదా ప్రమేయమయిన సంసారము నిమేష - ఉన్మేష / సంకోచ వికాస / సృష్టి లయ స్వరూపమయినది కనుక సంసారమే కమలమని పోల్చినట్లు కొందరి భావము.



## ధారణ - 26

**49. శ్లో॥ సర్వతః స్వశరీరస్య ద్వాదశాన్తే మనో లయాత్।**
**దృఢబుద్ధేః దృఢీభూతం తత్త్వలక్ష్యం ప్రవర్తతే॥**

ప్రతి॥ స్వశరీరస్య = తన శరీరమునకు, సర్వతః = అన్నివైపుల ఉన్న, ద్వాదశాంతే = ద్వాదశాంతమునందు, లయాత్ = లయమగుటవలన, దృఢబుద్ధేః = స్థిరబుద్ధిగల సాధకునియొక్క, మనః = మనస్సు, దృఢీభూతమ్ = దృఢమయినదై, తత్త్వ = భైరవతత్త్వమే, లక్ష్యమ్ = లక్ష్యముగా గలదిగా, ప్రవర్తతే = ప్రవర్తించును.

**భావము:-** తన శరీరమునకు అన్నివైపుల సాధ్యమయిన ద్వాదశాంతమునందు దృఢచిత్తముగల సాధకుడు తన మనస్సును లయం చేసినచో అది తప్పక 'భైరవీస్థితి' అనే లక్ష్యమువైపు సాగును. అనగా 'భైరవస్థితి' లభించును.

**విశేషములు:-** 1. కొందరు వ్యాఖ్యాతలు 'సర్వతః అనుదానికి రోమకూపాంతరము లందును చైతన్యదేవుడు ప్రవేశించుటవలన' అని చెప్పారు. ఆ అర్థం అలా రావటం అసాధ్యం. అలాగే 'మనోలయం అని కలిపారు. అపుడు 'ప్రవర్తతే' అన్న క్రియకు తగిన కర్తలేదు. కనుక నేను వ్యాఖ్యను పదోచితాన్వయంతో చేశాను.

2. శరీరమునకు బయట శ్వాసకు సంబంధించిన ద్వాదశాంతం ఒకటి, లోపల మఱొకటి ఉన్నాయి. ఇవికాక యోగచక్రపద్మక్రమంలో చివఱనొక ద్వాదశాంతం ఉన్నది. కనుక శరీరసంబంధమయిన ఈ ద్వాదశాంతాలలో దేనిలోనయినా ధారణ వలన భైరవీసిద్ధి అని వ్యాఖ్యానించాను. లేదా 'సర్వతః' అన్ని వైపులనుంచి వచ్చిన మనస్సు లయమగుటవలన' అని చెప్పవచ్చు. లేదా సర్వతః అన్నివిధాల - అనియు చెప్పవచ్చును.

3. ఈ ధారణ 9వ ధారణకు దగ్గరగా ఉన్నది.

---

## ధారణ - 27

**50. శ్లో॥ యథా తథా యత్ర తత్ర ద్వాదశాన్తే మనః క్షిపేత్।**
**ప్రతిక్షణం క్షీణవృత్తేః వైలక్షణ్యం దినైర్భవేత్॥**

**ప్రతిపదార్థము:-** యథా తథా = ఎలాగోలా, యత్ర తత్ర = ఏదో ఒక ఆధారంమీద, ద్వాదశాంతే = ద్వాదశాంతమునందు, ప్రతిక్షణమ్ = ప్రతి నిమేషము, మనః =

మనస్సును, క్షిపేత్ = ఉంచవలయును. క్షీణవృత్తేః = వృత్తులు క్షీణించిన సాధకునకు, దినైః = రోజులలోనే, వైలక్షణ్యమ్ = తేడా అనగా భైరవతాసిద్ధి, భవేత్ = కలుగును.

**భావము:–** ఈ 'ద్వాదశాంతమును' తన శరీరంతో సంబంధము లేకుండా ఎక్కడనయినా భావన చేయవచ్చును. అలా మనస్సును ప్రతిక్షణము అనుసంధానము చేసినచో మనస్సుయొక్క సంకల్పాది వృత్తులు క్రమంగా తరిగిపోతాయి. సాధకునకు కొద్దిరోజులలోనే తేడా తెలుస్తుంది. భైరవస్థితి లభిస్తుంది.

**విశేషములు:–** 1. దీనిని ధారణ – 10తో సరిపోల్చవలెను.

2. ఎక్కడయినా, ఎప్పుడయినా, ఎలాగయినా – అంటే అర్థం తన మనస్సుకు ఎలా ఎపుడు నచ్చుతుందో అలా చేయడం వలన ప్రయోజనం లభిస్తుందని చెప్పడం.

3. మనస్సును మాటిమాటికి ఉంచాలనటం అన్ని ధారణలకు వర్తించేమాట. చెప్పిన, చెప్పబోవు ధారణలన్నింటిలోను మనస్సును ఇలానే నిక్షేపించాలి.

4. కాగా పూర్వశ్లోకము శరీరానికి సంబంధించిన అన్ని ద్వాదశాంతాలను చెప్పింది. ఈ శ్లోకం దృశ్యమయిన కుడ్యాదులయందయినా (ధారణ – 10లాగా) ద్వాదశాంత భావనతో భైరవీసిద్ధి పొందవచ్చునని చెప్తున్నది.

---

## ధారణ – 28

**51. శ్లో॥ కాలాగ్నినా కాలపదాదుత్థితేన స్వకం పురమ్।**
**ప్లుష్టం విచిన్తయేదన్తే శాన్తాభాసస్తదా భవేత్॥**

**ప్రతిపదార్థము:–** కాలపదాత్ = కుడికాలి బొటనవ్రేలినుండి, ఉత్థితేన = లేచిన, కాలాగ్నినా = కాలాగ్నిచేత, స్వకమ్= తన , పురమ్ = శరీరమను పట్టణం, ప్లుష్టమ్ = తగలబడిన దానినిగా, విచింతయేత్ = ధారణ చేయవలయును. అంతే = చివరకు, తదా = అపుడు, శాంత = శమించిన, ఆభాసః = ఆభాస రూపమయిన శరీరం, విశ్వముగలవాడు, భవేత్ = అగును.

**భావము:–** కుడికాలి అంగుష్ఠమునుంచి లేచిన కాలాగ్నిలో తన దేహమను పురము పూర్తిగా దగ్ధమయినట్లు భావింపవలెను. అట్టి భావన పరిణమించిన తర్వాత ఆభాస రూపమయిన విశ్వము అదృశ్యమయి తత్త్వరూపమయిన భైరవస్థితి లభించును.





**విశేషములు:–** 1. ఇది త్రిపురదహనవృత్తాంతమును తనయందారోపించడం లాగా ఉన్నది.

2. కాలపదం అంటే వ్యాఖ్యానంలో 'దక్షిణపాదాంగుష్ఠం' అని వ్రాశాను. నిఘంటు సాక్ష్యం దొరకలేదు.

3. పురం అనగా గుగ్గిలం అని అర్థంకూడా ఉన్నది గుగ్గిలం లాగా తన శరీరం జ్ఞానాగ్నితో తగలబడి ఈశ్వరుని ధూపంగా అయినట్లు చమత్కార భావనము. దీనికి నిఘంటు సాక్ష్యం ఉన్నది. చూ॥
"పురం శరీరేనగర గృహపాటలిపుత్రయోః పురస్తు గుగ్గులౌ" – హేమచంద్ర.

4. శాంతాభాసః – అంటే కాశ్మీరశైవంలో విశ్వం 'ఆభాస' అన్నది సిద్ధాంతము. జ్ఞానంతో / ధారణతో ఈ ఆభాసతగలబడితే మిగిలినది భైరవీదశయే.

---

## ధారణ – 29

**52. శ్లో॥ ఏవమేవ జగత్సర్వం దగ్ధం ధ్యాత్వా వికల్పతః।**
**అనన్యచేతసః పుంసః పుంభావః పరమో భవేత్॥**

**ప్రతిపదార్థము:–** ఏవమేవ = ఇట్లే, సర్వమ్ = సమస్తమయిన, జగత్ = ప్రపంచమును, వికల్పతః = వికల్పసహితముగా, దగ్ధమ్ = దగ్ధమయిన దానినిగా, ధ్యాత్వా = ధ్యానించి ఉన్న, అనన్యచేతసః = ఏకాగ్ర మనస్సుగల, పుంసః = పురుషునకు, పరమః = విశ్వోత్కృష్టమయిన, పుంభావః = పురుషత్వము అనగా భైరవత్వము, భవేత్ = కలుగును.

**భావము:–** వికల్పములనగా నామరూపాదులు. ప్రపంచమునకు బ్రహ్మమునకు తేడా ఈ నామరూపములే. కనుక ఈ వికల్పరూపమయిన జగత్తు అంతా కాలాగ్నిలో లయిస్తూ ఉన్నట్లు ధ్యానిస్తే ఆ పురుషునికి పరమపురుషస్థితి లభిస్తుంది. ఇంతకుముందు స్వశరీరదాహభావన, ఇందులో సర్వవిశ్వదాహభావన చెప్పబడింది.

---

## ధారణ – 30

**53. శ్లో॥ స్వదేహే జగతో వాపి సూక్ష్మసూక్ష్మతరాణి చ।**
**తత్త్వాని యాని నిలయం ధ్యాత్వాన్తే వ్యజ్యతే పరా॥**

**ప్రతిపదార్థము:–** స్వదేహే = తన శరీరమునందుగాని, జగతో వాపి = ప్రపంచము యొక్క శరీరమునందుగాని, యాని = ఏ, సూక్ష్మసూక్ష్మతరాణి = ప్రకృతి, మహత్, అవ్యక్తం, అహంకారం మొదలగు సూక్ష్మాతిసూక్ష్మములయిన, తత్త్వాని = తత్త్వములు గలవో వానియొక్క, నిలయమ్ = ప్రలయమును, ధ్యాత్వా = ధ్యానించి, అంతే = చివఱకు, పరా = పరాశక్తి / పర భైరవీస్థితి, వ్యజ్యతే = వ్యక్తమగును.

**భావము:–** ఈ ప్రపంచం ఈ శరీరము స్థూల సూక్ష్మ అత్యంతసూక్ష్మతత్త్వములచే నిర్మింపబడినవి. కనుక అవ్యక్తమయిన అహంకారం బుద్ధి, ఇంద్రియాలు మొదలగు తత్త్వములన్నియు ఒకదానిలో ఒకటి క్రిందనుంచి పైకి లయక్రమంలో లయమవుతున్నట్లు భావించిన వానికి చివఱకు పరభైరవీస్థితి అబ్బును. లయక్రమము అంటే భూమి నీటిలో ఈ '2' వాయువు ఈ 3 అగ్నిలో ఇలా అవ్యక్తందాకా వరసగా లయమై మాయ పరమాత్మలో లీనం కావటంతో భైరవీస్థితి వస్తుంది. ఈ లయక్రమము ప్రలయంలోగాని, మరణ సమయంలోగాని జరుగును. మరణించు యోగి లయక్రమంలో సర్వం ముడిచికొని చివరకు పరమేశ్వరునిలో లయమగును.

**విశేషములు:–** తత్త్వాని యాని = కన్న "యాంతి" అని ఉంటే బాగా సరిపోయేది. యాంతి = పొందుచున్న అని అర్థము చెప్తే విలయం పొందుచున్న తత్త్వాలను ధ్యానించి చివఱకు భైరవస్థితిని పొందును అన్న అర్థము అత్యంత సముచితంగా ఉంటుంది.

2. మయూరాండరసన్యాయము అని ఒకటి ఉన్నది. నెమలిగ్రుడ్డులో రసంలో లేని రంగులు నెమలిలో వస్తాయి. కాని అవన్నీ మనకు కనబడినా కనపడకపోయినా సూక్ష్మాతిసూక్ష్మకారణరూపంతో అందులో ఉంటాయని భావించాలి. అట్లే ఈ ప్రపంచం అంతా మాయాశక్తితో ఉన్నదే బయటకు కనబరుస్తుంది. ఈ ధారణతో ఈ భేదాలన్నీ లయిస్తే ఆ పరాశక్తి మిగులుతుంది. అచ్చటనే భైరవీదశ.

---

## ధారణ – 31

**54. శ్లో॥ పీనాం చ దుర్బలాం శక్తిం ధ్యాత్వా ద్వాదశగోచరే।**
**ప్రవిశ్య హృదయే ధ్యాయన్ ముక్తః స్వాతంత్ర్యమాప్నుయాత్॥**



**ప్రతిపదార్థము:–** ద్వాదశ = 12 చక్రాలు, గోచరే = దృశ్యముగాగల, హృదయే = దహరాకాశమునందు, పీనామ్ = మొదట్లో బలమయిన దానినిగాను, దుర్బలాం చ = దుర్బలమయిన దానినిగాను, శక్తిమ్ = శక్తిని, ధ్యాత్వా = ధ్యానించి, ప్రవిశ్య = లీనమయి, ధ్యాయన్ = ధారణ చేయుచు, ముక్తః = విముక్తుడై, స్వాతంత్ర్యమ్ = స్వతంత్ర్యతను, ఆప్నుయాత్ = పొందును.

**భావము:–** ద్వాదశచక్రములుగల దహరాకాశమునందు స్థూలదశలో లావుగాను, సూక్ష్మదశలో ఆజ్ఞాచక్రమునుంచి సన్నగాను ఉండేశక్తిని ధ్యానించాలి. క్రమముగా ఆ శక్తిని హృదయమునందు తీవ్రముగా ధ్యానించినచో ముక్తుడై స్వాతంత్ర్యరూప భైరవీదశను పొందును.

## ధారణ – 32

**55. శ్లో॥ భువనాధ్వాదిరూపేణ చిన్తయేత్ క్రమశోఽఖిలమ్।**
**స్థూలసూక్ష్మపరస్థిత్యా యావదన్తే మనో లయః॥**

**ప్రతిపదార్థము:–** భువనాధ్వాది = భువనాధ్వ మొదలగు వాటి, రూపేణ = స్వరూపముతో, క్రమశః = అధ్వ క్రమంప్రకారం, అఖిలమ్ = సమస్త విశ్వమును, స్థూల = స్థూలమయిన, సూక్ష్మ = సూక్ష్మమయిన, పర = పరమయిన, స్థిత్యా = స్థితిలో, అంతే = చివఱకు, మనః = మనస్సుయొక్క, లయః = లీనత, యావత్ = జరుగునంతవఱకు, చింతయేత్ = ధారణ చేయవలయును.

**భావము:–** (అధ్వలు '6' అవి వర్ణ పదమంత్ర, కాలతత్త్వభువనములని పేరు. భువనాధ్వ అనగా లోకాలు. వర్ణములు అంటే అక్షరాలు. పదములు కొన్ని వేదపదాలు. తత్త్వము 36, భువనములు కలాధ్వ – 5 కలలు. ఇది చాలా సంక్లిష్ట విషయం. ఇది కావలసినవారు తంత్రశాస్త్రములలో చూచి శ్రమింపగలరు.)

ఆఱు అధ్వలుగా ప్రపంచమే శైవశాక్తాగమములందు చూపబడినవి. దానికతీతుడు భైరవుడు, భైరవిగూడా షడధ్వాతీతసుభగా కదా! ముందు స్థూలసూక్ష్మ పరరూపమయిన షడధ్వ విచారణ చేస్తూ ఉంటే అనగా వాటి తత్త్వవిచారణ ద్వారా అసలు తత్త్వాన్ని కనుగొనగలిగేదాకా ఈ 'ధారణ' సాగవలెను.

**విశేషములు:–** ఈ ధారణ ఉపాసకులకు సాధ్యము. ఆగమోక్తమయిన షడద్వవిచారణ ఇతరులకు క్రొత్తగా నేర్పవలసిన విషయం కూడా! తర్వాత శ్లోకంగూడా ఇట్టిదే.

### ధారణ - 33

**56. శ్లో॥ అస్య సర్వస్య విశ్వస్య పర్యన్తేషు సమన్తతః।**
**అధ్వప్రక్రియయా తత్త్వం శైవం ధ్యాత్వా మహోదయః॥**

**ప్రతిపదార్థము:–** అస్య = ఈ, సర్వస్య = సమస్తమయిన, విశ్వస్య = ప్రపంచము యొక్క, పర్యంతేషు = ప్రాంతములయందు, సమంతతః = అంతటా, షడధ్వప్రక్రియయా = గత శ్లోకములో చెప్పబడిన అధ్వ శోధన ప్రక్రియద్వారా, శైవమ్ = శివసంబంధమయిన, తత్త్వమ్ = తత్త్వమును, ధ్యాత్వా = ధ్యానించి, (ధ్యానించినచో), మహోదయః = భైరవోదయము లభించును.

**భావము:–** ఈ సమస్తవిశ్వమునందు చుట్టూ ఉన్న విషయాలయందు సంపూర్ణముగా అధ్వ శోధన ప్రక్రియతో శైవతత్త్వాన్ని ధ్యానించి ధారణ చేసినచో మహోదయము సిద్ధించును. (ఇదంతా సాధారణపాఠకులకు అందనిది. తంత్రములలో చూడవలెను.)

---

### ధారణ - 34

**57. శ్లో॥ విశ్వమేతన్మహాదేవి! శూన్యభూతం విచిన్తయేత్।**
**తత్రైవ చ మనో లీనం తతస్తల్లయభాజనమ్॥**

**ప్రతిపదార్థము:–** మహాదేవి! = పార్వతీ!, ఏతత్ = ఈ, విశ్వమ్ = ప్రపంచమును, శూన్యభూతమ్ = శూన్యమయినదిగా, విచింతయేత్ = ధ్యానింపవలయును. తత్రైవ చ = ఆ శూన్యభావనయందే, మనః = మనస్సు, లీనమ్ = కఱగినదగును. తతః = ఆ మనోలయంవలన, తత్ = ఆ పరమేశ్వర / భైరవస్థితిలో, లయ = సమావేశమగుటను, భాజనమ్ = స్థానమగును.

**భావము:–** ప్రపంచమంతా పరమేశ్వరుని ఇచ్ఛాశక్తితో ఆభాసించినదే తప్ప వాస్తవం కాదు. కనుక శూన్యమిది అను ఆలోచనలో మనస్సు లీనమయినచో అట్టి సాధకుడు భైరవీదశలో లీనత సిద్ధమగును.

---



### ధారణ - 35

**58. శ్లో॥ ఘటాదిభాజనే దృష్టిం భిత్తీః త్యక్త్వా వినిక్షిపేత్।**
**తల్లయం తత్క్షణాత్ గత్వా తల్లయాత్తన్మయో భవేత్॥**

**ప్రతిపదార్థము:–** ఘటాది = కుండ మొదలగు, భాజనే = ఖాళీ పాత్రయందు, భిత్తీః = దాని గోడలను, త్యక్త్వా = వదలి, దృష్టిమ్ = చూపును, వినిక్షిపేత్ = ఉంచవలయును. తత్క్షణాత్ = అదే క్షణంలో, తత్ = ఆ శూన్యమునందు, లయాత్ = లీనతవలన, తన్మయః = ఆకాశరూపమయిన పరమభైరవదశను పొందినవాడు, భవేత్ = అగును.

**భావము:–** కుండ మొదలగు ఖాళీ పాత్రలలో శూన్యాన్ని మాత్రమే భావించాలి. ఆ వస్తువుల గోడలను మఱచిపోవాలి. ఆ శూన్యమునందు మనస్సు నిలిచినచో పరమాకాశరూపుడై ఆ శూన్యమునందును భాసించు పరమశివునితో ఐక్యము లభించును.

---

### ధారణ - 36

**59. శ్లో॥ నిర్వృక్షగిరిభిత్త్యాది దేశే దృష్టిం వినిక్షిపేత్।**
**విలీనే మానసే భావే వృత్తిక్షీణః ప్రజాయతే॥**

**ప్రతిపదార్థము:–** నిర్వృక్ష, గిరిభిత్త్యాది = చెట్లు, కొండలు గోడలు లేని మొదలయిన ఆటంకములులేని, దేశే = దేశమునందు, దృష్టిమ్ = దృష్టిని, వినిక్షిపేత్ = ఉంచవలయును. మానసే = మనస్సుకు సంబంధించిన, భావే = అస్తిత్వము, విలీనే = కఱగిపోగా, వృత్తిక్షీణః = మానసిక, ఇంద్రియ కార్యములే లేనివాడై, ప్రజాయతే = నిర్వికల్ప భైరవుడగును.

**భావము:–** కొండలు గోడలు చెట్లు లేని శూన్యమయిన మైదానములు చూచి ఆ శూన్యతను ప్రపంచమునందు శూన్యతలోను భైరవుని సత్తను ధ్యానించి ధారణ చేయు వాని మనస్సు ఆగును. ఆ స్థితిలో నిర్వికల్పమయిన భైరవతత్త్వము స్ఫురించును.

**విశేషములు:–** 1. దీని వ్యాఖ్యాత ఒకరు 'నిర్వృక్ష' వఱకే 'నిర్' అన్వయించాడు. వృక్షరహిత స్థలము, కొండ, గోడ మొదలయిన స్థలములో దృష్టిని నిలపాలని

వ్రాశారు. ఆ అర్థం సరిగాలేదు.

ఎ) వృక్షములు లేకపోవడం దేనికో తెలియదు.

బి) కొండ, గోడవలన వచ్చిన ప్రయోజనం తెలియదు.

సి) 57వ శ్లోకమునుంచి వరసగా శూన్యోపాసననే చెప్తున్నాడు. ఈ శ్లోకం తర్వాత గూడా అదే రకమయిన ఉపాసన చెప్పాడు.

కనుక ఈ శ్లోకంలో (59) గూడా శూన్యోపాసననే చెప్పాలి. కనుక, 'నిర్వ ృక్ష' అన్నాడు. కనుక 'నిర్' అనేది గిరి 'భిత్త్యాది' అనే పదాలకు గూడా కలపాలి. అపుడు శూన్యం మీద దృష్టిబంధం, ధారణ - అనబడే విషయం సరిపోతుంది. లేదంటే సందర్భం కుదరదు. అసలు శ్లోకంలో దేనిమీద దృష్టి పెట్టాలో తెలియదు. గిరిభిత్తుల మీద దృష్టికి వృక్షరహితస్థలదృష్టికి మధ్య అన్యోన్య సమన్వయం కుదరదు.

2. దృష్టి నిలుపగా ఆలంబనం / ఆధారం లేకపోవడం వలన - అని వ్యాఖ్యాత చెప్పాడు. కాని గిరిభిత్తులు ఆలంబనంగా అలానే ఉన్నాయి. వృక్షరహిత స్థలంలో అసలు ఆలంబనమే లేదు. కనుక నేను సందర్భ, పదార్థముల కుచితమయిన అర్థం వ్రాయడం జరిగింది.

---

## ధారణ - 37

**60. శ్లో॥ ఉభయోర్భావయోః జ్ఞానే ధ్యాత్వా మధ్యం సమాశ్రయేత్।**
**యుగపచ్చ ద్వయం త్యక్త్వా మధ్యే తత్త్వం ప్రకాశతే॥**

**ప్రతిపదార్థము:-** ఉభయోః = '2' అయిన, భావయోః = భావములయొక్క, జ్ఞానే = తోచుకాలమున / (ప్రతీతికాలం), మధ్యమ్ = భావములమధ్య భాగమును, జ్ఞాత్వా = ఎఱిగి, సమాశ్రయేత్ = ఆశ్రయింపవలయును. యుగపత్ = ఒకసారిగా, ద్వయం చ = ముందు తోచిన భావములు '2'ను, త్యక్త్వా = వదలి ధ్యానించినచో, మధ్యే = మధ్యలో ఉన్న, తత్త్వమ్ = ఆ '2' భావములను పొందిన తత్త్వము, ప్రకాశతే = ప్రకాశించును.

**భావము:-** ఒక వ్యక్తికి '2' భావములు వచ్చాయి. ఒకటి ఒకక్షణంలో, మఱొక భావం తరువాత క్షణంలో పుట్టవచ్చును. '2' భావాల ఉత్పత్తికి మధ్య ఉన్న ఖాళీలో





ఉన్నది భావశూన్యస్థితి. ఈ స్థితిలో ఉన్నది 'తనే' అనగా 'అహం' అనుకొనే జీవుడే. ఆయన తత్త్వము భైరవతత్త్వమే. కనుక భావముల '2'ను వదలిన తర్వాత నిలిచే 'తన' తత్త్వమును తనే గ్రహించి సాధకుడు భైరవునితో ఐక్యమును పొందుతాడు.

---

## ధారణ - 38

**61. శ్లో॥ భావే న్యక్తే నిరుద్ధా చిన్నైవ భావాన్తరం వ్రజేత్।**
**తదా తన్మధ్యభావేన వికసత్యతిభావనా॥**

**ప్రతిపదార్థము:-** న్యక్తే = పరిత్యక్తమయిన / కనబడని, భావే = పదార్థమునందు, నిరుద్ధా = నిలిచిన, చిత్ = జ్ఞానము, భావాంతరమ్ = మఱొక పదార్థమును, నైవ వ్రజేత్ = చేరదు. తదా = అట్టి స్థితిలో, తన్మధ్య = ఆ '2' భావముల మధ్యనున్న, భావేన = తీవ్రభావనచేత, అతిభావనా = భావనాతీతమయిన భైరవస్థితి, వికసతి = వికసించును.

**భావము:-** ఒక వస్తువును మనం మఱచినపుడు లేదా విరహపడినపుడు, పోగొట్టుకొన్నపుడు మన ధ్యాసంతా దానిమీద ఉంటుంది. మఱో ఆలోచన రాదు. ఇట్టి లీనతలో ధారణ చేసినచో భావాతీతమయిన భైరవస్థితి లభించును. ఆ ధ్యానియే పరాశక్తి. అదే 'చిత్' అది శివదూతి. తప్పక భైరవప్రాప్తి జరుగుతుంది.

**విశేషములు:-** దీనిలో భావేత్యక్తే అని, భావే వ్యక్తే అని, పాఠాంతరములు 2 కలవు. త్యక్తే అనగా విడిచిపెట్టబడిన అని అర్థం సరిపోతుంది. కాని వ్యాఖ్యాతలు 'అత్యక్తే' అని అర్థం చేశారు. కాని అది సరిపోదు. 'అవ్యక్తే' అను పాఠాంతరమయితే ఒక అవ్యక్తభావంమీద మనస్సు మళ్లితే - అని అర్థం చెప్పవచ్చును. కాళిదాసు చెప్పిన శాకుంతల దుష్యంతుని పరిస్థితి. అవ్యక్తంగా శకుంతలను గూర్చి వేదన. "భావస్థిరాణి జననాంతరసౌహృదాని" అన్నట్లు 'తచ్చేతసాస్మరతి నూనమబోధ పూర్వమ్' అని 'అబోధపూర్వం' వంటి అవ్యక్తస్థితి అని అర్థం చెప్పవచ్చును. అత్యక్తే అని, వ్యక్తే అని చెప్పిన అర్థం కుదరదు.

2. 'న్యక్తం' అనేది వైదిక ప్రయోగం అని వ్యాఖ్యాత చెప్పాడు. దానికి తైత్తిరీయ సంహితలో సాయణాచార్యుడు చెప్పిన అర్థం.

'న్యక్తం – నిమగ్నం విస్తృతం' అని ఇదే సముచితం. మనకు కనబడనిది మరచిపోయినది అని అర్థం. 'న్యక్' అనే పదానికి బోర్లపడిన, తిరస్కారము వంటి అర్థాలున్నాయి. అలా ఆలోచించినా బోర్లపడిన వస్తువుయొక్క ఆకారంగాని, దానిక్రింద ఏమున్నదిగాని మనకు తెలియదు. తిరస్కారము అంటే మరచిపోవడం, వదలడం మొదలయిన అర్థాలకు సమీప సంబంధము కలదు. కనుక 'న్యక్తే' అంటే వదలబడిన, మఱవబడిన అనే అర్థములు సరిపోవును. విరహం అనే పదానికి అర్థము 'త్యాగము' అని. 'రహాక్ – త్యాగే' అన్నదే ధాతువు.

3. వ్యాఖ్యాతలు 'అద్భుతపుల్ల' న్యాయంతో దీనికి అర్థం చెప్పారు. అద్భుత వస్తువును చూచి మనస్సు వికాసం చెంది కొంతసేపు ఆ ఆనందంలో ఉంటుంది. ఆ స్థితిని ధారణ చేస్తే భైరవీస్థితి అని అర్థము. కాని 'న్యక్తే' అన్న పదానికి 'అద్భుతం' అనే అర్థం సులభం కాదు. 'అదృష్టే' అని అర్థము చెప్పారు. అది అమూలము. 'పూర్వందృష్టే పరిత్యక్తే ఇదానీం అదృష్టే' అని లాగాలి. లాగినా 'అద్భుతం' అని అర్థం రాలదు.

---

## ధారణ - 39

**62. శ్లో॥ సర్వం దేహం చిన్మయం హి జగద్వా పరిభావయేత్।**
**యుగపన్నిర్వికల్పేన మనసా పరమోదయః॥**

**ప్రతిపదార్థము:–** సర్వమ్ = సమస్తమయిన, దేహమ్ = శరీరమును, జగద్వా = ప్రపంచమునుగాని, చిన్మయం హి = జ్ఞానమయముగానే, పరిభావయేత్ = భావింపవలెను. యుగపత్ = ఒక్కసారిగా / హఠాత్తుగా, నిర్వికల్పేన = వికల్పరహితమయిన, మనసా = మనస్సుతో, పరమా = పరభైరవదశ యొక్క ఉదయః = సంభవము జరుగును.

**భావము:–** సమస్తంగా తన దేహమును జ్ఞాన (చిత్ / ప్రకాశం) రూపంగా భావింపవచ్చును. లేదా ప్రపంచమంతటిని 'చిత్తుగా' భావింపవలయును. ఆ భావన ఒక్కసారిగా మనస్సును నిర్వికల్పం చేస్తుంది. అంతట పరమభైరవదశ సిద్ధించును.

**విశేషములు:–** ప్రకాశమానం న పృథక్ ప్రకాశాత్
న చ ప్రకాశో న పృథగ్విమర్శాత్।



**నాన్యో విమర్శోఽహమితి స్వరూపాత్**
**అహం విమర్శోఽస్మి చిదేకరూపః॥**

అని చెప్పినట్లు దేహజగత్తులు విమర్శరూపమయినవి. ఆ విమర్శ, ప్రకాశ రూపుడయిన పరమేశ్వరుని స్వాతంత్ర్యశక్తియే. కనుక తాను ఆ పరమేశ్వరుడే అనే భావన దేహధారణ / ప్రపంచధారణ వలన వస్తుంది.

---

## ధారణ - 40

**63. శ్లో॥ సర్వం జగత్ స్వదేహం వా స్వానన్దభరితం స్మరేత్।**
**యుగపత్ స్వామృతేనైవ పరానన్దమయో భవేత్॥**

**ప్రతిపదార్థము:–** సర్వమ్ = మొత్తము, జగత్ = ప్రపంచమును, స్వదేహం వా = తన దేహమునుగాని, స్వానంద = స్వస్వరూపానందముతో, భరితమ్ = నిండిన దానినిగా, స్మరేత్ = స్మరింపవలయును. యుగపత్ = ఒక్కసారిగా, స్వామృతేనైవ = తన ఆనందరూపంతోనే, పరానందమయః = పరమానందభైరవరూపుడుగా, భవేత్= అగును.

**భావము:–** తన దేహమునుగాని, ఎదుటి ప్రపంచమునుగాని ఆనందభరితంగా ధారణ చేసిన వానికి ఏదో ఒకరోజున హఠాత్తుగా స్వానందము నుంచియే పరమానందరూపమయిన 'భైరవీదశ' లభించును. ప్రపంచము 'ఆశ్యాన చిద్రసరూపము'అని సిద్ధాంతము. అనగా 'గడ్డకట్టిన జ్ఞానము' అట్లే 'గడ్డకట్టిన ఆనందమున్ను' అవుతుంది.

**విశేషములు:–** గత శ్లోకములో విశ్వ, దేహములమీద చిన్మయములని ధారణ, ఇందులో ఆనందమయములని ధారణ.

---

## ధారణ - 41

**64. శ్లో॥ వాయుద్వయస్య సంఘట్టాదన్తర్వా బహిరన్తతః।**
**యోగీ సమత్వవిజ్ఞానసముద్గమనభాజనమ్॥**

**ప్రతిపదార్థము:–** అంతర్వా = లోపల హృదయమునందుగాని / అంతర్ద్వాద

శాంతమునందుగాని, బహిర్వా = బయట ద్వాదశాంతమునందుగాని, వాయు ద్వయస్య = ప్రాణాపానములయొక్క, సంఘట్టాత్ = కలయిక / సంఘర్షణవలన, యోగీ = యోగి, అంతతః = చివరకు, సమత్వ = సామ్యముయొక్క, విజ్ఞాన = ఎఱుకయొక్క, సముద్గమన = ఉదయించుటకు, భాజనమ్ = స్థానము, భవేత్ = అగును.

**భావము:–** శరీరములో ప్రాణాపానములుండును. అవి ఒకదానికి ఒకటి పూరకములుగా ఆకర్షకములుగా ఉండును. ఇవి హృదయమునందుగాని, ద్వాదశాంతమునందుగాని, ఈ '2' బయట కలిసినపుడు 'సమానస్థితి' ఏర్పడుతుంది. ప్రాణం ప్రవేశించుచుండగా అపానం బయటకు పోతుంది. అపానం ప్రవేశిస్తుండగా ప్రాణం బయటకు నడుస్తుంది. ఈ సంధిలో '2' ఒకే స్థితి అనగా 'అభేదాన్ని' పొందుతాయి. ఈ ప్రవేశనిర్గమముల పర్యవసానంగా ఏర్పడిన సామ్యస్థితి సాధకునకు పరమసామరస్యస్థితిని కల్గించును.

---

## ధారణ - 42

**65. శ్లో॥ కుహనేన ప్రయోగేణ సద్య ఏవ మృగేక్షణే।**
**సముదేతి మహానన్దో యేన తత్త్వం ప్రకాశతే॥**

**ప్రతిపదార్థము:–** మృగేక్షణే = మృగలోచనా! పార్వతీ! కుహనేన = అద్భుతమాయారూపమయిన, ప్రయోగేణ = ఇంద్రజాలాది ప్రయోగముచేత, సద్య ఏవ = వెంటనే, మహానందః = గొప్ప ఆనందము, సముదేతి = ఉదయించును. యేన = ఏ ఆనందము చేత (ధారణ చేస్తే) తత్త్వమ్ = పరమానందరూపమయిన తత్త్వము, ప్రకాశతే = ప్రకాశించును.

**భావము:–** కుహనా అంటే రహస్యము. అట్టి రహస్య ప్రయోగమయిన ఇంద్రజాలాది దృశ్యమును చూచినపుడు వ్యక్తికి అద్భుతమయిన ఉక్కిరిబిక్కిరి చేసే 'ఆనందము' కలుగును. ఆ ఆనందస్థితి యందు ధారణ చేసినచో యోగికి పరమానందతత్త్వం సిద్ధించును. ఇదే **అద్భుత పుల్లన్యాయం**. అనగా అద్భుతం చూసినపుడు మనస్సు వికసించడం. దీనియందు ధారణ చేస్తే భైరవీస్థితి సిద్ధించును.

---



## ధారణ - 43

**66. శ్లో॥ సర్వస్రోతో నిబన్ధేన ప్రాణశక్త్యోర్ధ్వయా శనైః।**
**పిపీలస్పర్శవేళాయాం ప్రథతే పరమం సుఖమ్॥**

**ప్రతిపదార్థము:–** సర్వ = సమస్తమయిన, స్రోతః = కాలువలయిన ఇంద్రియ రంధ్రముయొక్క, నిబన్ధేన = షణ్ముఖీముద్ర, యోనిముద్రలవలన ఆపుటచేత, శనైః = మెల్లగా, ఊర్ధ్వయా = ఊర్ధ్వగామిని అయిన, ప్రాణశక్త్యా = ప్రాణశక్తితో, పిపీల = చీమలయొక్క, స్పర్శ = స్పర్శవంటి స్పర్శగల, వేళాయామ్ = సమయమున, పరమమ్ = గొప్ప, సుఖమ్ = ఆనందము, ప్రథతే = విస్తరించును.

**భావము:–** సర్వేంద్రియమార్గమును నిరోధించి (షణ్ముఖ – యోనిముద్రలచేత) ఇతర ముద్రలతో ప్రాణశక్తిని ఊర్ధ్వముఖం చేస్తే ఆ ప్రాణశక్తి మూలాధారాత్ బయలుదేరినపుడు యోగిశరీరంలో పిపీలికాస్పర్శ అనగా చిమచిమలాడటం చుఱచుఱలాడడం జరుగును. ఆ సమయంలో ఉండే ఆనందమునందు ధారణ చేసినచో పరమసుఖస్థితి కలుగును. (అనగా ఈ విధంగా వాస్తవంగా చేయలేనివాడు ఈ విధంగా ధారణ / భావన చేయగా ఈ స్థితి సిద్ధించును. అంటే వాయువుద్వారా సిద్ధించేది మనస్సుద్వారా సిద్ధింపజేయడం. అహంకారంయొక్క జ్ఞానశక్తి మనస్సు క్రియాశక్తి ప్రాణాపానములు కనుక '2'లో ఏదయినా సమానమే.)

లేదా యోగారంభవేళలో ఉండే యోగికి ఈ ధారణ చెప్పినట్లు భావించాలి. ఎందుకంటే 'పిపీలస్పర్శ' వేళ అనేది యోగి విషయంలోనే సంభవము. కనుక ఆ స్థితిలో వచ్చే ఆనందమును ధారణ చేస్తే పరమానందము కలుగును.

---

## ధారణ - 44

**67. శ్లో॥ వహ్నేర్విషస్య మధ్యే తు చిత్తం సుఖమయం క్షిపేత్।**
**కేవలం వాయుపూర్ణం వా స్మరానన్దేన యుజ్యతే॥**

**ప్రతిపదార్థము:–** వహ్నేః = అగ్నియొక్క, విషస్య = విషముయొక్క, మధ్యే తు = మధ్యభాగమునందు, కేవలమ్ = వాయురహితము, వా = లేదా, వాయు = ప్రాణవాయువుచేత, పూర్ణమ్ = నిండినదియు అగు, చిత్తమ్ = మనస్సును, సుఖమయం = సుఖభరితమయినదానినిగా, క్షిపేత్ = పడవేయవలయును.

స్మరానందే = అట్టివాడు కామసంబంధమయిన ఆనందమునందు, న యుజ్యతే = కలవడు.

**భావము:–** వహ్నికి విషమునకు మధ్య తన మనస్సును – ప్రాణాయామ కుంభకంతోగాని రేచకంతోగాని, సుఖభావనతో నింపినవాడు జీవితములో విషయానందములకు చెందడు. అనగా పరమానందమును పొందును.

**విశేషములు:–** 1. వహ్ని = మూలాధారమునందలి అగ్నిచక్రము. లేదా మూలాధారముకన్న క్రింద ఉన్నట్లు కొన్ని యోగగ్రంథాలు చెప్పిన 'అధస్సహస్రార పద్మము'. ఇది ఊర్ధ్వముఖము అధఃకుండలిని అందురు. అపానకుండలిని. ప్రసుప్త కుండలిని. ఇది సంకోచస్థానము. కుండలిని యిచ్చట సంకుచితమయి ఉంటుంది. ప్రాణము లేదా జననేంద్రియనాభులకు మధ్యగల అగ్ని అను పవనాధారము. లేదా మామూలు అగ్ని.

2. విషము పైనమన్న సహస్రారపద్మము. ఊర్ధ్వకుండలిని. ప్రాణకుండలిని. వికాసస్థానము. అపానము. లేదా మేఢ్రమధ్యమున నున్న మఱొక పవనాధారము. లేదా మామూలు విషము.

3. మధ్యే = మధ్యభాగము అనగా మధ్యలోని సుషుమ్నానాడి. దానినే 'ఉన్మేషభట్టారకుడు' అందురు. సృష్టిగ్రంధి. లేదా '2' పవనాధారముల మధ్య (పవనాధారములు 16 అని కులామ్నాయాంలో ఉన్నదని ఒక వ్యాఖ్యాత.)

4. వాయుపూర్ణం = అంటే వాయువుతోగాని దానికి బీజాక్షరమయిన 'హ్'తో లేదా 'ః'తో కూడిన మనస్సు. హ్ = అచ్చులేని హకారము **అనచ్కము** అందురు.

ఈ మొత్తం అర్థములు ఆలోచించగా,

1. మూలాధార సహస్రారముల మధ్య సుషుమ్నానాడిలో,
2. ప్రాణాపానముల మధ్య సుషుమ్నలో (ఇదే విషువత్)
3. ఊర్ధ్వ – అధస్సహస్రారముల మధ్య సుషుమ్నలో
4. మేఢ్ర నాభులమధ్యనున్న పవనాధార స్థలములు '2' యందు
5. వహ్నియందు విషమునందుగాని 'సుఖబుద్ధి'ని నిలిపినచో ఆ ధారణ గలవాడు విషయానందములకు చెందడు. ఇందు చివరిదానిలో "బాధే సౌఖ్యమనే భావన" అట్టివానికి ఇతర విషయానందములకు అతీతస్థితి లభించును. స్త్రీ సంగం





లేకుండానే అట్టి ఆనందాన్ని భావించడం వలన ఆనందధారణ. దానివలన మోక్షము.

---

## ధారణ – 45

**68. శ్లో॥ శక్తిసఙ్గమసంక్షుబ్ధశక్త్యావేశావసానికమ్।**
**యత్సుఖం బ్రహ్మతత్త్వస్య తత్సుఖం స్వాక్యముచ్యతే॥**

**ప్రతిపదార్థము:–** శక్తి సంగమ = స్త్రీతో లేదా స్త్రీపురుషశక్తులయొక్క, సంక్షుబ్ధ = రేగిన, శక్త్యావేశ = స్త్రీ సంగానందముయొక్క, అవసానికమ్ = చివఱగలుగునట్టి, సుఖమ్ = సుఖము, యత్ = ఏదికలదో, తత్సుఖమ్ = ఆ సుఖము, బ్రహ్మతత్త్వస్య = బ్రహ్మతత్త్వమయిన ఆనందమునకు సంబంధించినది. అందుచేత స్వాక్యమ్ అది స్వకం అనగా తనది అని, ఉచ్యతే = చెప్పబడును.

**భావము:–** పురుషులకు స్త్రీసంగము స్త్రీలకు పురుషసంగము అత్యంతిక సుఖప్రాయము. అందువలన ఇచ్చట శక్తుల సంగమం అని అర్థము చెప్పవచ్చును. ఏదయినా దాంపత్యం శృంగారంవలన వచ్చిన సుఖం దాంపత్య క్రియానంతరం గూడా కొంతసేపే ఉంటుంది. అది బ్రహ్మానంద తత్త్వము. ఏవస్తువువలననయినా మనలోని ఆనందమే బయటకు అనుభవానికి వస్తుంది. అంతేతప్ప వస్తువు ఆనందాన్ని ఎక్కడినుంచిగాని తెచ్చి ఇవ్వదు. అయితే మన ఇష్టంవలన మనలోని ఆనందాన్ని ఫలానా ఇష్టవస్తువు వలన పైకి తెస్తున్నాం. కవ్వంవలన వెన్న వచ్చినట్లు. కవ్వం వెన్నను బయటనుంచి తెచ్చిపడవేయదు. పాలల్లో ఉన్న వెన్ననే బయటకు తెచ్చి పాలమీద తేలుస్తుంది. అలానే ఒక శాస్త్రము మనకు తెలివితేటలను బయటనుంచి తీసికొనిరాదు. మనలోని తెలివితేటలే శాస్త్రంవలన పెరుగుతాయి. కనుకనే ఒకవస్తువు ఒకరికి ఆనందాన్ని ఇస్తే మరొకరికి దుఃఖాన్ని ఇస్తుంది లేదా ఏదీ ఇవ్వదు. తటస్థంగా ఉండిపోతుంది. కనుక ఇవి వస్తుగుణాలు కావు. మనోగుణాలు. అట్లే ఒకశాస్త్రం ఒకనికి బాగా తెలివినిస్తుంది. మరొకరికి ఏమీ అర్థంకాదు. అంటే తెలివి శాస్త్రగుణం కాదు. అది వ్యక్తిదే. శాస్త్రం కవ్వం మాత్రమే.

ఒక ధ్వనికి అనురణధ్వని ఉన్నట్లు. దాంపత్యసుఖానికి కూడా అనురణన సుఖం ఉంటుంది. అదే శృంగారానంతరం నిలిచి ఉండే సుఖం. అది శృంగారం వలన బయటకి వచ్చిన మనలోని ఆనందతతత్త్వమే కాని శృంగారసుఖం కాదు.

కారణం ఆ సుఖావస్థలో శృంగారం లేదు కనుక. అన్నిరకాల విషయసుఖాలు ఇంతే. కనుక యోగి అయినవాడు ఈ 'అనురణనసుఖం' మీద తీవ్రధారణ చేసినచో ఆనందతత్త్వము విశదమయి ఆనందభైరవదశ సిద్ధించును.

కనుక స్త్రీసంగం ఉన్నా లేకపోయినా ఇటువంటి ఆనందాంశాన్ని ధారణ చేయగల్గినవానికి పై స్థితి కలుగును.

**విశేషములు:–** 1. తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేదనాంతరమ్ అని శ్రుతి చెప్పిన ఉపమానం ఈ ధారణకు పూర్వరంగం అయి ఉండవచ్చును.

2. ఇట్టి భావనను ఒకదానిని స్పందకారిక చెప్పింది.

**'అతిక్రుద్ధః ప్రహృష్టో వా కింకరోమీతి వామృశన్।**
**ధావన్వా తత్పదం గచ్ఛేత్ యత్ర స్పందః ప్రతిష్ఠితః॥** –22

దీని భావమేమనగా తీవ్రకోపంగాని అద్భుతసంతోషంగాని కలిగినపుడు "నేను ఏం చేస్తున్నాను" అని ఆలోచించేవాడు ఆ స్పందమూలమయిన పరాశక్తి స్థితికి చేరుకొంటాడు.

ఇది రమణులు చెప్పిన "నేను" మూలాన్ని వెదకడం వంటిదిగదా!

---

## ధారణ – 46

**69. శ్లో॥ లేహనామంథనాకోటైః స్త్రీసుఖస్య భరాత్ స్మృతేః।**
**శక్త్యభావేఽపి దేవేశి! భవేదానన్దసంప్లవః॥**

**ప్రతిపదార్థము:–** దేవేశి! = దేవేశ్వరీ! పార్వతీ!, శక్త్యభావేఽపి = శక్తి లేదా స్త్రీలేకపోయినను, లేహన = పెదవులు నాకుటచేత, ఆమంథన = చిలుకుటచేత, ఆకోటైః = మాటికి మాటికి మర్దించుటచేత వచ్చునట్టి, స్త్రీసుఖస్య = స్త్రీసంబంధ మయిన సుఖము యొక్క, భరాత్ = భారమయిన / బరువయిన, స్మృతేః = స్మరణ / ధ్యానంవలన, ఆనందసంప్లవః = ఆనందవిప్లవము, భవేత్ = కలుగును.

**భావము:–** శక్తి ఒంట్లో లేకున్నను, లేదా శక్తి అనగా స్త్రీ లేకున్నను, ఆమెతో కలిసి చేసిన సంభోగవ్యాయామస్మరణవలన ఏ ఆనందము వచ్చునో ఆ ఆనందము తనలోనిదే అని స్పష్టము. దానికి స్త్రీ, శృంగారము, ఓపిక – వ్యంజకములు మాత్రమే.





వాటివలన ఆనందము బయటనుంచి రాదు. తనలోని ఆనందమే అనుభవానికి వచ్చును. కనుక పై స్థితిలోని ఆనందతత్త్వమును ధారణతో ధ్యానించినచో 'ఆనంద భైరవ' దశ లభించును. తలచినంతనే సర్వవిషయాలను మఱపించగల ఆనందము తనలోనిదేనని తెలియటమే అనగా అనుభవంలోకి రావటమే మోక్షము.

---

## ధారణ – 47

**70. శ్లో॥ ఆనన్దే మహతి ప్రాప్తే దృష్టే వా బాన్ధవే చిరాత్।**
**ఆనన్దముద్గతం ధ్యాత్వా తల్లయస్తన్మనా భవేత్॥**

**ప్రతిపదార్థము:–** చిరాత్ = చాలాకాలమునకు, మహతి = గొప్ప, ఆనందే = ఆనందము, ప్రాప్తే = లభించినను, బాంధవే = బంధువు, దృష్టే వా = కనబడినను, ఉద్గతమ్ = పెల్లుబికిన, ఆనందమ్ = ఆనందమును, ధ్యాత్వా = ధ్యానించి, తల్లయః = ఆనందమునందు లయము కలవాడై, తన్మనాః = ఆనందమనస్సుగలవాడు, భవేత్ = అగును లేదా తన్మనాః = ఆనందమనస్సుగలవాడై, తల్లయః = ఆనందతత్త్వమునందు, లయము = చెందినవాడు, భవేత్ = అగును.

**భావము:–** చాలాకాలమునకు గొప్ప సంతోష విషయముగాని, ప్రియబంధువుగాని తటస్థపడినచో మన హృదయంలో ఆనందము పెల్లుబుకును. అట్లు పెల్లుబికిన ఆనందపు మీగడను ధారణ చేసినచో ఆనందభైరవతత్త్వమున లయించును. అనగా 'ఆనందము – తనలోనిదని, అది పొంగుటకు కారణము సంతోష కారణములయిన పదార్థములని తనలోని ఆనందము పరమానందాంశ అని, దానిని ధారణ చేసినచో "కాడ పుచ్చుకొని లాగినచో కమలము లభించినట్లు" భైరవానందము / పరమానందము సిద్ధించునని భావము. కనుకనే ఒక శ్లోకము ఇలా అన్నది. (స్తవబింబామణిలో భట్టనారాయణుడు)

**"త్రైలోక్యేఽప్యత్ర యోయావా నానందః కశ్చిదీక్ష్యతే।**
**స బిందుర్యస్య తం వందే దైవమానందసాగరమ్॥**

---

## ధారణ - 48

**71. శ్లో॥ జగ్ధిపానకృతోల్లాసరసానన్దవిజృమ్భణాత్।**
**భావయేద్భరితావస్థాం మహానన్దస్తతో భవేత్॥**

**ప్రతిపదార్థము:–** జగ్ధి = ఆకలితో ఇష్టపదార్థము తినుటవలన, పాన = దప్పికలో చల్లని నీరుత్రాగుట వలన, కృత = కలిగిన, ఉల్లాసరస = సంతోషము వలన కలిగిన, ఆనంద = ఆనందముయొక్క, విజృంభణాత్ = విజృంభించడం వలన, భరితావస్థామ్ = నిండిన ఆనంద పూర్ణదశను, భావయేత్ = భావింపవలెను. తతః =దానివలన, మహానందః = గొప్ప ఆనందము, భవేత్ = కలుగును.

**భావము:–** ఆకలిదప్పికలు తీవ్రంగా ఉన్నపుడు అత్యంత ప్రియమయిన అన్నపానీయములు స్వీకరించుటవలన ఏ ఆనందము మనలో కట్టలు త్రెంచికొంటుందో ఆ ఆనందమునయినా భావన / ధారణచేసినచో ఆ ఆనంద పూర్ణావస్థ భైరవానందసామరస్యమును ఇచ్చును.

---

## ధారణ - 49

**72. శ్లో॥ గీతాదివిషయాస్వాదా సమసౌఖ్యైకతాత్మనః।**
**యోగినస్తన్మయత్వేన మనోరూఢేస్తదాత్మతా॥**

**ప్రతిపదార్థము:–** గీత = గానము, రూపము, రసము మొదలగు, విషయ = విషయములయొక్క, ఆస్వాద = ఆస్వాదించుటవలన, అసమ = అనుపమానమ యిన, సౌఖ్య = సుఖముతో, ఏకతాత్మనః = ఏకత్వమును పొందిన మనస్సుగల, యోగినః = యోగికి, తన్మయత్వేన = ఆ సౌఖ్యమయత్వంతో, మనః = మనస్సుయొక్క, ఆరూఢేః = గట్టిపడుటవలన, తదాత్మతా = ఆ ఆనందస్వరూపత్వమే అనగా భైరవరూపత్వమే లభించును.

**భావము:–** గానం, చక్కని రూపము, మంచి రుచి మొ॥వాటిని ఆస్వాదించేటపుడు లభించే ఆనందము మీద ధారణ చేసి నట్లయితే తప్పక ఆనందభైరవ స్థితి కలుగును.

**విశేషములు:–** 1. ఇటువంటి ఏ భావనలోనయినా అంతకు ముందున్న వేద్యమును మఱచి ఆనందంలో లీనమగుటే భైరవసిద్ధిదాయకము.

2. ఈ విషయాన్నే శ్రీమదభినవగుప్తులు ఇంకా వివరంగా చెప్పారు.





**తథాహి మధురే గీతే స్పర్శే వా చందనాదికే।**
**మాధ్యస్థ్యవిగమే యాసౌ హృదయే స్పందమానతా॥**
**ఆనందశక్తిః సైవోక్తా... 3-(209 -210)**

అని తంత్రాలోకంలో చెప్పారు.

3. అట్లే జయరథుడు తన వ్యాఖ్యలో

**యే యే భావా హ్లాదిన ఇహ దృశ్యాః సుభగసుందరాకృతయః।**
**తేషామనుభవకాలే స్వస్థితిపరిపోషణం సతామర్చా॥**

అన్నారు. అనగా ఆనందకరమయిన అనుభవకాలమున తన స్థితి ఏమిటో గ్రహించటమే 'సత్పూజ' అని. ఈ మొత్తం భావనల సారాంశము ఏమంటే అనుభవకాలమున తన స్థితిని గుర్తించడం నిలుపుకొనటం భైరవీదశకు సాధనంగా అవుతుంది.

---

## ధారణ - 50

**73. శ్లో॥ యత్ర యత్ర మనస్తుష్టిః మనస్తత్రైవ ధారయేత్।**
**తత్ర తత్ర పరానన్దస్వరూపం సంప్రవర్తతే॥**

**ప్రతిపదార్థము:–** యత్ర యత్ర = ఎక్కడెక్కడ, మనః = మనస్సుయొక్క, తుష్టిః = సంతృప్తి / ఆనందముగలదో, తత్రైవ= అచ్చటనే, మనః = మనస్సును, ధారయేత్ = ధారణ చేయవలయును. తత్ర = అచ్చటనే, పరానంద = పరమానందముయొక్క, స్వరూపమ్ = నిజరూపము, సంప్రవర్తతే = సాగుచుండును.

**భావము:–** మనకు ఎక్కడ ఎక్కడ వ్యక్తిభేదం వలన, రుచిభేదం వలనగాని, అభిరుచి తీవ్రంగా ఉంటుంది, పొందితే తీవ్రసంతోషం కలుగుతుందో అచ్చట వచ్చిన ఆనందంలో అనురణనంగా పరమానందస్వరూపం ప్రవర్తిస్తుంది.

**విశేషములు:–** ఎంతటి అందమయిన స్త్రీని చూచినా

1. మనకు గలిగే ఆనందము భౌతికము. కాని ఆ సుందరశరీరములో ఉన్న చైతన్యము శివుడని, ఆ భైరవుడు తన స్వరూపమేనని, "**శివోఽహం**" అని భావించడం ద్వారా భౌతికానందం పరమానందం అవుతుంది. అందులోని భౌతికత పోతుంది. ఆధ్యాత్మికత వస్తుంది.

2. ఇదే స్వచ్ఛందతంత్రంలో కూడా చెప్పారు.

**యత్ర యత్ర మనో యాతి జ్ఞేయం తత్రైవ చింతయేత్।**

**చలిత్వా యాస్యతే కుత్ర సర్వం శివమయం యతః॥ - 4-313**

---

## ధారణ - 51

**74. శ్లో॥ అనాగతాయాం నిద్రాయాం ప్రణష్టే బాహ్యగోచరే।**

**సావస్థా మనసా గమ్యా పరా దేవీ ప్రకాశతే॥**

**ప్రతిపదార్థము:-** నిద్రాయామ్ = నిద్ర, అనాగతాయామ్ = రాకుండా ఉండగా, బాహ్యా = బయట, గోచరే = దృశ్యము, ప్రణష్టే = అదృశ్యముకాగా, మనసా = మనస్సుచేత, గమ్యా = పొందదగిన, సా = ఆ, అవస్థా = శూన్యావస్థ వంటిస్థితి, పరాదేవీ = పరాశక్తిగా, ప్రకాశతే = ప్రకాశించును.

**భావము:-** నిద్ర ఇంకా రాలేదు. కాని కళ్లు మూతలుపడ్డాయి. బాహ్యస్థితి అందటం లేదు. ఈ స్థితిలో మనస్సు ఏ స్థితిలోనికి పోతున్నదో లేదా మనం ఏ స్థితిలోనికి వెళ్తున్నామో దానిని (మనస్సుతో) గ్రహించి ముందుకు సాగినచో పరాశక్తి స్ఫురించును.

**విశేషములు:-** 1. నిద్రమత్తులో మనస్సు ఏకమవుతున్నది. ఎందులో లయించబోతున్నది అన్నది అదే మనస్సుతో అర్థం చేసికొని ఆ స్థితిపై ధారణ చేసినచో భైరవీస్థితి సాక్షాత్కరించును. ఇందులో మనస్సుయొక్క శూన్యస్థితి, దానిని గుర్తించే 'నేను' అనే చైతన్యము '2' ఉన్నవి. అందువలన అచ్చట ధారణ చేసినచో 'శుద్ధ - అహంత'తో ఐక్యము సిద్ధించును.

2. ఇదే విషయం యోగవాశిష్ఠంలో చెప్పారు.

**నిద్రాదౌ జాగరస్యాంతే యో భావ ఉపజాయతే।**

**తం భావం భావయన్ సాక్షాత్ అక్షయానందమశ్నుతే॥**

3. జాగరస్యాంతే - అన్న విషయంలో శ్రీ రమణమహర్షి చెప్పిన ఉపదేశం ఒకటి ఉన్నది. చూ॥

"నిద్రనుండి మేల్కొంటున్న మొదటిక్షణాల్లో అంటే ఇంకా ప్రపంచాన్ని





పూర్తిగా గమనించని స్థితిలో ఈ పరిశుద్ధమయిన "నేను"ను సులభంగా తెలిసికొనవచ్చును.

- రమణమార్గం లీలా వి.కృష్ణ

---

## ధారణ - 52

**75. శ్లో॥ తేజసా సూర్యదీపాదేరాకాశే శబరీకృతే।**

**దృష్టిర్నివేశ్యా తత్రైవ స్వాత్మరూపం ప్రకాశతే॥**

**ప్రతిపదార్థము:-** సూర్య = సూర్యుడు, దీప = దీపము, ఆదేః = మొదలగుగాగల కాంతి పదార్థములయొక్క, తేజసా = వెలుగుతో, శబరీకృతే = చిత్రవర్ణముగా చేయబడిన, ఆకాశే = ఆకాశమునందు, దృష్టిః = చూపు, నివేశ్యా = ధారణ చేయదగినది. తత్రైవ = అచ్చటనే, స్వాత్మరూపమ్ = తన నిజస్వరూపము, ప్రకాశతే = ప్రకాశించును.

**భావము:-** సూర్యుడు మొదలగు కాంతి పదార్థములవలన వెలుగులు విరజిమ్ముతున్న ఆకాశము, గృహాకాశము, ఘటాకాశం వంటి వాటియందు మనస్సును నిలిపి యుంచినచో తప్పక తన దేహాకాశవ్యాప్తమయిన జ్ఞానదీపముతో లేదా జ్ఞానదీపపు వెలుగులతో నిండిన తన దహరాకాశమును స్మరించుట ద్వారా భైరవీదశ అబ్బును. ఇది శాంభవధారణ. అలాకాక దృష్టిబంధాన్ని మాత్రమే అభ్యసిస్తే అది ఇంద్రజాలానికి పనికివచ్చే ఒకరకమయిన 'ఆణవధారణ'గా భౌతిక, అధమ ఫలితము నిచ్చును. కనుక మొదటి భావమే సరి.

---

## ధారణ - 53

**76. శ్లో॥ కరఙ్కిణ్యా క్రోధనయా భైరవ్యా లేలిహానయా।**

**ఖేచర్యా దృష్టికాలే చ పరావాప్తిః ప్రకాశతే॥**

**ప్రతిపదార్థము:-** కరంకిణ్యా = కరంకిణీముద్రతో, క్రోధనయా = క్రోధనాముద్రతో, భైరవ్యా = భైరవీముద్రతో, లేలిహానయా = లేలిహానాముద్రతో, ఖేచర్యా చ = ఖేచరీ ముద్రతో, దృష్టికాలే చ = ధారణ చేయుకాలమునందు గూడా, పర = పరముయొక్క లేదా పరాశక్తియొక్క, అవాప్తిః = ప్రాప్తి, ప్రకాశతే = ప్రకాశించును.

**భావము:–** కరంకిణీ ముద్రతోను, క్రోధనా ముద్రతోను, భైరవీ ముద్రతోను, లేలిహానా ముద్రతోను, ఖేచరీ ముద్రతోను ధారణ చేయు సమయమున పరాశక్తి లభించును.

**విశేషములు:–** 1. కరంకిణి – కరంకం అనగా కపాలము అస్థిపంజరము శవము. ప్రపంచాన్ని అలా భావించి చూడటమే కరంకిణి. మన శరీరమును పరమాకాశము నందు విశ్రమింపజేయునది. ఇది జ్ఞానసిద్ధులయందు ముద్ర లేదా దేహం వలన ప్రతీయమానమయ్యేది కరంకిణి.

2. క్రోధన – క్రోధరూపమయినది. 24 తత్త్వాలను మంత్రశరీరమునందు లయం చేయునది. మంత్రసిద్ధుల ముద్ర లేదా మూలాధారమునందు పుట్టే ముద్ర.

3. భైరవి – దృష్టిశక్తి – తనయందే అంతా లయం చేయునది. ఇది మేలయోగుల ముద్ర లేదా సర్వప్రపంచపదార్థములను సంహరించేది.

4. లేలిహాన – అనగా నాకేది. అనగా భోజన శీలమయినది .పూర్ణరూపంలో ఉండి సమస్తాన్ని ఆస్వాదించునది. శాక్తుల ముద్ర లేదా వాసనారూపమయిన పుర్యష్టకమును మాటిమాటికి నాశనము చేయునది.

5. ఖేచరీ – ఆకాశమునందు సంచరించునది. శక్తివ్యాపిని మొదలగు సూక్ష్మాకాశము లందు చరించునది. ఇది శాంభవ సిద్ధుల ముద్ర లేదా ఆవరణమయిన అజ్ఞానము నశించుటవలన జ్ఞానాకాశమున నిజరూపంతో ఉండేది.

6. పరా – వ్యోమేశ్వరీ, వామేశ్వరీ మొ॥ పేర్లుగల నిష్కలాదేవియొక్క దర్శనము లభించును.

పరమాకాశమొక సముద్రమయితే అందులో అందులో నిస్తరంగస్థితిలో ఉండే శక్తి అకులశక్తి. నిష్కల, పర, ఇది సూక్ష్మంగా స్పందించే స్థితిలో ఈమెనే 'వ్యోమేశ్వరి' అంటారు. ఇది ఆశ్యానదశ. తరువాత దీనినుంచి వచ్చే ప్రథమస్పందము 'వామేశ్వరి' అంటారు. ఈమెయందు (వామ = అందమయిన వంకర అనగా తరంగము?) ఇది తరువాత రాబోవు బృంద చక్రమునకు బీజప్రాయమయినది. ఈ స్థితులన్నీ మొదటి పరలో మయూరాండరస న్యాయంతో అవ్యక్తంగా ఉంటాయి. వీటి వ్యక్తస్థితి వామేశ్వరి. ఈమెను నెమలి అనుకొంటే ఈమె ఫించాల వంటివి కరంకిణీ, క్రోధనా ముద్రలు / స్థితులు. వీటిని ఖేచరినుంచి మొదలుపెడితే శాంభవ శాక్తమేల, మంత్ర, జ్ఞానచక్రములంటారు. వీటి అధిష్ఠాన శక్తులు వరుసగా వామేశి, ఖేచరి, భూచరి, సంహారిణి, రౌద్రి అనబడునవి. ఈ '5' శక్తులే 64 యోగినులుగా



(అక్షరాలు మొ॥) ఏర్పడును. 'చతుష్షష్ఠికోటియోగినీగణసేవితా' అన్నది ల స నా. వీటి కతీతమయిన 65వ స్వరూపం "మంగళా" దేవి. ఈమె పరావస్థలో మోక్షదాయిని.

వీటికి వర్ణాలు చెప్పాలంటే

1. 16 అచ్చులు జ్ఞానసిద్ధులు = కరింకిణి.
2. కనుంచి మ 25 స్పర్శలు = మంత్రసిద్ధలు = క్రోధన
3. ప్రణవ కలలు 12 = మేలసిద్ధలు = భైరవి
4. య నుంచి మ వఱకు = 8 = శాక్తసిద్ధలు = లేలిహాన
5. ఆది వర్ణమయిన అకారమునకున్న 4 కళలు అంబిక, వామ, జ్యేష్ఠ, రౌద్ర – ఇవి శాంభవసిద్ధలు – ఖేచరి.

అకారముయొక్క – తల – రౌద్రి

నోరు / మొగము – వామ

బాహువులు – అంబిక

ఆయుధం – జ్యేష్ఠ.

ఈ ఆది వర్ణమయిన 'అకారము' శివుడే. పైన చతుష్షష్టియోగినులందు వ్యాపించి ఉండును. బృందచక్రమంటే అక్షరబృందమే. ఇదంత 'క్రమదర్శనం' అనే విభాగానికి సంబంధించినది.

ఇట్టి బృందచక్రసంభావనవలన సాధకుడు 'పరావస్థకు' చేరును.

---

## ధారణ – 54

**77. శ్లో॥ మృద్వాసనే స్ఫిజైకేన హస్తపాదౌ నిరాశ్రయమ్।**

**నిధాయ తత్ప్రసజ్గేన పరా పూర్ణా మతిర్భవేత్॥**

**ప్రతిపదార్థము:–** ఏకేన = ఒకే, స్ఫిజా = పిర్రపైన, మృద్వాసనే = మెత్తని ఆసనము మీద ఆసీనుడై, హస్తపాదౌ = కాలు సేతులను, నిరాశ్రయమ్ = నిరాధారముగా, నిధాయ = ఉంచి, తత్ప్రసంగేన = ఆ స్థితియొక్క ధారణతో నున్నచో, పరా = పరభైరవీదశ, పూర్ణా = పూర్ణమయిన, మతిః = బుద్ధి, భవేత్ = అగును.

**భావము:–** కొన్ని ఆసనముల వలన మనస్సులో ప్రశాంతస్థితి వస్తుంది. ఇదొక ఆసనంవలె కనబడుతున్నది. ఒక పిర్ర ఆధారంగా ఆసనంమీద ఉండాలి.'ధ్యానవీరాసన' ఇచట భావింపదగును. దీనియందు అనగా ఈ ఆసనంవలన వచ్చే ప్రశాంతతయందు లేదా ఈ ఆసనంవలన "జగదాధారం పరమాత్మయే" అనే ఆత్మభావన రావచ్చును. దానియందుగాని ధారణ చేసినచో తప్పక "పరిపూర్ణత" సిద్ధించును.

---

## ధారణ – 55

**78. శ్లో॥ ఉపవిశ్యాసనే సమ్యగ్బాహూ కృత్వార్ధకుఞ్చితౌ।**
**కక్షవ్యోమ్ని మనః కుర్వన్ శమమాయాతి తల్లయాత్॥**

**ప్రతిపదార్థము:–** ఆసనే = ఆసనమునందు, సమ్యక్ = చక్కగా, ఉపవిశ్య = కూర్చొని, బాహూ = చేతులను, అర్ధకుంచితౌ = సగము ముడిచినవిగా, కృత్వా = చేసి, కక్ష వ్యోమ్ని = చంకలమధ్యకు వచ్చిన అనగా కౌగిలిలోని ఆకాశములో, మనః = మనస్సు, కుర్వన్ = లయించుచు, శమమ్ = శాంతిని, ఆయాతి = పొందును, తల్లయాత్

**భావము:–** ఆసనంమీద కూర్చొని తన చేతులను సగం మడిచి మధ్యలో ఉన్న ఆకాశమును ధ్యానించవలయును. అనగా పరమాత్మ ఈ ఆకాశంవలె అనంతస్వరూపుడు. అయినా దేహం వలన దేహగతంగా కనబడుతున్నాడు. అట్టి పరమభైరవస్వరూపుడు నేనే అనే భావన రాగలదు. అందువలన ఆ ఆకాశం మీద మనస్సును ధారణ చేస్తే మనస్సునకు ఇతర వృత్తులు నశించి వృత్తిరహితస్థితి వస్తుంది. అందులో పరమాకాశరూపభైరవసాక్షాత్కారము లభించును.

**విశేషములు:–** మనస్సుకు రూపం సంకల్పమే గనుక సంకల్పరహితస్థితివస్తే మనస్సులేనట్లు. మనస్సు లయిస్తే ఉండేది మూలతత్త్వమే. అదే భైరవస్థితి.

---

## ధారణ – 56

**79. శ్లో॥ స్థూలరూపస్య భావస్య స్తబ్ధాం దృష్టిం నిపాత్య చ।**
**అచిరేణ నిరాధారం మనః కృత్వా శివం వ్రజేత్॥**





**ప్రతిపదార్థము:–** స్థూలరూపస్య = లావయిన రూపముగల, భావస్య = వస్తువుపైన, స్తబ్ధామ్ = నిశ్చలమయిన, దృష్టిమ్ = దృష్టిని, నిపాత్య చ = ప్రసరింపజేసి, మనః = మనస్సును, అచిరేణ = త్వరగా, నిరాధారమ్ = నిర్వికల్పముగా, కృత్వా = చేసి, శివమ్ = శివుని, వ్రజేత్ = చేరును.

**భావము:–** స్థూలమయిన ఒక వస్తువుమీద దృష్టిని నిశ్చలంగా కేంద్రీకరించినచో క్రమంగా మనస్సు నిర్వికల్పమవుతుంది. అట్టి నిర్వికల్పస్థితిలో శివసాక్షాత్కారము పొందును.

**విశేషములు:–** 1. ఒకచోట మనస్సును కేంద్రీకరించటమే ధారణ. అది ఏదయినా సరే. భగవంతునిమీదనయితే మరీ మంచిది. యోగోపాయపదార్థములమీదనయినా మంచిదే.

2. కేంద్రీకరణం వలన ఏం జరుగుతుంది?

మనస్సు అంటే రకరకాల ఆలోచనల సముద్రం. దానిని నిశ్చలం చేయటం అసాధ్యం' అందుకని రకరకాల ఆలోచనలనుంచి ముందు ఒక ఆలోచన మీదకు తేవటం కాస్త తేలిక. అందువలన ఒక బిందువు మీద కేంద్రీకరించాలి. అదే ధారణ. దానిద్వారా సాధన చేయగా చేయగా ఆ ఒక్క ఆలోచన గూడా నశించుతుంది. అపుడు మనస్సే లేనట్లవుతుంది. అదే మనోనాశం. అమనస్కత. అపుడు మిగిలేది తత్త్వస్థితి.

---

## ధారణ – 57

**80. శ్లో॥ మధ్యజిహ్వే స్ఫారితాస్యే మధ్యే నిక్షిప్య చేతనామ్।**
**హోచ్చారం మనసా కుర్వంస్తతశ్శాన్తే ప్రలీయతే॥**

**ప్రతిపదార్థము:–** మధ్య = లోపల, జిహ్వే = నాలుకగల, స్ఫారిత = బాగా తెఱవబడిన, ఆస్యే = నోటియందు, చేతనామ్ = బుద్ధిని / మనస్సును, నిక్షిప్య = ఉంచి, మనసా = మనస్సుతో, హః = 'హ' కారంయొక్క, ఉచ్చారమ్ = ఉచ్చారణను, కుర్వన్ = చేయుచు, తతః = తర్వాత, శాంతే = శాంతమయిన, భైరవస్థితియందు, ప్రలీయతే = కఱగిపోవును.

**భావము:–** నోరు బాగా తెఱవాలి. నాలుక మధ్యలోనే ఉండాలి. ఆ నోటియందు

మనస్సును నిలపాలి. నిలిపి మనస్సుతో హకారమునుచ్చరించినచో క్రమంగా శాంతభైరవదశ వచ్చును. శాంతమంటే సర్వవికల్పములు శమించిన స్థితి.

**విశేషములు:–** 1. ఇందులో **బహుశా** నోరు గుహ. లోపలి నాలుక త్రికోణము. కొండనాలుక శివలింగము. దానికి 'హ' అను శివశక్తి బీజంతో అర్చన. ఇట్టి స్థితిలో ధారణవలన భైరవస్థితి లభించును.

2. స్ఫారం అంటే బుడగ. స్ఫారితాస్యం అంటే బుడగగలనోరు మధ్యలోనే జిహ్వ ఉంచడంవలన ఉబ్బెత్తుగా ఉన్ననోరు అని అర్థం చెప్పవచ్చును. ఆ ఎత్తు శివలింగం అనుకోవచ్చును. కాని మొదటి అర్థము, మొదటి భావన. ఇంతకన్నా ఉత్తమ మయినవి.

---

## ధారణ – 58

**81. శ్లో॥ ఆసనే శయనే స్థిత్వా నిరాధారం విభావయన్।**
**స్వదేహం మనసి క్షీణే క్షణాత్ క్షీణాశయో భవేత్॥**

**ప్రతిపదార్థము:–** ఆసనే = కుర్చీయందుగాని, శయనే = మంచము / ప్రక్కమీదగాని, స్థిత్వా = ఉండి, స్వదేహమ్ = తన శరీరమును, నిరాధారమ్ = నిరాలంబనమయిన దానినిగా, విభావయన్ = ధారణ చేయుచు, క్షణాత్ = క్షణంలోనే, మనసి = మనస్సు, క్షీణే = లయించగ, క్షీణాశయః = వికల్పరహితుడు, భవేత్ = అగును.

**భావము:–** సాధకుడు కుర్చీ / సీటు, ప్రక్క మంచం – వేటిమీదనయినా సరే ఆసీనుడై లేదా పరుండి తన శరీరము నిరాధారంగా ఉందని భావింపవలెను. అనగా అట్టి సుఖస్థితిలో మనస్సులో ఆనందదశ ఏర్పడుతుంది. ఆ ఆనందదశను ధారణచేస్తే తను, తన శరీరము దాని ఆధారము ఏవీ మనస్సులో ఉండవు. ఆ విధంగా మనస్సు నిర్వికల్పముగా అయి భైరవీస్థితిని పొందును.

**విశేషములు:–** లేదా, స్వదేహం సుఖంగా ఉంటే దాని ఆధారాన్ని ఎలా పట్టించుకోమో అట్లే యీ దేహాన్ని గూడా పట్టించి కొనకుండా అందలి తత్త్వాన్ని లేదా అంతటి సుఖాన్ని ఆస్వాదించడం వలన సుఖతత్త్వమయిన భైరవ స్వరూపానుభూతి లభించును.

---





## ధారణ – 59

**82. శ్లో॥ చలాసనే స్థితస్యాథ శనైర్వా దేహచాలనాత్।**
**ప్రశాన్తే మానసే భావే దేవి! దివ్యౌఘమాప్నుయాత్॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = పార్వతీ!, చలాసనే = చంచలమయిన ఆసనమునందు, అథవా = లేదా, శనైః = మెల్లగా, దేహచాలనాత్ = దేహం కదలించుటవలనగాని, మానసే = మనస్సుకు సంబంధించిన, భావే = సత్త, ప్రశాంతే = అణగగా, దివ్య = దివ్యమయిన ఆనందముయొక్క, ఓఘమ్ = ప్రవాహమును, ఆప్నుయాత్ = పొందును.

**భావము:–** కదలే బండి, ఏనుగు, గుర్రం, ఊయల, ఇటువంటి వాటిమీద కూర్చొని కదలడం వలన, లేదా శరీరాన్ని తానే కదిలించడంవలన వచ్చే సుఖంలో / బాధలోగాని మనస్సు విలీనమయితే ఆ ధారణను కొనసాగిస్తే దివ్యానందప్రవాహం లభించును. లేదా దివ్య యోగుల సమూహములో ఒక్కడుగా అగును.

---

## ధారణ – 60

**83. శ్లో॥ లీనం మూర్ధ్ని వియత్సర్వం భైరవత్వేన భావయేత్।**
**తత్సర్వం భైరవాకారం తేజస్తత్త్వం సమావిశేత్॥**

**ప్రతిపదార్థము:–** మూర్ధ్ని = తన తలపైన, లీనమ్ = కలిసి ఉన్న, సర్వమ్ = సమస్తమయిన, వియత్ = ఆకాశమును, భైరవత్వేన = భైరవునిగా, భావయేత్ = భావింపవలెను, తత్సర్వమ్ = ఆ ధారణమంతయు, భైరవాకారమ్ = భైరవ రూపమయిన, తేజస్తత్త్వమ్ = జ్ఞానతేజోరూపమును, సమావిశేత్ = కలియును.

భా॥ తన తలపైన కలిసిన ఆకాశమంతా భైరవరూపమని భావింపవలెను. ఆ భైరవరూపధారణ / ధ్యానము చివఱకు భైరవరూపమయిన జ్ఞానతేజస్సులోనికి చేర్చును.

**విశేషములు:–** దీని వ్యాఖ్యానంలో మూర్ధ్నే – అంటే హృదయబ్రహ్మ రంధ్రములన్నారు. హృదయం / అనే అర్థం సరికాదు. రాదు. ముఖ్యమయిన – అనే అర్థంలో '2' అర్థాలు వ్రాశారు. ఆకాశము. తిమిరరూపంగా ఆలోచించా లన్నారు. దానికి తగిన ఆధారము లేదు. పదాలనుంచి తీసింది కాదు. స్వయంగా

అతికించినది. శ్లోకంలో సూచనగూడా లేని అనేక విషయాలను తన ఆగమ పరిజ్ఞానాధిక్యం వలన అతికించినట్లుగా ఉన్నది.

---

### ధారణ - 61

**శ్లో॥ ఆకాశం విమలం పశ్యన్ కృత్వా దృష్టిం నిరన్తరామ్।**
**స్తబ్ధాత్మా తత్క్షణాద్దేవి! భైరవం వపురాప్నుయాత్॥**

**ప్రతిపదార్థము:-** దేవి! = పార్వతీ!, దృష్టిమ్ = తన చూపును, నిరంతరామ్ = ఎడతెగనిదానినిగా, కృత్వా = చేసి, విమలమ్ = నిర్మలమయిన, ఆకాశమ్ = ఆకాశమును, పశ్యన్ = గమనించుచు, స్తబ్ధ = స్తంభించిన, ఆత్మా = మనస్సుగల సాధకుడు, తత్క్షణాత్ = ఆ క్షణమునుండి, భైరవమ్ = భైరవరూపమయిన, వపుః = శరీరమును, ఆప్నుయాత్ = పొందును.

**భావము:-** దృష్టిని కేంద్రీకరించి నిరంతరం నిర్మలాకాశాన్ని దర్శిస్తూ, మనస్సును నిలిపినవాడు ఆ క్షణం నుండే భైరవస్వరూపుడవుతాడు.

**విశేషములు:-** సర్వగతచైతన్యమునకు గుర్తుగా ఆకాశం చెప్తారు. అష్టమూర్తి అయిన భైరవుని అష్టరూపాలలో అది ప్రధానం. ఆకాశం, భౌతిక దృష్టికి శూన్యం. జ్ఞానదృష్టికి పూర్ణం. నిర్వికారం, అఖండం, సర్వవ్యాప్తం. దానియందు మనస్సునిలిస్తే ఆ నిలిచిన క్షణంలో సాధకునికి తన శరీరబుద్ధి ఉండదు. ఆ స్థితిలో నిలచినది "అహం" రూపచైతన్యమే. అదే భైరవస్వరూపము. కనుక స్వస్వరూపజ్ఞానంవలన భైరవునితో సాయుజ్యం, జీవన్ముక్తి వస్తాయి.

నోట్:- ఇది శివోపాధ్యాయపాఠంలోనిది. తంత్రం కంఠోక్తిగా 112 ధారణలు (136 శ్లో) చెప్పినట్లు ప్రకటించింది. అయితే సంఖ్య ముఖ్యంగాదు కనుక, ఈ ధారణలోను తత్త్వరూపమయిన "భైరవ" రూపచైతన్యమును గుర్తించే అవకాశం కలదు గనుక దీనిని ధారణగా భావించవచ్చును. కాని 135 శ్లోకంలో చెప్పినది యీధారణా తత్త్వరహస్యమే గనుక అది ధారణకాదు. అందుచేత 134 శ్లోకంతో ధారణలు సరి.

---



### ధారణ - 62

**84. శ్లో॥ కించిత్జ్ఞాతం ద్వైతదాయి బాహ్యాలోకస్తమః పునః।**
**విశ్వాది భైరవం రూపం జ్ఞాత్వానన్తప్రకాశభృత్॥**

**ప్రతిపదార్థము:-** కించిత్ = కొంచెము, జ్ఞాతమ్ = తెలిసికొనబడినది. ద్వైత = ద్వైతభావమును, దాయి = ఇచ్చునది. బాహ్య = బయటకు సంబంధించిన, ఆలోకః = దర్శనము, పునః = అయితే, తమః = చీకటి / నలుపు, విశ్వాది = విశ్వమునకు ఆదిలోనిదైన, భైరవమ్ = భైరవరూపముగా, జ్ఞాత్వా = ఎఱిగి, అనంత = అంతులేని, ప్రకాశ = వెలుగును, భృత్ = ధరించువాడగును.

భా॥ ఆకాశము కొంచెమే మనకు తెలియును. అనగా విస్తీర్ణము అంతా తెలియదు. అట్లే శూన్యంగా తెలియటం కనుక కొంచెం తెలిసినట్లు. సృష్టిలో కనబడే వాటిలో అదే మొదటిది కనుక అదే విశ్వాది. అదే ద్వైత ప్రారంభకము. దానియొక్క దర్శనము చీకటి వంటిది అనగా నీలాకాశము. ఇట్టి ఆకాశమును భైరవరూపముగా (నల్లని) ధ్యానించినవాడు అనంతమయిన జ్ఞానప్రకాశమును పొందును.

**విశేషములు:-।** 1. వ్యాఖ్యానంలో దీనిని చాలా చిత్రంగా వ్యాఖ్యానించారు. విశ్వాది అను పదం వలన విశ్వుడు మొ॥ జీవులను అర్థం చెప్పారు. అందుకు తగినట్లుగా పై పదానికి అర్థం అతికించారు. కాని బాహ్యాలోకము అంటే 'స్వప్నం' అని అర్థం చెప్పారు. బాహ్యవిషయాలు స్వప్నంలో ఆలోకింపబడతాయి. అని వ్యుత్పత్తి చెప్పారు. ఇదంతా కృతకం. ముందు వెనుకల శ్లోకాలు ఆకాశమును గూర్చి చెప్తున్నాయి. మధ్యలో విశ్వాది జీవుల వ్యవహారం సందర్భశుద్ధిరహితం.

2. ఇక వ్యాఖ్యానంలో దీనికి మఱో అర్థం చెప్పారు. ముందు భేదమయంగా భావించి తర్వాత చంద్రసూర్యులుగా భావించి తర్వాత చీకటిని భావించాలట. ఇదంతా భైరవరూపముగా ధ్యానించి ధారణ చేయాలని తేల్చారు. కాని యిది సమన్వయశుద్ధి సందర్భశుద్ధిలేని అర్థము. పదాలకు గూడా ఆ విధంగా అర్థం రావడం లేదు. అందువలన నా అర్థం భిన్నంగా వ్రాశాను.

3. ఈ శ్లోకంలోకి పై శ్లోకమునుండి 'వియతే' అనువృత్తి చేస్తే సమన్వయం బాగున్నది నేను అదే పని చేశాను.

4. పైగా పై శ్లోకంలో ఏవమేవ - అంటున్నాడు. ఆ శ్లోకంలో చెప్పిన వాటిలో

విశ్వాది భావనకు సంబంధించిన విషయం లేదు. కృష్ణపక్షరాత్రి రూపాన్ని చెప్తున్నాడు. అది ఆకాశానికి అన్వయిస్తుంది.

---

## ధారణ - 63

**85. శ్లో॥ ఏవమేవ దుర్నిశాయాం కృష్ణపక్షాగమే చిరమ్।**
**తైమిరం భావయన్రూపం భైరవం రూపమేష్యతి॥**

**ప్రతిపదార్థము:-** ఏవమేవ = ఇలాగే, దుర్నిశాయామ్ = మబ్బులు పట్టిన రాత్రియందు లేదా కృష్ణపక్షాగమే = కృష్ణపక్షమునందలి రాత్రియందుగాని, చిరమ్ = చాలాసేపు, తైమిరమ్ = చీకటి క్రమ్మిన, రూపమ్ = ఆకాశంయొక్క రూపమును, తిమిరరూపమును, భావయన్ = భావించుచు, భైరవమ్ = భైరవసంబంధమయిన, రూపమ్ = రూపమును, ఏష్యతి = పొందగలడు.

**భావము:-** కృష్ణపక్షంలోగాని, మబ్బులుపట్టిన రాత్రియందుగాని, లేదా కృష్ణపక్షమున మబ్బులు క్రమ్మిన రాత్రియందు, చీకటి రూపమునుగాని, చీకటి క్రమ్మిన ఆకాశరూపమును గాని ధారణ చేయుచు దానిని భైరవరూపముగా భావించినచో, 'భైరవీసిద్ధి' జరుగును.

**విశేషములు:-** 1. ఇంతకుముందు చాలావఱకు సుఖరూపంగా భైరవీస్థితిని వివరించాడు. ఒకటి రెండుచోట్ల దుఃఖరూపం వచ్చింది. ఇందులో భైరవుని ప్రళయకాల భయంకరరూపమును అప్పటి శూన్యస్థితిని కృష్ణపక్షపు చీకటిరాత్రిద్వారా సూచన చేస్తున్నాడు.

2. ఈ రూపము అత్యాశ్చర్యకరము కనుక ఆనందకారియని వ్యాఖ్యాత వివరణ. కాని యీ రూపము ఆశ్యర్యకరం అనటం కన్నా భయంకరం అన్నది నిజము. కొందరు భక్తుల స్వభావాన్ని బట్టి సౌమ్యభైరవుడు నచ్చడు. వారికి తామస భైరవుడు కావాలి. వారికి ఈ ధారణ కావచ్చును. ఆ తరువాత ఆనందము రావచ్చును.

3. సృష్టి ఆశ్చర్యకరము. వట్టి చీకటి, ఆశ్చర్యకరం కాదు. కనుక ఆశ్చర్యం వలన ఆనందం అనటం హేతుబద్ధం కాదు.

4. ఈ చీకటిమీద చేసే భావనలన్నీ శూన్యంమీద చేసినట్లే. అనగా ప్రపంచ ఆదిమస్థితిపై భావన, ఈ శూన్యసాక్షిగా ఆత్మ లేదా తాను ఉన్నట్లు భావన చేయడం





ద్వారా భైరవసిద్ధి కావచ్చు. తరువాత చేసే మరికొన్ని శూన్యభావనలకు గూడా శూన్యసాక్షి అయిన తన (ఆత్మ)ద్వారా పరమాత్మను పొందటం పర్యవసానం కావచ్చును. దీనికి ఋజువుగా చూ. 87 శ్లో.

---

## ధారణ - 64

**86. శ్లో॥ ఏవమేవ నిమీల్యాదౌ నేత్రే కృష్ణాభమగ్రతః।**
**ప్రసార్య భైరవం రూపం భావయంస్తన్మయో భవేత్॥**

**ప్రతిపదార్థము:-** ఏవమేవ = అట్లే, ఆదౌ = ముందుగా, నేత్రే = కన్నులను, నిమీల్య = మూసికొని, అగ్రతః = ఎదురుగా, కృష్ణాభమ్ = నల్లని కాంతిగల, భైరవమ్ = భైరవసంబంధమయిన, రూపమ్ = రూపమును, ప్రసార్య = పఱచి, భావయన్ = ధారణ చేయుచు, తన్మయః = తన్మయుడుగా / భైరవరూపమయుడుగా, భవేత్ = కావలయును.

**భావము:-** అదే విధంగా కళ్లు మూసుకొని ఎదురుగా ఏర్పడిన భయంకరమయిన నల్లని చీకటిని భైరవరూపంగా భావించి భైరవీదశను పొందవచ్చును.

**విశేషములు:-** ఇంతకుముందు పద్యంలో కళ్లు తెరచికొనియుండి చీకటిరాత్రిలోని కృష్ణ భైరవస్వరూపం మీద ధారణ చేయడం చెప్పాడు. ఇందులో కళ్లు మూసికొని సృష్టించిన కృత్రిమచీకటిని కృష్ణభైరవంగా ధారణ చేయడం చెప్పాడు.

2. చీకటి అంటే చీకటితోబాటు దాంతో నిండిన ఆకాశమూ తప్పనిసరి. కనుక ఈ శ్లోకంలోనూ ఆకాశధారణ అని తాత్పర్యము.

3. 'ప్రసార్య'.. అంటే తెఱచి అని వ్యాఖ్యాత భావం. కన్నులు - ఆదౌ - ముందు - మూసికొని తరువాత తెఱచి - అని భావం. కాని తెఱిస్తే కృష్ణభైరవరూపం పోతుంది. కనుక దానిమీద ధారణ కుదరదు. 'ఆదౌ' అన్న పదం వలన ఈ అర్థం చెప్పాడు ఒక వ్యాఖ్యాత. కాని ముందు కళ్లుమూసి, తర్వాత ఆ కృష్ణభైరవరూపాన్ని అగ్రతః = తన ఎదుట, ప్రసార్య = విస్తరించి భావించి - అని అర్థం చెప్పటం న్యాయం. కళ్లుతెరచినచో ఊహాత్మకతిమిరాన్ని భావింపవలసి ఉండును.

---

## ధారణ - 65

**87. శ్లో॥ యస్య కస్యేంద్రియస్యాపి వ్యాఘూతాచ్చ నిషేధతః।**
**ప్రవిష్టస్యాద్వయే శూన్యే తత్రైవాత్మా ప్రకాశతే॥**

**ప్రతిపదార్థము:–** యస్య కస్యాపి = ఏదో ఒక, ఇంద్రియస్య = ఇంద్రియముయొక్క వ్యాఘూతాచ్చ = చెడిపోవుటవలన, నిషేధతః = నివారించడం (కన్నుమూయటం మొ॥ పద్ధతులద్వారా) వలనగాని, అద్వయే = అద్వితీయమయిన, శూన్యే = శూన్యమునందు, ప్రవిష్టస్య = ప్రవేశించిన సాధకునకు, ఆత్మా = ఆత్మ, తత్రైవ = అచ్చటనే, ప్రకాశతే = ప్రకాశించును.

**భావము:–** ఏదయినా ఒక ఇంద్రియం మనలో పనిచేయటం మానివేస్తే, అసలు లేకపోతే, లేదా మనం ప్రయత్నపూర్వకంగా ఆపితే అప్పుడు గాని ఏర్పడే ఒక 'శూన్యం' ఉంటుంది. దానియందు ధారణ చేసినా అచ్చట తన 'ఆత్మ' ప్రకాశిస్తుంది. అనగా ఆ శూన్యంలో వ్యాపించిన 'ఆత్మ' ప్రకాశించును. అదే భైరవస్థితి.

**విశేషములు:–** ఆనందంలోనయినా, దుఃఖంలోనయినా, శూన్యంలోనయినా ధారణ చేయగా అచ్చట సాక్షిగా 'ఆత్మ' ప్రత్యక్షం కావటమే ఈ ధారణల రహస్యం. ఆత్మనే ఆగమతంత్రాల్లో 'భైరవరూపం'గా చెప్తారు. వేదాంతంలో 'బ్రహ్మం' విశిష్టాద్వైతం 'నారాయణుడు' అలా ఒక వస్తువు మీద రుద్దగా రుద్దగా అచ్చట శక్తి / అగ్నిపుట్టి నట్లు ఏదయినా చదవగా చదవగా 'జ్ఞానం' మెరిసినట్లే ఆలోచించగా ఆలోచించగా ఉపాయం తళుక్కుమన్నట్లే ఈ విధానం ఉన్నది.

2. అందరిలో ఉండే చైతన్యమే చేతన / చిత్రింగా మారుతుంది. వికల్పదశలో దీని పని ఉంటుంది. వికల్పరహితం చేయగల్గినపుడు మనో (చేతన) నాశం జరుగుతుంది. అనగా 'చైతన్యం. మిగులుతుంది. చైతన్యం చితిగా రావటం అంటే అందలి చూయాశక్తి చేసిన సంకోచము. ప్రత్యభిజ్ఞాహృదయంలో ఇదే విషయం ఉంది.

"చితిరేవ చేతన పదావరూఢా చేత్యసంకోచినీ చిత్తమ్" –5

"తత్పరిజ్ఞానే చిత్తమేవాంతర్ముఖీభావేన చేతనపదాధ్యారోహాత్ చితిః"

– 13 అని చెప్పింది.

కనుక ధారణవలన చిత్తం చితిగా మారితే 'చితి'తో అభిన్నుడయినవాడు కనుక 'పరమేశ్వరదశ' సిద్ధిస్తుంది.



## ధారణ - 66

**88. శ్లో॥ అబిన్దుమవిసర్గం చ అకారం జపతో మహాన్।**
**ఉదేతి దేవి! సహసా జ్ఞానౌఘః పరమేశ్వరః॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = పార్వతీ!, అబిందుమ్ = బిందువు లేనిదియు, అవిసర్గంచ = విసర్గలు లేని, అకారమ్ = అకారమును, జపతః = జపించుచున్న సాధకునకు, జ్ఞానౌఘః = జ్ఞాన సమూహరూపుడయిన, పరమేశ్వరః = పరమేశ్వరుడు, సహసా = హఠాత్తుగా, ఉదేతి = ఉదయించును.

**భావము:–** బిందు విసర్గలు లేని భైరవస్వరూపమయిన అనుత్తరాకారమును జపించు సాధకునకు హఠాత్తుగా జ్ఞానప్రవాహరూపమయిన పరమేశ్వరుడు అనుభవంలోనికి వచ్చును.

**విశేషములు:–** 1. బిందువు అంటే చుక్క. చుక్కను అద్వైతానికి అభేదానికి గుర్తుగా వాడతారు. పూర్ణతకు శూన్యతకు గుర్తుగా వాడతారు. 'విసర్గ' అంటే 2 సున్నలు. 'ః' వీటిని ద్వైతానికి, భేదానికి సృష్టికి గుర్తుగా వాడుతారు. ఈశ్వరుడు సృష్టికి ఉన్ముఖుడయితే 'బిందు విసర్గ' వ్యవహారం అనగా 'ఏక – అనేక' అనే ఆలోచనలు వస్తాయి. లేనపుడు 'అ'గానే ఉంటాడు. 'అం – అః' రావు. కనుక అట్టి భగవంతునికి ప్రతీకగా 'అకారమును' జపిస్తే జ్ఞానప్రవాహరూపసాక్షాత్కారం తథ్యం.

2. ఒక వ్యాఖ్యానంలో 'అకారం'వద్ద కారకుడు అనగా జనకుడు లేని భగవంతుని – జపిస్తే – అని వ్రాశారు. కాని యీ భావన నవీనం కాదు. పైగా అలా ప్రత్యక్షంగా చెప్పకుండా 'అబిందువు అవిసర్గం' అని వర్ణభాషలో చెప్పవలసిన పనిలేదు. పైగా 'భగవంతుని భావనచేస్తే భగవంతుడు కనబడ్తాడు. 'అనటం' క్రొత్త భావనకాదు. ఇంతవఱకు ఈయన నవీన విలక్షణ భావనలే వ్రాశాడు. కనుక ఇచ్చట 'అ' అనే వర్ణాన్ని ప్రతీకగా భావిస్తేనే యీ భావనకు సార్థకత.

3. అనుత్తర – నిరుత్తర – అంటే దేనికన్నా అవతల మఱొకటి / శ్రేష్ఠమయినది లేదో అది అనుత్తరం / నిరుత్తరము. నఞ్పంచమీతత్పురుష సమాసము.

అం – పూరకం. సున్న తరువాత నోరు మూస్తాం కనుక గాలి పీల్చినట్లు లెక్క. అః – రేచకం అనగా నోరు తెఱచి గాలి వదులుతాం కనుక. కాగా బిందువు అనగా పూరకము. విసర్గ అనగా రేచకము. ఈ 2 లేని స్థితి 'కుంభకం' అవుతుంది.

ఇందులో అకారం జపం చేయడం మంచిదని ఒక అర్థం. కాని అతి సామాన్యుల కందుబాటులో నున్న భావనలను / ధారణలను చెప్తున్నాడు. పైన చెప్పిన కుంభక ధారణ నిజమయితే ఆ విషయం ప్రత్యక్షపదాలలో చెప్పేవాడు. కనుక "అ" అక్షరోచ్చారణ మాత్రమే ఆగమకర్త భావం.

4. మఱొక అర్థము.

పూర్ణాహంత – పూర్ణాహంకారము విశ్వాహంత అదే బిందువు చైతన్యము. దాని అంశగా 'బుద్ధి' ఉన్నవి. ఈ అహంత శివాభిన్నం. ఇదే జ్ఞానశక్తి. ఇది అపరిమిత / అఖండ అహంత. ఇది "అ" కార రూపము. దీనికి బిందువు కలిస్తే "అం", నాదం – కలిస్తే "అః". ఇట్టి అకారమును "శివశక్తి" మయమందురు. ఇవి శబ్దబ్రహ్మలు. "ః" – హకారము. అవిగూడా అచ్చులేని 'హకారము'. అనచ్కము. ఇది కుండలినీ రూపము. ఇదే భ్రూ మధ్యంలో 'బిందు' రూపంగా ఉంటుంది. మూలాధారంలో నాదరూపం (హ్) గా ఉంటుంది కాగా నాదబింద్వతీతమయిన 'అకారమును' ధ్యానించినచో శుద్ధస్వరూపసాక్షాత్కారము జరుగును.

---

## ధారణ – 67

**89. శ్లో॥ వర్ణస్య సవిసర్గస్య విసర్గాన్తం చితిం కురు।**
**నిరాధారేణ చిత్తేన స్పృశేత్ బ్రహ్మ సనాతనమ్॥**

**ప్రతిపదార్థము:–** సవిసర్గస్య = విసర్గలతో (ః) కూడిన, వర్ణస్య = అక్షరముయొక్క (అ/క మొ॥) విసర్గాంతమ్= విసర్గయొక్క చివరభాగమును, చితిమ్ = మనస్సునుగా, కురు = చేయుము అనగా ధారణ చేయుము. నిరాధారేణ = ఆధారరహితమయిన, చిత్తేన = మనస్సుతో, సనాతనమ్ = శాశ్వతమయిన, బ్రహ్మ = భైరవరూపమును, స్పృశేత్ = తాకవలయును.

**భావము:–** అః, కః మొదలగు విసర్గతో కూడిన అక్షరాలలో అక్షరాలను విసర్గలను వదలి విసర్గల చివర మనస్సును ధారణ చేయవలయును. అట్టి శూన్యంమీద ధారణ చేసినందువలన మనస్సు 'నిరాధారమవుతుంది'. నిరాధారమయిన మనస్సు / చిత్తం / చేతన "చితి"గా / చైతన్యంగా అవుతుంది. చూ. శ్లో. 87 విశేషం (2). అదే బ్రహ్మం. నిరాలంబమయిన చిత్తం 'చైతన్యం' అవుతుంది. ప్రపంచరూపమయిన





ఆలంబనం ఉంటే చైతన్యం అందు ప్రతిబింబితమయి సవికల్పమై మనస్సుగా అవుతుంది.

**విశేషములు:–** ఒక వ్యాఖ్యానంలో ధారణను 'నిరాధార' చిత్తంతో చేయమన్నట్లు ఉన్నది. కాని అది తప్పు. శ్లోకాలన్నింటిలో ఉన్న వరసకు భంగం. పైగా నిరాధారమయిన స్థితిలో మనస్సుండదు. ఉన్ననూ అది విసర్గ భావన చేస్తే 'సాధార' అవుతుంది. దానికి భైరవీస్థితి రావాలంటే మళ్లీ 'నిరాధారంగా' అని చెప్పాలి. కాని 'పదం' మళ్లీరాదు. అంత అవసరం లేదు. కనుక విసర్గాంతధారణవలన చిత్తం నిరాధారమవుతుందని చెప్పటమే సరి అయిన అర్థము.

---

## ధారణ – 68

**90. శ్లో॥ వ్యోమాకారం స్వమాత్మానం ధ్యాయేత్ దిగ్భిరనావృతమ్।**
**నిరాశ్రయా చితిః శక్తిః స్వరూపం దర్శయేత్ తదా॥**

**ప్రతిపదార్థము:–** స్వమ్ = తన, ఆత్మానమ్ = ఆత్మను, దిగ్భిః = దిక్కులచేత, అనావృతమ్ = ఆవరింపబడని, వ్యోమాకారమ్ = ఆకాశరూపునిగా, ధ్యాయేత్ = ధ్యానింపవలయును. తదా = అపుడు, నిరాశ్రయా = అందువలన నిరాధారమయిన, చితిఃశక్తిః = చితిశక్తి, స్వరూపమ్ = తనరూపమును, దర్శయేత్ = చూపించును.

**భావము:–** తనను దిక్కుల అవధిలేని అనంతాకాశమునుగా భావన చేయాలి. ఆకాశం శూన్యము కనుక మనస్సుకు ఆధారరహితస్థితి కలుగుతుంది. అపుడు 'చితిశక్తి' తన బుద్ధిరూపాన్ని వదలి చైతన్యరూపాన్ని పొందుతుంది.

---

## ధారణ – 69

**91. శ్లో॥ కిఞ్చిదఙ్గం విభిద్యాదౌ తీక్ష్ణసూచ్యాదినా తతః।**
**తత్రైవ చేతనాం యుక్త్వా భైరవే నిర్మలా గతిః॥**

**ప్రతిపదార్థము:–** తీక్ష్ణ = పదునయిన, సూచ్యాదినా = సూది మొదలగువాటితో, కించిత్ = ఏదో ఒక, అంగమ్ = అవయవమును, ఆదౌ = మొదటిగా, విభిద్య = కోసి, తతః = తర్వాత, తత్రైవ = ఆ విషయం మీదనే, చేతనామ్ = బుద్ధిని, యుక్త్వా = కలిపి అనగా ధారణ చేసినచో, భైరవే = భైరవునియందు, నిర్మలా =

నిర్మలమయిన, గతిః = ప్రాప్తి కలుగును.

**భావము:–** పదునయిన ఆయుధంతో తన శరీరంలో ఏదో ఒక అవయవమును గాయపరచి ఆ బాధమీద నున్న, 'సహనశక్తిని'లేదా ఆ బాధను గమనించే 'సాక్షి' అయిన ఆత్మను పొందగలడు.

**విశేషములు:–** ఇందులో దెబ్బతగులడం వలన ఆ బాధమీదనే మనస్సు కేంద్రీకృతం అవుతుంది. కనుక ఇందు నిర్వికల్పం అవుతుంది. ఈ ఒక్క వికల్పము క్రమంగా ధారణలో నశిస్తే బుద్ధి భైరవరూపచైతన్యంగా మారుతుందని అర్థము. ఆనందంలోనయినా ఈ స్థితిని అన్వయించాలి. వికల్పరహిత స్థితి.

2. ఇదే కావచ్చు దేవుని ముందర కొరడాలతో కొట్టుకోవడం, శూలాలు గ్రుచ్చుకోవడం చేయడానికి కారణం. అట్టి భావన వలననే వారికి ఆ నొప్పి తెలియదు. ఆనందనృత్యం చేస్తుంటారు.

---

## ధారణ – 70

**92. శ్లో॥ చిత్తాద్యన్తః కృతిర్నాస్తి మమాన్తర్భావ యేదితి।**
**వికల్పానామభావేన వికల్పైరుజ్ఝితో భవేత్॥**

**ప్రతిపదార్థము:–** మమ = నాయొక్క, అంతః = లోపల, చిత్తాది = చిత్తము మొదలగు, అంతఃకృతిః = అంతఃకరణము, నాస్తి = లేదు, ఇతి = అని, భావయేత్ = భావింపవలయును. వికల్పానామ్ = ఈ భావనవలన వికల్పముల యొక్క, అభావేన = లేమిచేత, సాధకుడు, వికల్పైః = వికల్పముచేత, ఉజ్ఝితః = వదలబడినవాడు, భవేత్ = కావచ్చును.

**భావము:–** నాలో మనస్సు, బుద్ధి మొ॥ అంతఃకరణము లేవు. అవి పనిచేయడం గూడా లేదని ఎవరు భావిస్తారో వారిలో ఇతర వికల్పములన్నియు శూన్యం కనుక సాధకుడు గూడా నిర్వికల్పుడగును.

---

## ధారణ – 71

**93. శ్లో॥ మాయా విమోహినీ నామ కలాయాః కలనం స్థితమ్।**
**ఇత్యాది ధర్మం తత్త్వానాం కలయన్నపృథగ్భవేత్॥**





**ప్రతిపదార్థము:–** మాయా నామ = మాయ అంటేనే, విమోహినీ = మోహ కారకురాలు, కలాయాః = కలాతత్త్వమునకు, కలనమ్ = ఏదో ఒకటి చేయడం / తెలిసికొనడం, ధర్మః = ధర్మము, ఇత్యాది = ఈ మొదలయిన, తత్త్వానామ్ = తత్త్వములయొక్క, ధర్మమ్ = సహజ ధర్మమును, కలయన్ = గ్రహించుచు, అపృథక్ = బ్రహ్మాభిన్నుడు, భవేత్ = కావచ్చును.

**భావము:–** మాయాతత్త్వముయొక్క స్వభావమే మనలను మోహంలో పడవేయడం. అవిద్య అటువంటిదే. కలాతత్త్వం ఏదో ఒకటి చేస్తుంటుంది. అది ఈశ్వరుని కర్తృత్వశక్తి గదా! ఇలా తత్త్వాల సహజస్థితిగా మాయాతత్త్వం దగ్గరనుంచి విమర్శించుతూ, చివరకు శుద్ధతత్త్వాన్ని తెలిసికొని దానితో అభిన్నుడవుతాడు.

**విశేషములు:–** ఇందులో "న పృథక్" అని ఒక వ్యాఖ్యాత విడదీశాడు. అంతకన్నా 'అపృథక్' అని విడదీయడం ఉత్తమం. అర్థం మారదు. కాని సమన్వయం బాగుంటుంది. 15 కళల కామోపాసన చేసేవానికి క్రమంగా 16వ కళ అయిన శక్తిని గూర్చి జిజ్ఞాస ఏర్పడుతుందని వాత్స్యాయన కామసూత్రాల ఉద్దేశమని సంప్రదాయం. అంటే అన్ని తత్త్వాలను పరామర్శించినవానికి చివఱకు తన 'శుద్ధ తత్త్వమును' చేరుకొనే స్థితి వస్తుంది. ఇదే న్యాయశాస్త్రంలో పదార్థతత్త్వపరామర్శకు ఫలం. చివఱకు సర్వసృష్టికర్త పరామర్శ లభించటమే. అట్లే యజ్ఞయాగాది నిష్కర్మాచరణ యజ్ఞపురుషసాక్షాత్కారానికి ఉపయోగిస్తుంది. అలా.

---

## ధారణ – 72

**94. శ్లో॥ ఝగితీచ్ఛాం సముత్పన్నాం అవలోక్య శమం నయేత్।**
**యత ఏవ సముద్భూతా తతస్తత్రైవ లీయతే॥**

**ప్రతిపదార్థము:–** ఝగితి = టక్కున, సముత్పన్నామ్ = తనలో పుట్టిన, ఇచ్ఛామ్ = కోరికను, ఝగితి = టక్కున, శమమ్ = శాంతిని, నయేత్ = పొందింపవలయును. యత ఏవ = దేనినుంచి మాత్రమే/ఎందువలన మాత్రమే. సముద్భూతా = పుట్టినదో, తతః = అందువలననే, తత్రైవ = అచ్చటనే, లీయతే = లీనమగును.

**భావము:–** మనలో ఒక కోరిక పుడ్తుంది. దానిమీద చిలవలు పలువలుగా సంకల్ప వికల్పాలు ఊహాపోహలు పుట్తాయి. ఈ మానసిక సంసార పరంపర ఒక్క సంకల్పం

వలన ఒక్క వాంఛవలన పుట్టాయి. కాని ఇట్టి సంకల్పాన్ని గమనించి మొగ్గలోనే త్రుంచి వేసినచో అది పుట్టిన చోటనే నశిస్తుంది. అంటే మనస్సులోనే నశిస్తుంది. ఇది అభ్యాసం అయితే మనస్సు నిర్వికల్పంగా మారుతుంది. నిర్వికల్పస్థితి ఆనందమే.

**విశేషములు:–** యోగశాస్త్ర ప్రకారం మనస్సు వృత్తిరహితమయిన క్షణంలో 'ఆనందం' లభిస్తుంది. ఆ ఆనందం విషయానందం కాదు. ఆత్మానందం. అసలు ఆనందం మనలోనిదే. దానికి విషయాలు ప్రేరణ అయితే క్షణికం. నిర్విషయం ప్రేరణ అయితే శాశ్వతం. అదే ఇందులో చెప్పింది. మనస్సును వృత్తిరహితం చేయడానికి ప్రాణాయామాన్ని ఉపయోగిస్తారు. కుంభకంలో మనస్సు నిశ్చలం అవుతుంది. కాని భావనతోనూ తన దృఢసంకల్పంతోను మనస్సును ముందు వికల్పసంఖ్య నుంచి తగ్గించి ఏకసంకల్పంగా చేయవచ్చును. క్రమంగా ఏకసంకల్పంగూడా పోతే నిర్వికల్పం అవుతుంది. ఉదా॥ కమ్మని మామిడిపండు తినేటప్పుడు మనస్సు తద్విషయం వలన రేగిన ఆనందంలో ఉంటుంది. ఆ క్షణాలలో మన శ్వాసగూడా కొంచెం ఆగుతుంది. ఆకస్మిక సంతోషం దుఃఖం మొదలయిన వానితో గూడా శ్వాస ఆగుతుంది. కనుక 'మనస్సు – శ్వాస' అన్యోన్య లగ్నమయిన పదార్థాలు. భిన్నంగా అనిపిస్తాయి. కాని కోతి – దాని తోకవలె అభిన్నమయినవే. కనుక ఈ భావనలన్నీ నిర్వికల్పస్థితిని తద్వారా ఆనందాన్ని ఇస్తాయి.

---

## ధారణ – 73

**95. శ్లో॥ యదా మమేచ్ఛా నోత్పన్నా జ్ఞానం వా కస్తదాస్మి వై।**
**తత్త్వతోఽహం తథా భూతః తల్లీనస్తన్మనా భవేత్॥**

**ప్రతిపదార్థము:–** మమ = నాకు, ఇచ్ఛా = వాంఛ, యదా = ఎప్పుడు, న ఉత్పన్నా = పుట్టలేదో, జ్ఞానం చ = జ్ఞానమున్ను, న = పుట్టలేదో, తదా = అట్టి సమయమున, కః = ఎవడను, అస్మి వై = అగుచున్నాను. తత్త్వతః = తత్త్వరీత్యా, అహమ్ = నేను, తథాభూతః = అట్టివాడను అని భావించి, తత్ = ఆ భావనలో / ఆ తత్త్వంలో, లీనః = లీనుడై, తన్మనాః = అదే స్వరూపంగా, భవేత్ = అగును.

**భావము:–** ఏ వాంఛగాని, ఏ విషయజ్ఞానంగాని పుట్టనపుడు నావాస్తవ తత్త్వమేమి అని ఆలోచించినచో తన అస్తిత్వరూపమయిన 'చైతన్యము' గోచరమగును. దానిని భావించిన వాడు చైతన్యరూపముగా అగును.





## ధారణ – 74

**96. శ్లో॥ ఇచ్ఛాయామథవా జ్ఞానే జాతే చిత్తం నివేశయేత్।**
**ఆత్మబుద్ధ్యానన్యచేతాః తతస్తత్త్వార్థదర్శనమ్॥**

**ప్రతిపదార్థము:–** జాతే = పుట్టిన, జ్ఞానే = జ్ఞానమునందు, అథవా = లేదా, ఇచ్ఛాయామ్ = పుట్టిన కోరికయందుగాని, అనన్యచేతాః = సావధాన మనస్సు గలవాడై, ఆత్మబుద్ధ్యా = పరమాత్మ బుద్ధితో, చిత్తమ్ = తన మనస్సును, నివేశయేత్ = ధారణ చేయవలయును. తతః = అందువలన, తత్త్వార్థ = తత్త్వరూపముయొక్క, దర్శనమ్ = దర్శనము జరుగును.

**భావము:–** ఇంతకు ఇచ్ఛాజ్ఞానములు లేని స్థితిలో ఆత్మవిచారణ చెప్పబడింది. ఇందులో వచ్చిన వాంఛగాని, జ్ఞానంగాని పరిమితజ్ఞానాలు కావని. అవి అఖండ జ్ఞానరూపములని మనస్సును ధారణ చేసినచో అట్టి సాధకుడు తత్త్వదర్శియై భైరవస్థితిని పొందును. అనగా కోరికలు జ్ఞానాలు. వీటిలో విషయములను వదలితే అవి అన్నియు 'జ్ఞానరూపము'లేనని తెలియడం వలన జ్ఞానసిద్ధి.

---

## ధారణా –75

**97. శ్లో॥ నిర్నిమిత్తం భవేత్ జ్ఞానం నిరాధారం భ్రమాత్మకమ్।**
**తత్త్వతః కస్యచితేతత్ ఏవంభావీ శివః ప్రియే॥**

**ప్రతిపదార్థము:–** భ్రమాత్మకమ్ = భ్రమరూపమయిన, జ్ఞానమ్ = ప్రపంచ సంబంధమయిన వ్యవహారజ్ఞానము, నిర్నిమిత్తమ్ = ఇంద్రియాది నిమిత్తములు లేనిది, నిరాధారమ్ = ఘటాది వస్తువులు ఆధారంగాలేనిదిగాను, భవేత్ = కావలయును, ఏతత్ = ఇట్టి నిరాధార, నిర్నిమిత్త జ్ఞానము, తత్త్వతః = తత్త్వరీత్యా, కస్యచిత్ = ఏ ఒక్కనికి సంబంధించినది, న = కాదు. అనగా సర్వవ్యాప్తచైతన్యము. ప్రియే = ప్రియపార్వతీ!, ఏవంభావీ = ఇట్టి భావన / ధారణ కలవాడు, శివః = శివుడగును.

**భావము:–** ప్రియపార్వతీ! వ్యవహారజ్ఞానము భ్రమాత్మకమయినది. అది ఏదో ఒక నిమిత్తంతో వస్తుంది. వెలుతురు, ఇంద్రియప్రసారము ఇలాంటివి నిమిత్తములు. ఏదో ఒక ఆధారంతో ప్రవర్తిస్తాయి. అంటే వస్తువును తెలిసి కొంటాము.

వస్తుజ్ఞానమునకు వస్తువు ఆధారము లేదా మన జ్ఞానాలకు మనస్సు బుద్ధి ఆధారము కాని తత్త్వరీత్యా "జ్ఞానము" స్వతంత్రము. అది నిరాధారము నిమిత్తంలేనిది అది ఎవరికీ సంబంధించిన సొంతగుణము వంటిదియు కాదు, అని జ్ఞానాన్ని భావించినవాడు "విజ్ఞానభైరవుడు" కాగలడు.

---

## ధారణా - 76

**98. శ్లో॥ చిద్ధర్మా సర్వదేహేషు విశేషో నాస్తి కుత్రచిత్।**
**అతశ్చ తన్మయం సర్వం భావయన్ భవజిజ్జనః॥**

**ప్రతిపదార్థము:-** చిద్ధర్మా = చైతన్యధర్ముడయిన జీవుడు, సర్వదేహేషు = సమస్త శరీరముయందు, ఉండెను. కుత్రచిత్ = ఏ శరీరమందును, విశేషః= చైతన్యంలో తేడా, నాస్తి = లేదు. అతశ్చ = ఇందువలనగూడా, సర్వమ్ = సమస్తమును, తన్మయమ్ = చైతన్యమయముగా, భావయన్ = భావించు, జనః = వ్యక్తి, భవజిత్ = సంసారమును జయించును. అనగా భైరవదశను పొందును.

**భావము:-** సమస్తదేహులలోను చైతన్యం ఒక్కటిగానే కనిపిస్తున్నది. భేదాలు అవయవ సంపదను బట్టి వచ్చాయి గాని చైతన్యంలో తేడా వలన రాలేదు. కనుక సర్వవ్యాప్తమయిన చైతన్యమే తానని భావించువాడు తప్పక 'భైరవీదశ'ను పొందును. చిద్ధర్మాః = అని పాఠాంతరము. దానితో అర్థము చైతన్యధర్మములు అర్థము చెప్పవలెను. అవి సచ్చిదానందలక్షణాలు.

---

## ధారణా - 77

**99. శ్లో॥ కామక్రోధలోభమోహమదమాత్సర్యగోచరే।**
**బుద్ధిం నిస్తిమితాం కృత్వా తత్తత్త్వమవశిష్యతే॥**

**ప్రతిపదార్థము:-** కామ = కామము, క్రోధ = క్రోధము, లోభ = లోభము, మోహ = వ్యామోహము, మద = మదము, మాత్సర్య = మాత్సర్యము వీటియొక్క, గోచరే = స్థానమయిన చోట, బుద్ధిమ్ = తన బుద్ధిని, ని = మిక్కిలి, స్తిమితామ్ = నిశ్చలమయిన దానినిగా, కృత్వా = చేసి (చేసినచో), తత్ = ఆ బుద్ధియొక్క, తత్త్వమ్ = నిజస్వరూపము అయిన చైతన్యము, అవశిష్యతే = మిగులును.



**భావము:-** కామక్రోధాదుల విషయంలో 'బుద్ధి'చురుకుగా పనిచేసి వాటిని తీర్చుకొనడంలో లగ్నమవుతుంది. వాటికనుగుణంగా చలిస్తుంది. కాని అలాకాకుండా బుద్ధిని ఆ వికల్పాలకు అతీతంగా స్తిమితపఱచగలిగిన నిర్వికల్పకస్థితి వస్తుంది.

---

## ధారణా - 78

**100. శ్లో॥ ఇన్ద్రజాలమయం విశ్వం వ్యస్తం వా చిత్రకర్మవత్।**
**భ్రమద్వా ధ్యాయతస్సర్వం పశ్యతశ్చ సుఖోద్గమః॥**

**ప్రతిపదార్థము:-** సర్వమ్ = సమస్తమయిన, విశ్వమ్ = ప్రపంచమును, ఇంద్రజాలమయమ్ = గారడీగాను, చిత్రకర్మవత్ = బొమ్మల కొలువుగాను, వ్యస్తం వా = ప్రపంచవస్త్రంమీద చిత్రింపబడినట్లుగాను, భ్రమద్వా = భ్రమగాగాను, ధ్యాయతః = ధ్యానించువానికి, పశ్యతశ్చ = చూచువానికిన్ని, సుఖ = సుఖముయొక్క ఉద్గమః = ఉదయము జరుగును.

**భావము:-** ఈ ప్రపంచమంతా భగవంతుడు చేసే గారడీగా గాని, ఆయన వేసిన గొప్ప చిత్తరువుగాగాని, మొత్తం మన "భ్రమ"గాగాని గమనించువారికి తప్పక తత్త్వరూపమయిన ఆనందస్థితి లభించును.

**విశేషములు:-** (1) ఇందులో "భ్రమద్వా" వద్ద వ్యాఖ్యాతలు "ప్రపంచమే తిరుగు చున్నట్లు భ్రమపడి, అని చెప్పి, ఉదాహరణగా "పడవమీద పోవువానికి తీరవృక్షాలు వెనక్కు నడుస్తున్నట్లు కనిపించడం అని చెప్పారు. అదంతా అనవసరం. తప్పు. "భ్రమగా అగుచున్నదనే అర్థములో 'క్విప్' ప్రత్యయం చేస్తే 'భ్రమత్' భ్రమగా అగుచున్నది" అని చెప్పవచ్చును. అయితే ఇంద్రజాలము భ్రమ ఒక్కటేగదా అనిపించ వచ్చును. కాని కాదు. ఇంద్రజాలములో భ్రమ ఉండదు. ఆశ్చర్యం ఉంటుంది గారడీవాడు చేతి రుమాలును, కర్రగా చేస్తాడు. అది అలా కాదని తెలుసు. అయినా ఎలా చేశాడు? అని ఆశ్చర్యం వస్తుంది. భ్రమలో భ్రమనే సత్యం అనుకొంటాము. భ్రమకు వశం అవుతాము. ఇంద్రజాలానికి కర్తవేరు. భ్రమకు తనే అన్ని.

2. కనుక భగవంతుని కర్తగా భావిస్తే ఇంద్రజాలం. అదే మాయ, స్వాతంత్ర్యశక్తి మొ॥. భ్రమగా భావిస్తే తప్ప తనమీద వేసికొనవలసి ఉంటుంది. మొదటి దృష్టిలో వినోదం, 2వ దృష్టిలో విచారం ఉంటాయి.

## ధారణ - 79

**101. శ్లో॥ న చిత్తం నిక్షిపేద్దుఃఖే న సుఖే వా పరిక్షిపేత్।**
**భైరవి! జ్ఞాయతాం మధ్యే కిం తత్త్వమవశిష్యతే॥**

**ప్రతిపదార్థము:-** భైరవి= భైరవరాజ్ఞీ!, దుఃఖే = దుఃఖమునందు, చిత్తమ్ = మనస్సును, న నిక్షిపేత్ = పడవేయరాదు, సుఖే వా = సుఖమునందుగాని, న పరిక్షిపేత్ = పడవేయరాదు, మధ్యే = ఈ సుఖదుఃఖాల మధ్యలో, కిమ్ = ఏ, తత్త్వమ్ = తత్వము, అవశిష్యతే = మిగులునో అని, జ్ఞాయతామ్ = తెలిసికొనబడవలయును.

**భావము:-** మనస్సును సుఖదుఃఖాలలో మునగవేస్తే అవి సుఖదుఃఖవికల్పాలతో నిండిపోతుంది. అలాకాక సుఖదుఃఖములకు మధ్యలో అంటే అతీతంగా అంట కుండా నిర్వికల్పంగా ఉంచితే మిగిలేది "చైతన్యమే". కనుక సుఖదుఃఖముల మధ్య ఉన్న చైతన్యమును తెలియాలని భైరవుడు భైరవికి చెప్పటం జరిగింది. ఆ మధ్యనుండే సాక్షి చైతన్యము భైరవుడే. భైరవీదశ అలా సిద్ధించుతుంది.

---

## ధారణ - 80

**102. శ్లో॥ విహాయ నిజదేహాస్థాం సర్వత్రాస్మీతి భావయన్।**
**దృఢేన మనసా దృష్ట్యా నాన్యేక్షిణ్యా సుఖీభవేత్॥**

**ప్రతిపదార్థము:-** దృఢేన = దృఢమయిన, మనసా = మనస్సుతో, నాన్యేక్షిణ్యా = భిన్నమయిన, అస్తిత్వమును గమనింపని, దృష్ట్యా = దృష్టితో, నిజ = తన, దేహాస్థామ్ = దేహమునందు మాత్రమే ఉనికిని, విహాయ = విడిచి, సర్వత్ర = అంతట, అస్మి = ఆత్మరూపంగా ఉన్నాను, ఇతి = అని, భావయన్ = భావించుచు, సుఖీ = ఆనందవంతుడు, భవేత్ = కావలెను.

**భావము:-** తాను దేహంలోనే ఉన్నానన్న పరిమిత జీవ భావనను వదలి, అంతటా తానే ఆత్మ రూపంగానే ఉన్నట్లు భావించాలి. దృఢమయిన మనస్సు, జ్ఞానపరమయిన అభేదదృష్టితో ఈ పనిచేస్తే భైరవీదశ కలుగును.

**విశేషములు:-** ఇందులో ఒక వ్యాఖ్యాత ఇచ్చిన '2'శ్లోకాలు చాలా బాగుండడం చేత పాఠకులకు అవి చూపుతున్నాను.



**"యతస్తతో వాస్తు భయం యద్యహం నామ కించన।**
**అహమేవ న కించిచ్చేత్ భయం కస్యోపజాయతే॥"**

**- తత్త్వమంజరీ**

**"విశ్వాత్మ విశ్వోత్తీర్ణం చ స్వతంత్రం దివ్యమక్షరమ్।**
**అహమిత్యుత్తమం తత్త్వం సమావిశ్య బిభేతి కః॥"**

**- విమర్శ దీపిక**

**"ఏకకోఽహమితి సంసృతౌ జనః త్రాససాహసరసేన ఖిద్యతే।**
**ఏకకోఽహమితి కోఽపరోఽస్తి మే ఇత్థమస్మి గతభీః వ్యవస్థితః॥"**

---

## ధారణా - 81

**103. శ్లో॥ ఘటాదౌ యచ్చ విజ్ఞానమిచ్ఛాద్యం వా మమాన్తరే।**
**నైవ సర్వగతం జాతం భావయన్నితి సర్వగః॥**

**ప్రతిపదార్థము:-** మమ = నాయొక్క, (సాధకుని యొక్క), అంతరే = మనస్సులో, యచ్చ = ఏ, విజ్ఞానమ్ = విజ్ఞానము, ఇచ్ఛాద్యం వా = వాంఛ మొదలయినవిగాని, ఘటాదౌ ఏవ = ఘటము మొదలగువానియందు మాత్రమే, న = కాదు, సర్వగతం = సర్వవ్యాప్తమయినది, జాతమ్ = అయినది, ఇతి = అని, భావయన్ = ధారణ చేస్తూ, సర్వగః = సర్వవ్యాప్తుడగును.

**భావము:-** నాయందు జ్ఞానమున్నది. వాంఛలున్నవి. అంటే అవి ఘటాదు లందున్నట్లు కనిపిస్తున్నది. కాని ఘటములందు మాత్రమే లేవు. యిపుడు నా జ్ఞానము సర్వవ్యాప్తమయినది. అనగా ఘటం మొదలయిన వికల్పములకు పరిమితం కాదు. సర్వవ్యాప్తం కనుక నిర్వికల్పము. ఇట్టి భావనతో ధారణ చేయువానికి భైరవీదశ కలుగును.

**విశేషములు:-** దీని వ్యాఖ్యాత చాలా గందరగోళం చేశాడు. ఆ అర్థం పదాల వలన వచ్చినదికాదు. చాలా క్లిష్టం. దీనిలో అట్టి క్లిష్టభావనలు లేవు. పదాలకందని కృత్రిమభావనలున్నూ లేవు. అందువలన వ్యాఖ్యాతవ్రాసిన '2' అర్థాలు సమన్వయం కావు.

---

## ధారణ - 82

**104. శ్లో॥ గ్రాహ్యగ్రాహకసంవిత్తిః సామాన్యా సర్వదేహినామ్।
యోగినాం తు విశేషోఽయం సంబన్ధే సావధానతా॥**

**ప్రతిపదార్థము:–** సర్వ = సమస్త, దేహినామ్ = జీవులకు, గ్రాహ్య = గ్రహింపబడువానియొక్క, గ్రాహక = గ్రహించువానియొక్క, సంవిత్తిః = జ్ఞానము, సామాన్యా = సమానమే, యోగినాం తు = ఉపాసకులకు, అయమ్ = ఇది, విశేషః = తేడా, ఏమంటే, సంబంధే = గ్రాహ్యగ్రాహక సంబంధమయిన గ్రహణమునందు అనగా జ్ఞానమునందు, సావధానతా = శ్రద్ధయే తేడా.

**భావము:–** ఇంద్రియవ్యాపారము చేత మనం దేన్నయినా గ్రహిస్తాం. ఇది అందరకు తెలిసినదే. గ్రాహకుడు తానే. గ్రాహ్యం రూపం, రుచి మొదలయినవి. ఇది అందరికి తెలిసినదే. కాని గ్రాహ్యగ్రాహకుల సంబంధం గ్రహించడం అనగా ప్రమాణమయిన జ్ఞానము. ఈ సంబంధం అయిన జ్ఞానం మీద బాగా ధారణచేసి యోగులు జ్ఞానులవుతారు. అదే తేడా.

---

## ధారణ - 83

**105. శ్లో॥ స్వవదన్యశరీరేఽపి సంవిత్తిమనుభావయేత్।
అపేక్షాం స్వశరీరస్య త్యక్త్వా వ్యాపీ దినైర్భవేత్॥**

**ప్రతిపదార్థము:–** స్వవత్ = తన శరీరమునందు వలె, అన్య = వేరొక, శరీరేపి = దేహమునందున్నూ, సంవిత్తిమ్ = జ్ఞానమును / చైతన్యమును, అనుభావయేత్ = అనుసరించి భావింపవలయును. స్వశరీరస్య = తన శరీరము యొక్క, అపేక్షామ్ = సంబంధమును, త్యక్త్వా, వదలి (నచో), దినైః = రోజులలోనే, వ్యాపీ = వ్యాపకుడయిన భైరవుడుగా, భవేత్ = అగును.

**భావము:–** తన శరీరంలో సంవిత్తును ఎలా భావన చేయాలో పూర్వశ్లోకంలో ఉన్నది. అదేవిధంగా ఇతర దేహాల్లోను చైతన్యము ఉన్నది. ఈ భావనను పెంచి చివఱకు తన శరీర పరిమితిని వదలి ధారణ చేసిన నాడు రోజులలోనే బ్రహ్మమగును.

---





## ధారణ - 84

**106. శ్లో॥ నిరాధారం మనః కృత్వా వికల్పాన్న వికల్పయేత్।
తదాత్మపరమాత్మత్వే భైరవో మృగలోచనే॥**

**ప్రతిపదార్థము:–** మనః = మనస్సును, నిరాధారమ్ = విషయాధారములే లేనిదానినిగా, కృత్వా = చేసి, వికల్పాన్ = రకరకాల ఆలోచనలను, న వికల్పయేత్ = వికల్పింపరాదు. మృగలోచనే = మృగాక్షి! పార్వతీ! తదా = నిర్వికల్పమానసిక స్థితిలో, ఆత్మ = ఆత్మయొక్క, పరమాత్మత్వే = పరమాత్మ అయిన సందర్భంలో, భైరవః = భైరవుడగును.

**భావము:–** ఓ మృగేక్షణా! పార్వతీ! మనస్సును నిరాధారం చేయవలయును. అంటే మనస్సుకు ఆధారం విషయాలు వాటివలన వికల్పాలు. కనుక విషయం వదలితే ఇక వికల్పాత్మకమనస్సు లేనట్లే. అయితే మఱల కొత్త వికల్పాలను రాకుండా కట్టడి చేయాలి. అపుడు ఆ నిర్వికల్పస్థితిలో ఆత్మ తన పరమాత్మభావాన్ని తెలుసుకుంటుంది. సాధకుడు భైరవ సమావేశం పొందుతాడు.

---

## ధారణ - 85

**107. శ్లో॥ సర్వజ్ఞః సర్వకర్తా చ వ్యాపకః పరమేశ్వరః।
స ఏవాహం శైవధర్మా ఇతి దార్ఢ్యాత్ శివోభవేత్॥**

**ప్రతిపదార్థము:–** పరమేశ్వరః = పరమేశ్వరుడు, సర్వజ్ఞః = సర్వము తెలిసినవాడు, సర్వకర్తా = సర్వము చేయగలవాడు, వ్యాపకః = సర్వత్ర వ్యాపించినవాడు, శైవధర్మా = శివధర్మములుగల, అహమ్ = నేను, స ఏవ = ఆ శివుడనే, ఇతి = అను, దార్ఢ్యాత్ = దృఢభావనవలన, శివః = శివుడుగా, భవేత్ = అగును.

**భావము:–** ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వకర్త, సర్వవ్యాపి. శివధర్మములుగల ఆత్మను నేను. నేను భైరవుడను. **"శివోఽహం"**అని ధారణ చేసినచో భైరవదశ సిద్ధించును.

---

## ధారణ - 86

**108. శ్లో॥ జలస్యేవోర్మయో వహ్నేః జ్వాలాభంగ్యః ప్రభా రవేః।
మమైవ భైరవస్యైతాః విశ్వభంగ్యో విభేదితాః॥**

**ప్రతిపదార్థము:–** జలస్య = నీటికి, ఊర్మయ ఇవ = తరంగాలవలె, వహ్నేః = అగ్నికి, జ్వాలాభంగ్యః = జ్వాలారేఖలవలె, రవేః = సూర్యునికి, ప్రభా ఇవ = కాంతులవలె, ఏతాః = ఈ, విభేదితాః = భేదముగల, విశ్వభంగ్యః = ప్రపంచ వైఖరులు, భైరవస్య = భైరవుడనయిన, మమైవ = నావే అని భావనచేసినచో, భైరవత్వసిద్ధి.

**భావము:–** నీటికి అలలు, అగ్నికి జ్వాలలు, సూర్యునకు కాంతిరేఖలు వారికన్నా భిన్నమయినా వారి రూపమే అట్లే విలక్షణమయిన ఈ విశ్వవైఖరులన్నియు, భిన్నంగా కనబడుతున్నా నా ఆత్మరూపమే అని భావన చేయు సాధకునకు భైరవత్వసిద్ధి కలుగును.

---

## ధారణ - 87

**109. శ్లో॥ భ్రాంత్వా భ్రాంత్వా శరీరేణ త్వరితం భువి పాతనాత్।**
**క్షోభశక్తివిరామేణ పరా సంజాయతే దశా॥**

**ప్రతిపదార్థము:–** శరీరేణ = శరీరంతో, భ్రాంత్వా భ్రాంత్వా = మాటిమాటికి గుండ్రంగా తిరిగి, త్వరితమ్ = శీఘ్రముగా, భువి = నేలమీద, పాతనాత్ = పడవేయుటవలన, క్షోభ = గుండ్రముగా తిరుగుటవలన వచ్చిన క్షోభ యొక్క, శక్తి = వేగముయొక్క, విరామేణ= ఆగుటచేత ఏ స్థితివచ్చునో ఆ స్థితియందు ధారణ చేసినచో, పరా = పరమమయిన, దశా = భైరవదశ. సంజాయతే = కలుగును.

**భావము:–** సాధకుడు గిర్రున గుండ్రంగా తిరిగి తిరిగి అమాంతంగా పడిపోయి నపుడు ఒళ్ళంతా తిరుగుతుంది. అది ఆగిన తరువాత ఒక ఆనందస్థితి ఒక నిర్వికల్పస్థితి లభించును. దానిని భావన చేసినతో పరమభైరవస్థితి లభించును.

---

## ధారణ - 88

**110. శ్లో॥ ఆధారేష్వథవాశక్త్యాజ్ఞానాత్ చిత్తలయేన వా।**
**జాతశక్తిసమావేశక్షోభాన్తే భైరవం వపుః॥**

**ప్రతిపదార్థము:–** ఆధారేషు = జ్ఞానమునకు ఆధారమయిన పదార్థముయందు, అశక్త్యా = శక్తిహీనతచేతగాని, అథవా = లేదా అజ్ఞానాత్ = జ్ఞానరాహిత్యం వలనగాని, చిత్తలయేన = మనస్సు లయించుటచేత, జాత = కలిగిన, శక్తి = బుద్ధిశక్తియొక్క, సమావేశ = కలయిక వలన వచ్చిన, క్షోభ = బాధయొక్క, అంతే = చివర, భైరవమ్ = భైరవ సంబంధమయిన, వపుః = స్వరూపము వచ్చును.





**భావము:–** ఒక్కొక్కసారి మనకు కొన్ని పదార్థములు సాధ్యం కావు. అందుకు అశక్తి లేదా అజ్ఞానం కారణం కావచ్చు. రెండూ కారణం కావచ్చు. అపుడు దానిని సాధించుటకు తీవ్రంగా మనసు లయం చెందుతుంది. అంటే అదే ధ్యాసగా మనస్సును కేంద్రీకరిస్తాం. ఆ సందర్భంలో మనస్సులో జ్ఞానశక్తులు తీవ్రంగా సమావేశం అవుతాయి. ఆ క్షోభ చివర అనగా ఆలోచన ఫలించిన తర్వాత వచ్చే ఆనందంలోగాని లేక ఆ క్షోభ అణగిన నిర్లిప్తస్థితిలోగాని ధారణ చేసినచో భైరవీసిద్ధి లభించును. కనుక సుఖమయినా దుఃఖమయినా ఏదయినా భైరవ రూపంగా ధారణ చేస్తే భైరవశరీరసిద్ధి. స్వతంత్రతంత్రంలో చెప్పారు.

**యత్ర యత్ర మనో యాతి జ్ఞేయం తత్రైవ చింతయేత్।**
**చలిత్వా యాన్యతే కుత్ర సర్వం శివమయం యతః॥**

---

## ధారణ - 89

**111. శ్లో॥ సంప్రదాయమిమం దేవి! శృణు సమ్యక్ వదామ్యహమ్।**
**కైవల్యం జాయతే సద్యో నేత్రయోః స్తబ్ధమాత్రయోః॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = పార్వతీ!, ఇమమ్ = ఈ, సంప్రదాయమ్ = సంప్రదాయమును, శృణు = వినుము, వదామి = చెప్పెదను, నేత్రయోః = నేత్రములు, స్తబ్ధమాత్రయోః = నీలిగినంత మాత్రముననే, సద్యః = వెంటనే, కైవల్యమ్ = మోక్షము, జాయతే = కలుగును.

**భావము:–** దేవి! ఒక ప్రాచీన సంప్రదాయమును చెబుతాను. విను. నేత్రములు నీల్గినంతనే మోక్షము తప్పక వెంటనే రాగలదు. అనగా పరధ్యానంలో ఎలా అయితే మన నేత్రాలు స్తబ్ధంగా ఉంటాయో అలా పరశివధ్యానంతో నేత్రములు స్తబ్ధములయినచో వానికి శివభావనపైన ధారణ నిలిచినట్లు గనుక తప్పక వెంటనే మోక్షము వచ్చును.

## ధారణ - 90

**112. శ్లో॥ కూపాదికే మహాగర్తే స్థిత్వోపరి నిరీక్షణాత్।**

**అవికల్పమతేః సమ్యక్ సద్యశ్చిత్తలయః స్ఫుటమ్॥**

**ప్రతిపదార్థము:–** కూపాదికే = బావి మొదలగు, మహాగర్తే = పెద్దగొయ్యిలో, స్థిత్వా = నిలిచి, ఉపరి = ఆకాశమున, నిరీక్షణాత్ = చూచుట వలన, సమ్యక్ = బాగా, అవికల్పమతేః = నిర్వికల్ప బుద్ధిగల వానికి, సద్యః = వెంటనే, చిత్త = మనస్సుయొక్క, లయః = లీనత, స్ఫుటమ్ = స్పష్టముగా జరుగును.

**భావము:–** పెద్ద గొయ్యి, బావి, ఇట్టివాటిలో నిలబడి ఆకాశమును తీవ్రంగా గమనించి సర్వవ్యాపకమయిన ఆకాశమునందు ధారణ చేసినచో నిర్వికల్పకత సిద్ధించును. దానితో భైరవస్వరూపసిద్ధి అగును.

---

## ధారణ - 91

**113. శ్లో॥ యత్ర యత్ర మనో యాతి బాహ్యే వాభ్యంతరే ప్రియే!।**

**తత్ర తత్ర శివావస్థా వ్యాపకత్వాత్ క్వ యాస్యతి?॥**

**ప్రతిపదార్థము:–** ప్రియే = ప్రియురాలా! మనః = మనస్సు, బాహ్యే వా = బాహ్య వస్తువునందుగాని, యత్ర యత్ర = ఎక్కడెక్కడ, మనః = మనస్సు, యాతి = చేరునో, తత్ర తత్ర = అచ్చటచ్చట, శివ = శివునియొక్క, అవస్థా = స్థితి ఉండును. వ్యాపకత్వాత్ = శివుడు వ్యాపకుడు కావటం వలన, క్వ = (శివుడు లేని చోటుకు) ఎక్కడికి, యాస్యతి = మనస్సుపోగలదు.

**భావము:–** సర్వత్ర శివుడున్నాడు. మన మనస్సు ఎక్కడకు పోయినా శివుడు లేని చోటు దొరకదు. కనుక మనస్సు ఎక్కడకు వెళ్ళినా అచ్చట శివుని భావించి అందే ధారణ చేసినచో శివావస్థ లభించును.

---

## ధారణ - 92

**114. శ్లో॥ యత్ర యత్రాక్షమార్గేణ చైతన్యం వ్యజ్యతే విభోః।**

**తస్య తన్మాత్రధర్మిత్వాత్ చిల్లయాత్ భరితాత్మతా॥**





**ప్రతిపదార్థము:–** అక్షమార్గేణ = ఇంద్రియముద్వారా, యత్ర యత్ర = ఎచ్చటెచ్చట, విభోః = ప్రభువుయొక్క, చైతన్యమ్ = చైతన్యము, వ్యజ్యతే = వ్యక్తమగునో, తస్య = ఆ పదార్థము, తన్మాత్ర = చైతన్యము మాత్రమే, ధర్మిత్వాత్ = ధర్మముగా గలది కనుక, చిత్ = జ్ఞానముయొక్క, లయాత్ = లీనతవలన, భరిత = పూర్ణమయిన, ఆత్మతా = భైరవరూపత్వము సిద్ధించును.

**భావము:–** మన ఇంద్రియములద్వారా వ్యక్తమయ్యే చైతన్యం భైరవస్వరూపమే. పదార్థములన్నియు చైతన్యరూపములే. కనుక తమ చైతన్యము ఆ చైతన్యమునందు ధారణ చేసినచో భైరవస్థితి లభించును.

---

## ధారణ - 93

**115. శ్లో॥ క్షుతాద్యన్తే భయే శోకే గహ్వరే వా రణాద్రుతే।**

**కుతూహలే క్షుధాద్యన్తే బ్రహ్మసత్తా సమీపగా॥**

**ప్రతిపదార్థము:–** క్షుత - ఆది - అన్తే = తుమ్ము మొదలగు వానియొక్క చివఱ ఉన్న సుఖంలో, భయే = భయమునందు, శోకే = శోకమునందు, గహ్వరే వా = గుహయందు, రణాత్ = యుద్ధమునుండి, ద్రుతే = పారిపోయిన దానియందు, కుతూహలే = అద్భుతమునుందుండే ఆసక్తియందు / వాంఛాసక్తియందు, క్షుత్ = ఆకలియొక్క, ఆది = మొదట, అంతే = చివఱను, ఏర్పడిన సుఖదుఃఖములయందు, ధారణ చేసినచో, బ్రహ్మసత్తా = భైరవదశ, సమీపగా = దగ్గఱగా అవుతుంది.

**భావము:–** తుమ్ములు, మొ॥ దేహక్రియల, చివర, అనుసంధానం చేయాలి. అంటే తుమ్మకముందు బాధ, తరువాత సుఖం ఎవరికి? అని అనుసంధానం చేస్తే ఆత్మతత్త్వం స్ఫురిస్తుంది. అలానే భయశోకాదులు వచ్చినపుడు, ఏదయినా క్లిష్టపరిస్థితిలో / గుంటలో పడ్డపుడు, యుద్ధమునుండి పారిపోయినపుడు కుతూహలాల్లోను ఆకలి దప్పికలు తీరిన తర్వాత ఉండే మానసికసుఖదుఃఖ విభ్రమాదులలో ఆత్మభావన చేసినచో బ్రహ్మదశ సిద్ధమే.

---

## ధారణ - 94

**116. శ్లో॥ వస్తుషు స్మర్యమాణేషు దృష్టే దేశే మనః త్యజేత్।**

**స్వశరీరం నిరాధారం కృత్వా ప్రసరతి ప్రభుః॥**

**ప్రతిపదార్థము:–** స్మర్యమాణేషు = స్మరింపబడుచున్న, వస్తుషు = వస్తువులయందు, దృష్టే = చూడబడిన, దేశే = దేశమునందు, మనః = మనస్సును, త్యజేత్ = ధారణగా ఉంచవలెను. స్వశరీరమ్ = తన శరీరమును, నిరాధారమ్ = ఆధారములేని దానినిగా, కృత్వా = చేసి, (చేసినవాడు) ప్రభుః = ప్రభువుగా అనగా భైరవుడుగా, ప్రసరతి = ప్రసరించును. అనగా భైరవుడుగా వ్యాపించును.

**భావము:–** "స్మరణము, అనుభవం" – ఈ రెండు జ్ఞానభేదములు, తను స్మరించిన వస్తువులు, తను చూచిన ప్రదేశము వీటియందు మనస్సును నిర్వికల్పముగా వదలవలెను. అట్టి నిర్వికల్పస్థితిలోనే సాక్షి చైతన్యము స్ఫురించును. తద్వారా 'భైరవీదశ' సిద్ధించును.

---

## ధారణ – 95

**117. శ్లో॥ క్వచిద్వస్తుని విన్యస్య శనైర్దృష్టిం నివర్తయేత్।**
**తత్ జ్ఞానం చిత్తసహితం దేవి! శూన్యాలయో భవేత్॥**

**ప్రతిపదార్థము:–** దేవి = దేవీ!, క్వచిత్ = ఏదో ఒక, వస్తుని = వస్తువునందు, దృష్టిమ్ = చూపును, విశ్వస్య = ఉంచి, శనైః = మెల్లగ, దృష్టిమ్ = చూపును, నివర్తయేత్ = మరలింపవలెను. చిత్త = మనస్సుతో, సహితమ్ = కూడిన, తత్ = ఆ, జ్ఞానమ్ = వస్తుజ్ఞానము ధారణ చేసినచో, శూన్య = వికల్పశూన్యమయిన భైరవతత్త్వమునకు, ఆలయః = నివాసము, భవేత్ = అగును.

**భావము:–** ఒక వస్తువు ఏదయినా – దానిమీద దృష్టి కొంచెం సేపు ఉంచి మెల్లగా దృష్టిని తప్పించినచో చిత్త సహితమయిన జ్ఞానము కలుగును. క్రమముగా ధారణవలన అందలి 'చిత్తము' (అనగా వస్తు స్మరణలో గూడినది), జారిపోయిన జ్ఞానము మిగిలును. అది వికల్పశూన్యము. అట్టి నిర్వికల్పమయిన జ్ఞానమే చైతన్యము అదే భైరవస్థితి. కనుక సాధకుడు ఆ భైరవస్థితికి ఆధారమగును. అనగా భైరవుడే అగును.

---

## ధారణ – 96

**118. శ్లో॥ భక్త్యుద్రేకాద్విరక్తస్య యాదృశీ జాయతే మతిః।**
**సా శక్తిః శాంకరీ నిత్యం భావయేత్ తాం తతశ్శివః॥**



**ప్రతిపదార్థము:–** భక్త్యుద్రేకాత్ = భక్తియొక్క అతిశయం వలన, విరక్తస్య = వైరాగ్యము పొందిన వానికి, యాదృశీ = ఎటువంటి, మతిః = బుద్ధి, జాయతే = పుట్టునో, సా = అది, శాంకరీ = శంకర సంబంధమయిన, శక్తిః = శక్తి తామ్, ఆశక్తిని, నిత్యమ్ = నిత్యము, భావయేత్ = మనస్సులో ధారణ చేయవలెను. తతః = అందువలన, శివః = శివుడు అగును.

**భావము:–** విపరీతమయిన భక్తివలన సాధకుని మనస్సులో 'జ్ఞానం' పుడ్తుంది. ఆ జ్ఞానమే శంకరుని శక్తి. దానిని నిత్యం భావించినచో శివత్వము సిద్ధించును.

---

## ధారణ – 97

**119. శ్లో॥ వస్త్వన్తరే వేద్యమానే సర్వవస్తుషు శూన్యతా।**
**తామేవ మనసా ధ్యాత్వా విదితోఽపి ప్రశామ్యతి॥**

**ప్రతిపదార్థము:–** వస్తు = వస్తువులయొక్క, అంతరే = లోపల అనగా అంతర్యామి విషయము, వేద్యమానే = తెలియబడుచుండగా, సర్వ = అన్ని, వస్తుషు = వస్తువులయందు, శూన్యతా = నామరూప శూన్యత, ఏర్పడును. తామేవ = ఆ శూన్యతనే, మనసా = మనస్సుతో, ధ్యాత్వాపి = ధ్యానధారణ చేసి, అయిన, విదితః = జ్ఞాని, ప్రశామ్యతి = భైరవరూపశాంతిని పొందగలడు.

**భావము:–** వస్తుతత్త్వాన్ని చక్కగా పరిశీలించడం మొదలుపెడితే క్రమంగా వస్తువులన్ని శూన్యం అనగా మిథ్య అని తెలుస్తుంది. అప్పుడు ఆ నామరూప శూన్యతను ధారణ చేసినచో చివరకు తన నామరూప శూన్యత అర్థమయి అసలు తత్త్వమయిన పరమశాంత భైరవస్వరూపం సాక్షాత్కరించును.

---

## ధారణ – 98

**120. శ్లో॥ కించిత్‌జ్ఞైర్యా స్మృతా శుద్ధిః సా శుద్ధిః శమ్భుదర్శనే।**
**న శుచిర్హ్యశుచిస్తస్మాత్ నిర్వికల్పః సుఖీ భవేత్॥**

**ప్రతిపదార్థము:–** కించిత్ = కొంచెమే, జ్ఞైః = తెలిసినవారిచేత / అల్పజ్ఞులచేత, యా = ఏది, శుచిః = శుచిగా, స్మృతా = చెప్పబడినదో, సా = అది, శంభుదర్శనే = శైవదర్శనమునందు, అశుద్ధిః = శుద్ధికాదు. శుచిః = శంభు దర్శనమునందు

శుచి అయినది, అశుచిః = అశుచి, నహి = కాదుగదా! తస్మాత్ = అందువలన, నిర్వికల్పః = వికల్పరహితుడైనవాడు, సుఖీ = సుఖముగలవాడు, భవేత్ = అగును.

**భావము:–** మనం శుద్ధి అనుకునేది శైవదర్శనం ప్రకారం శుద్ధికాదు. లేదా శివప్రత్యక్ష దర్శనం విషయంలో ఉపయోగించే 'శుద్ధి'కాదు. అంటే మనం అనుకొనేది. 'దేహశుద్ధి'. కాని శంభుదర్శనానికి కావలసిన దేహశుద్ధికాదు. ఎందుకంటే దేహాభిమానమే పనికిరాదు కనుక దేహం, దాని శుద్ధి అనేవి పనికిరావు. అంటే దేహం అశుద్ధంగా ఉండాలని అర్థంకాదు. శంభు దర్శనానికి కావలసిన శుద్ధికాదు. దేహమాత్ర శుద్ధి అశుద్ధియే అని అర్థము. శంభు దర్శనానికి పనికివచ్చే 'శుచి' ఎప్పటికి 'అశుచి' కాదు. కన్నప్ప అశుచి అయినా అది శివదర్శనానికి పనికివచ్చింది కనుక అది 'శుచి' – అశుచి కాదు కనుక 'మనశ్శుద్ధి' ముఖ్యమని గ్రహించాలి. మనశ్శుద్ధి అంటే మనస్సులో ఎటువంటి వికల్పాలు లేని శూన్యస్థితియే. అది ఉంటే భైరవదశ. మఱియు, ఇతరులు చెప్పిన 'మనశ్శుద్ధి' గూడా శంభుదర్శనానికి పనికిరాదు. 'మనశ్శుద్ధి' అంటే వారు చెప్పేది కామక్రోధాదులు లేకపోవడం. కాని అది శంభుదర్శనానికి చాలదు. అందుకు కావలసినది 'మనస్సులో ఏ భావము లేకపోవడం. కనుక ఇట్టి నిర్మల స్వచ్ఛ రూపమయిన 'నిర్వికల్పత'ను పొందినవాడు 'సుఖి' అగును.

---

### ధారణ – 99

**121. శ్లో॥ సర్వత్ర భైరవో భావః సామాన్యేష్వపి గోచరః।**
**న చ తద్వ్యతిరేకేణ పరోఽస్తీత్యద్వయా గతిః॥**

**ప్రతిపదార్థము:–** సర్వత్ర = అన్నింటియందు, భైరవః = భైరవ సంబంధమయిన, భావః = ఉనికి / సత్త, సామాన్యేష్వపి = సాధారణ వస్తువులయందు ప్రజలందరి యందున్ను, గోచరః = కనబడునది (చ = మఱియు) తద్వ్యతిరేకేణ = ఆ భైరవునికి భిన్నంగా, పరః = ఇతర పదార్థము, నాస్తి = లేదు, ఇతి = అని, భావనచేస్తే, అద్వయా = అద్వైతరూపమయిన, గతిః = భైరవస్వరూపదశ వచ్చును.

**భావము:–** భగవంతుడు (భైరవుడు) సర్వత్ర ఉన్నాడని అందరికి అవగాహన ఉన్నది కాని ఆయన తప్ప ఇంకేది లేదని తెలిసికొనటమే విశేషజ్ఞానము. ఇది భైరవాద్వైతము. ఈ భావనవలన భైరవసామరస్యం ఏర్పడుతుంది.





### ధారణ – 100

**122. శ్లో॥ సమః శత్రౌ చ మిత్రే చ సమో మానావమానయోః।**
**బ్రహ్మణః పరిపూర్ణత్వాత్ ఇతి జ్ఞాత్వా సుఖీ భవేత్॥**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మణః =బ్రహ్మము / భైరవుడు, పరిపూర్ణత్వాత్ = సర్వవ్యాప్తుడు కనుక, శత్రౌ = శత్రువునందు, మిత్రే = మిత్రునియందు, సమః =సమానంగా ఉండును. మాన = మానమునందు, అవమానయోః = అవమానమునందును, సమః = సమానముగా బ్రహ్మయుందును, ఇతి = అని, జ్ఞాత్వా = ఎఱిగి, సుఖీ = సుఖవంతుడు, భవేత్ = కాగలడు.

**భావము:–** బ్రహ్మము సర్వవ్యాప్తము. కనుక భైరవుడు శత్రువునందును మిత్రునియందును, మానమునందును అవమానము నందును సమానముగా ఉండునని భావించి అందరియందు సమదృష్టి గలవాడుగా సుఖవంతుడు కాగలడు.

---

### ధారణ – 101

**123. శ్లో॥ న ద్వేషం భావయేత్ క్వాపి న రాగం భావయేత్ క్వచిత్।**
**రాగద్వేషవినిర్ముక్తౌ మధ్యే బ్రహ్మ ప్రసర్పతి॥**

**ప్రతిపదార్థము:–** క్వాపి = ఎక్కడను, ద్వేషమ్ = ద్వేషమును, న భావయేత్ = భావింపరాదు. క్వచిత్ = ఎక్కడనయినా, రాగమ్ = ప్రేమను, న భావయేత్ = భావన చేయరాదు. రాగద్వేష = రాగద్వేషములనుండి, వినిర్ముక్తౌ = ముక్తి (విడుదల) ఏర్పడినచో, సాధకుడు, 'మధ్యేబ్రహ్మ' = బ్రహ్మములోనికి, ప్రసర్పతి = నడుచును.

**భావము:–** ఎచ్చట రాగద్వేషములున్న అచ్చట 'స్వపర' భేదములున్నట్లు అవుతుంది. అంతా భైరవరూపమనుకుంటే రాగద్వేషాల అవసరం రాదు. కనుక భైరవదృష్టితో రాగద్వేషములు వదలినవానికి భైరవబ్రహ్మ సామరస్యము సిద్ధించును.

---

### ధారణ – 102

**124. శ్లో॥ యదవేద్యం యదగ్రాహ్యం యచ్ఛూన్యం యదభావగమ్।**
**తత్సర్వం భైరవం భావ్యం తదన్తే బోధసంభవః॥**

**ప్రతిపదార్థము:–** యత్ = ఏది, అవేద్యమ్ = తెలియనిదో, యత్ = ఏది, అగ్రాహ్యమ్ = గ్రహింపరానిదో, యత్ = ఏది, శూన్యమ్ = శూన్యమో, యత్ = ఏది, అభావగమ్ = అభావమునందున్నదో, తత్సర్వమ్ = అది అంతయు, భైరవమ్ = భైరవరూప మయినదిగా, భావ్యమ్ = భావింపదగినది. తదంతే = ఆ భావనయొక్క చివర, బోధ = భైరవజ్ఞానము యొక్క సంభవః = ఏర్పాటు జరుగును.

**భావము:–** ప్రపంచంలో ఏది ఉన్నా అది మనకు జ్ఞానశక్యమయినా, గ్రహణ శక్యమయినా, శూన్యమయినా, మిథ్య అయినా, అభావమయినా అభావంగల వస్తువు అయినా అంతా భైరవరూపమే అని భావనచేసిన తర్వాత భైరవ స్వరూపం సిద్ధించును.

---

## ధారణ – 103

**125. శ్లో॥ నిత్యే నిరాశ్రయే శూన్యే వ్యాపకే కలనోజ్ఝితే।**
**బాహ్యాకాశే మనః కృత్వా నిరాకాశం సమావిశేత్॥**

**ప్రతిపదార్థము:–** నిత్యే = నిత్య మయినదియు, నిరాశ్రమే = ఆదారరహితము, శూన్యే=శూన్యము, వ్యాపకే = సర్వవ్యాపకము, కలనా=సర్వవ్యాపారముచేత, ఉజ్ఝిత = వదలబడినదియు అగు, బాహ్యాకాశే = మామూలు ఆకాశము నందు, మనః =మనస్సును, కృత్వా = ధారణచేసి, నిరాకాశమ్ = ఆకాశరహితమయిన పరమాంకాశమును, సమావిశేత్ = పొందవచ్చును.

**భావము:–** మామూలు ఆకాశము మిగిలిన అన్ని పదార్థములకన్న నిత్యము. నిరాధారము శ్యూము, సర్వవ్యాప్తి వ్యాపారశూన్యము. ఇట్టి ఆకాశమునందు ధారణ చేయటంద్వారా ఆకాశతుల్యమైన పరబ్రహ్మమును పొందగలరు.

**'ఖం బ్రహ్మ'** అని శ్రుతి. **"ఆకాశస్తల్లింగాత్"** అని బ్రహ్మసూత్రము. వీటివలన పరమాకాశరూపమయిన భైరవరూపము సిద్ధించును.

---

## ధారణ – 104

**126. శ్లో॥ యత్ర యత్ర మనో యాతి తత్తత్ తేనైవ తత్క్షణమ్।**
**పరిత్యజ్యానవస్థిత్యా నిస్తరఙ్గస్తతో భవేత్॥**



**ప్రతిపదార్థము:–** యత్ర యత్ర = ఎక్కడదక్కడికి, మనః మనను, యాతి = పోవునో, తత్తత్ = ఆయా విషయము, తేనైవ = ఆ మనస్సుతోనే, తత్క్షణమ్ = ఆక్షణమే, అనవస్థిత్యా = అనవస్థచేత, పరిత్యజ్య = విడిచి, తతః= తర్వాత, నిస్తరంగః= తరంగరూపచలనము లేనివాడు, భవేత్ = అగును.

**భావము :–** మన మనస్సు ఎక్కడెక్కడకు పోతుందో ఆ విషయాలన్నింటిని తత్క్షణమ్ ఆ మనస్సుతో వదలుకొంటూ ముందరికి పోతే చివరకు సంకల్పతరంగాలులేని పరిస్థితి వస్తుంది. అప్పుడు భైరవీస్థితి ఏర్పడను.

---

## ధారణ – 105

**127. శ్లో॥ భయా సర్వం రవయతి సర్వదోవ్యాపకోఽఖిలే।**
**ఇతి భైరవశబ్దస్య సంతతోచ్చారణాచ్ఛివః॥**

**ప్రతిపదార్థము:–** భయా (భా) = తన ప్రకాశంతో చిత్తుతో, సర్వమ్ (ఐ) = సమస్తమును, రవయతి (రవ) = విమర్శించును, నాదముగలిగించును, ఇతి = అని, భయా (భా) = కాంతితో, సర్వమ్ (ఐ)= సమస్తమును, దః(రవ) = ఇచ్చువాడని, భయా (భా) = కాంతితో, అఖిలే (ఐ) సమస్తమునందు, వ్యాపకః (రవః) = వ్యాపించువాడు, ఇతి = అని, భైరవశబ్దస్య, "భైరవ" అను శబ్దము యొక్క సంతత= నిరంతరము, ఉచ్చారణాత్ = ఉచ్చరించుటవలన, శివః = శివుడు అగును.

**భావము:–** భా+ఐ+రవః అని విడదీయాలి. భా = అనగా చైతన్యం, ప్రకాశం, చిత్తు జ్ఞానం అని అర్థము. 'ఐ' అనగా సర్వము అని అర్థము 'రవ' అంటే మోగించు, వ్యాపించు, ఇచ్చు అని అర్థము.

---

## ధారణ – 106

**128. శ్లో॥ అహం మమేదమిత్యాది ప్రతిపత్తిప్రసఙ్గతః।**
**నిరాధారే మనో యాతి తద్ధ్యానప్రేరణచ్ఛమీ॥**

**ప్రతిపదార్థము:–** అహమ్ = నేను, ఇదమ్ = ఇది, మమ=నాది, ఇతి = అని, ఆది = మొదలుగాగల, ప్రతిపత్తి = జ్ఞానము యొక్క ప్రసంగతః = సంగమువలన లేదా అభ్యాసం వలన, మనః=మనస్సు, నిరాధారే = నిరాధారమయిన, అహం

లోనికి, యాతి = పోవును, తద్ధ్యాన = అట్టి ధారణయొక్క, ప్రేరణాత్ = ప్రేరణవలన, శమీ = శాంతుడగును.

**భావము :–** నేను, నాది అనే ఆలోచనలయొక్క అభ్యాసంవలన "నేను" అన్నదాని మీద నిలిచిన మనస్సు నిరాధారమయి, చివరకు నిర్వికల్పమయిన పూర్ణాహంత లోనికి చేరి శాంతి పొందును.

---

## ధారణ – 107

**129. శ్లో॥ నిత్యో విభుర్నిరాధారః వ్యాపకశ్చాఖిలాధిపః**
**శబ్దాన్ ప్రతిక్షణం ధ్యాయన్ కృతార్థోఽ ర్థానురూపతః॥**

**ప్రతిపదార్థము:–** నిత్యః = నిత్యుడు, విభుః = ప్రభువు, నిరాధారః= స్వయం ప్రతిష్టితుడు / ఇతరాధారం అవసరంలేనివాడు, వ్యాపకః = సర్వవ్యాప్తి గలవాడు, అఖిల = సర్వమునకును, అధిపః = అధిపతి, శబ్దాన్ = పరమేశ్వర పరిచాయ కములయిన యీ శబ్దములను, ప్రతిక్షణమ్ = ప్రతినిమిషము, అర్థానురూపతః, అర్థానికి తగినట్లుగా, ధ్యాయన్=భావన/ ధారణ చేయుచు, కృతార్థః= కృతకృత్యు డగును.

**భావము:–** భగవంతునికి సంబంధించిన ముఖ్య విశేషణములయిన నిత్యుడు విభువు, నిరాధారుడు, సచ్చిదానందుడు అనంతుడు, విశ్వోత్తీర్ణుడు మొ॥ వాటిని ప్రతిక్షణము ధ్యానించుచు ధారణ చేసినచో కృతకృత్యుడు కాగలడు. అయితే ఈ ధారణ ఆ పదాల అర్థాలనుబట్టి మననంగా కొనసాగాలి. కేవలం పదాలను పూజించుటకాదు.

---

## ధారణ – 108

**130. శ్లో॥ అతత్త్వమిన్ద్రజాలాభమిదం సర్వమవస్థితమ్।**
**కిం తత్త్వమిన్ద్రజాలస్య ఇతి దార్ఢ్యాత్ శమం వ్రజేత్॥**

**ప్రతిపదార్థము:–** ఇదమ్=ఈ, సర్వమ్=సమస్త దృశ్య ప్రపంచము అతత్త్వమ్ = సొంతమూలతత్వము గలదికాదు. ఇంద్రజాలాభమ్ = గారడీ వంటిదిగా, అవస్థితమ్ = ఉన్నది. ఇంద్రజాలస్య = గారడీయొక్క తత్త్వమ్ = తత్త్వము, కిమ్ = ఏమి



అనగా వాస్తవత్త్వము లేదు కేవలం మాయ). ఇతి = అని, దార్ఢ్యాత్ = దృఢభావనవలన, శమమ్ = శాంతిని, వ్రజేత్ = పొందవలెను.

**భావము :–** ఈ కనబడుచున్న ప్రపంచమంతా సొంత నిజతత్వము సారము మూలపదార్థము లేని ఇంద్రజాలమే. ఇదంతా మాయ. ఇంద్రజాలానికి దానిదృశ్యములకు అనగా ఏ తత్త్వమూలేదు. కేవలం మాయయే. తత్త్వం భైరవస్వరూపమే అని భావన చేయడం వలన శాంతి కలుగును.

---

## ధారణ – 109

**131. శ్లో॥ ఆత్మనో నిర్వికారస్య క్వ? జ్ఞానం క్వచ? వా క్రియా।**
**జ్ఞానయత్తా బహిర్భావా అతఃశూన్యమిదం జగత్॥**

**ప్రతిపదార్థము:–** నిర్వికారస్య = వికారహితుడయిన, ఆత్మనః = పరమాత్మకు, చైతన్యమునకు, జ్ఞానమ్ = జ్ఞానము, క్వ = ఎక్కడిది? క్రియా వా = క్రియగాని, క్వ = ఎక్కడిది, బహిర్భావాః=బాహ్యపదార్థములు, జ్ఞానయత్తాః = జ్ఞానమువల కలిగేవి, వాస్తవములుకావు, అతః= అందువలన, ఇదమ్ = ఈ, జగత్ = ప్రపంచము, శూన్యమ్ = శూన్యమయినది. అని భావన చేయువారికి భైరవదశ సిద్ధించును.

**భావము:–** ఆత్మ నిర్వికారమయినది. ఎటువంటి మార్పు గుణం వ్యాపారము పని లేదు. అట్టి ఆత్మకు జ్ఞానము క్రియ అనుకొనడం భ్రాంతి. నేను 'ఆత్మ'నే. నిర్వికారుడను. ఈ ప్రపంచమంతా మన ఇంద్రియజ్ఞానం మీద ఆధారపడిన అస్తిత్వంగలది. కనుక నామరూపములే ప్రపంచము. ఇవి మిథ్యలు. కనుక ప్రపంచము శూన్యము. కనుక మూలతత్త్వమయిన భైరవము సత్యము నిత్యము అని భావన చేసిన వారికి పరమపురుషార్థసిద్ధి.

---

## ధారణ – 110

**132. శ్లో॥ న మే బన్ధో న మోక్షో మే భీతస్యైతా విభీషికాః।**
**ప్రతిబిమ్బమిదం బుద్ధేః జలేష్వివ వివస్వతః॥**

**ప్రతిపదార్థము:–** మే = నాకు, బంధమ్ = సంసారబంధము, న = లేదు, మే = నాకు, మోక్షః = మోక్షము, న = లేదు, ఏతాః = ఈ బంధమోక్షాలు, భీతస్య = ద్వైత భయం గలవానికి, బిభీషికాః = బెదిరింపులు, ఇదమ్ = ద్వైత భావంగల ఈ తత్త్వము, బుద్దేః = జ్ఞానం యొక్క ప్రతిబింబమ్ = ప్రతిబింబము, జలేషు = నీటియందు, వివస్వతః = సూర్యునియొక్క ప్రతిబింబమివ = ప్రతిబింబము వంటిది.

**భావము :–** నేను జ్ఞానస్వరూపం. పరమాత్మను అఖండమయిన ఏకపదార్థమును. నాకు బంధమూ లేదు. మోక్షమూలేదు. ఇవన్నీ భయపడే జీవునకు బెదరింపులు. సుఖదుఃఖాలను అనుభవించే బాధ పడేది ఆ జ్ఞానముయొక్క ప్రతిబింబమయిన జీవుడే. అది ఎలా అంటే. సూర్యుని ప్రతిబింబము నీళ్లలో పడుతుంది. అందుచేత నీటికదలికలు, మురికి అలలు ఇవన్నీ ప్రతిబింబాన్ని కదలిస్తాయి. సూర్యుని కదలించవు. ఆత్మ అనగా నేను సూర్యుని వంటివాడను. నా ప్రతిబింబము ఈ బుద్ధి అనబడు అవిద్య. తానే పదార్థాలలో శరీరంలోను ప్రతిబింబించి శుఖదుః ఖాదులు, అనుభవించుతున్నది. అని భావన చేసినవానికి భైరవసామరస్యం వచ్చును.

---

## ధారణ – 111

133. శ్లో॥ ఇన్ద్రియద్వారకం సర్వం సుఖదుఃఖాదిసఙ్గమమ్।
ఇతీంద్రియాణి సంత్యజ్య స్వస్థః స్వాత్మని వర్తతే॥

**ప్రతిపదార్థము:–** సుఖదుఃఖాది = సుఖదుఃఖములు మొదలగువాని యొక్క, సంగమమ్ = కలయిక, సర్వమ్ = అంతయు, ఇంద్రియ = ఇంద్రియములే, ద్వారకమ్ = ద్వారముగలది, ఇతి = అని, ఇంద్రియాణి = ఇంద్రియాలను, సంత్యజ్య = వదలి, స్వస్థః = ఆత్మనిష్ఠుడై, స్వాత్మని = తనయందే, వర్తతే = ఉండును.

**భావము :–** సమస్త సుఖదుఃఖాలు ఇంద్రియాల వలననే వచ్చినవి. కనుక ఇంద్రియ వ్యాపారాలను వదలి ఆత్మరూప దర్శనము మనస్సున నిలిపినచో భైరవరూపము స్వాత్మయందు నిలచును.

---

## ధారణ – 112

134. శ్లో॥ జ్ఞానప్రకాశకం సర్వం సర్వేణాత్మా ప్రకాశకః।
ఏకమేకస్వభావత్వాత్ జ్ఞానం జ్ఞేయం విభావ్యతే ॥





**ప్రతిపదార్థము:–** సర్వమ్ = ఈ సర్వప్రపంచము, జ్ఞాన = జ్ఞానమునకు, ప్రకాశకమ్ = ప్రకాశింప జేయునది. సర్వేణ = ఈ విశ్వముచేతనే, ఆత్మా = ఆత్మ, ప్రకాశకః = ప్రకాశింపజేయునది అయినది. ఏక = ఒక, స్వభావత్వాత్ = ప్రకాశక స్వభావముగలవగుట వలన, జ్ఞానమ్ = జ్ఞానము, జ్ఞేయమ్ = జ్ఞేయము, ఏకమ్ = ఒక్కటిగా, విభావ్యతే = ధారణ చేయబడును.

**భావము :–** ఈ ప్రపంచమంతయు జ్ఞానానికి ప్రకాశకం అనగా తమ నశ్యత్వము, మిథ్యాతత్వము, ఉదాహరణోపయోగిత. వీటి వలనను, అలానే ఇంతకు ముందు చెప్పిన ధారణల వలన గూడా ఈ ప్రపంచము జ్ఞానప్రకాశము. అట్లే ఈ ప్రపంచముండటం వలననే ఆత్మ ప్రకాశకంగా మారింది. ప్రపంచం లేకపోతే ప్రకాశింపజేయటం ఉండదు. కనుక ప్రకాశకం అని అనలేము కనుక "బ్రహ్మమునకు విశ్వము, విశ్వము నకు బ్రహ్మం" ప్రకాశకములయినవి. కనుక జ్ఞానం (బ్రహ్మ) జ్ఞేయం (విశ్వం) – ఈ రెండు ఒకే ప్రకాశకస్వభావముగలవి కావడం వలన 'సర్వం బ్రహ్మ' అని భావన చేసినచో, ఆ ధారణవలన భైరవీదశ అబ్బును.

---

## భావనాతత్త్వము

135. శ్లో॥ మానసం చేతనా శక్తిరాత్మా చేతి చతుష్టయమ్
యధా ప్రియే పరిక్షీణం తధా తత్భైరవం వపుః॥

**ప్రతిపదార్థము:–** ప్రియే = ప్రియపార్వతీ!, మానసమ్ = మనస్సు, చేతనా=బుద్ధి, శక్తిః = ప్రాణశక్తి, ఆత్మా = చిదాభాసుడు / జీవుడు, యధా = ఏ విధముగా, పరిక్షీణమ్ = తగ్గుతుందో, తధా = అట్లే, తత్ = ఆ, వపుః = శరీరము, భైరవమ్ = భైరవముగా కీరును.

**భావము :–** మనస్సు, బుద్ధి, ప్రాణశక్తి, జీవుడు అనగా పరిమిత ప్రమాత అయిన చిదాభాసుడు / ఆభాస జీవుడు – ఈ '4' ఎలా ఎంత తగ్గుతాయో, అలా అంతగా సాధకునకు భైరవత్వము కలుగును. ఈ భావనలన్నింటిలోని తత్త్వమిదే. దీని యందు భావనకు ఆధారస్థలం చెప్పలేదు. కనుక ఇది ఈ భావనలన్నింటికి మూలతత్త్వం.

---

**136. శ్లో॥ నిస్తరఙ్గోపదేశానాం శతముక్తం సమాసతః**
**ద్వాదశాభ్యధికం దేవి! యత్ జ్ఞాత్వా జ్ఞానవిజ్జనః॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = పార్వతీ!, యత్ = దేనిని, జ్ఞాత్వా = ఎరిగి, జనః = వ్యక్తి, జ్ఞానవిత్ = జ్ఞాని అవుతాడో, తత్ = అటువంటి, నిస్తరంగ = స్థిరభావనకు సంబంధించిన, ఉపదేశానామ్ = ధారణామంత్రములయొక్క, ద్వాదశాభ్యధికమ్ = 12 ఎక్కవగాగల, శతమ్ = వంద, సమాసతః = మొత్తంగా, ఉక్తమ్ = చెప్పబడినది.

**భావము:–** దేవీ! ఈవిధంగా 112 ధారణలను ఉపదేశించాను. ఇవి నిస్తరంగాలు. అనగా స్థిరంగా చేయదగినవి. వీటి వలన సాధకుడు జ్ఞాని కాగలడు.

**137. శ్లో॥ అత్ర చైకతమే యుక్తః జాయతే భైరవః స్వయమ్।**
**వాచా కరోతి కర్మాణి శాపానుగ్రహకారకః॥**

**ప్రతిపదార్థము:–** అత్ర = ఈ భావనలతో, ఏకతమేచ = ఒక్కదానియందయినను, యుక్తః = యోగధారణలోనున్నవాడు, స్వయమ్ = స్వయంగా, భైరవః = భైరవుడు, జాయతే = అగును, శాపానుగ్రహ = శాపానుగ్రహములను, కారకః=చేయగల అతడు, వాచా = వాక్కుతో, కర్మాణి = పనులను, కరోతి = చేయును.

**భావము :–** ఈ భావనలు 112లో ఒక్క ధారణ మీద స్థిరంగా నిలిచినా సాధకుడు శాపానుగ్రహసమర్థుడైన భైరవరూపుడు కాగలడు. వాక్కుతో సర్వకార్యములను నెరవేర్చగలడు.

---

**138. శ్లో॥ అజరామరతామేతి సోఽణిమాదిగుణైర్యుతః।**
**యోగినీనాం ప్రియో దేవి సర్వమేలాపకాధిపః॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = పార్వతీ!, సః=అట్టిసాధకుడు, అణిమాది = అణిమ మొదలగు, గుణైః = గుణములతో, యుతః = కూడిన వాడై, యోగినీనామ్ = యోగినులకు, ప్రియః= ప్రియమైనవాడై, సర్వ = సమస్తమయిన, మేలాపక = సిద్ధ యోగినీ సమూహమునకు, అధిపః = అధిపతియై, అజరామరతామ్ = జరామరణరాహిత్యమును, ఏతి = పొందును.





**భావము:–** అట్టి సాధకుడు అణిమాది అష్టసిద్ధులు పొందును. యోగినులకు ప్రమేయమయిన వాడగును. సమస్త సిద్ధసమూహమునకు అధిపతి అగును. జరామరణములు లేని చిరంజీవి అగును.

---

**139. శ్లో॥ జీవన్నపి విముక్తోఽసౌ కుర్వన్నపి న లిప్యతే।**

**ప్రతిపదార్థము:–** అసౌ = ఇతడు, జీవన్నపి = జీవించి యున్నను, విముక్తః = ముక్తుడగును, కుర్వన్నపి = ఏమి చేయుచున్నను, న లిప్యతే = కర్మ ఫలముచేత అంటుకొనబడడు.

**భావము :–** అతడే జీవన్ముక్తుడు అసంగుడు కర్మఫలరహితుడగును.

---

**శ్రీ భైరవీ ఉవాచ – శ్రీ భైరవి యిట్లనెను.**

**ఇదం యది వపుర్దేవ! పరాయాశ్చ మహేశ్వర॥**

**140. శ్లో॥ ఏవముక్తవ్యవస్థాయాం జప్యతే కో జపశ్చ కః?**
**ధ్యాయతే కో? మహాదేవ! పూజ్యతే! కశ్చ? తృప్యతి॥**

**141. శ్లో॥ హూయతే కస్య వా? హోమః యాగక్షేత్రాది కిం కథమ్॥**

**ప్రతిపదార్థము:–** దేవ! దేవా!, మహేశ్వర = ఈశ్వరా!, మహాదేవ = మహాదేవా!, పరాయాశ్చ = పరాశక్తికి, వపుః = శరీరం, ఇదం యది = ఇదే అయితే, ఏవమ్ = ఈ విధంగా, ఉక్త = చెప్పబడిన, వ్యవస్థాయామ్ = వ్యవస్థలో, కః = ఎవడు, జప్యతే = జపింపబడును. జపశ్చ = జపమయినా, కః = ఏది? లేదా జపః = జపముచేయువాడు, కః = ఎవడు?, కః = ఎవడు, ధ్యాయతే = ధ్యానము చేయును? పూజ్యతే = పూజింపబడును? కశ్చ = ఎవడు, తృప్యతి = తృప్తి చెందును? కస్య వా = ఎవరి యొక్క, హోమః = హోమము, హూయతే = హుతం చేయబడును?, యాగ = యజ్ఞము, క్షేత్రాది = క్షేత్రము మొదలగునవి, కిమ్ = ఏమిటి?, కథమ్ = ఎట్లు?.

**భావము:–** పరమేశ్వరా! పరాశక్తి సర్వమయమయితే, అఖండపదార్థమయితే, దృశ్యభిన్న ప్రపంచం మిధ్య అయితే అంతా 'భైరవీదశ' అయితే ఇక, దేవా! జపధ్యాన పూజాహోమాదులకు కర్త ఎవడు? కర్మ ఏమి? యాగం, తీర్థ క్షేత్రాది పర్యటన

క్రియ ఏమిటి? ఎలా? ఎందుకు? అంతా ఒక్కటే! భేదం అంతా మిథ్య అయితే ఇంతే గదా! అని అమ్మవారు అయ్యవారిని ప్రశ్నించింది.

---

**శ్రీ భైరవ ఉవాచ - శ్రీ భైరవు డిట్లనెను.**

**141. శ్లో॥ ఏషాత్ర ప్రక్రియా బాహ్యా స్థూలేష్వేవ మృగేక్షణే!**

**142. శ్లో॥ భూయో భూయః పరో భావే భావనా భావ్యతే హి యా।**
**జపస్సోఽత్ర స్వయం నాదః మంత్రాత్మా జప్య ఈదృశః॥**

**ప్రతిపదార్థము:-** మృగేక్షణే = మృగలోచనా!, ఏషా = ఇంతవఱకు నీవడిగిన జపపూజాదికమయిన, ప్రక్రియా = ప్రక్రియ, బాహ్యా = బాహ్యదృష్టికి సంబంధించినది. స్థూలేష్వేవ = స్థూలమయిన వాటియందే చేయదగినది. భూయో భూయః = మాటిమాటికి, పరే = పరమయిన, భావే = భావమునందు, యా = ఏ, భావనా = భావన, భావ్యతే = భావింపబడుచున్నదో, సః = అదే, అత్ర = ఈ సర్వాత్మభావంలో, జపః = జపము, మంత్రాత్మ = మంత్రరూపమున, స్వయంనాదః = స్వయంగా వినబడే ప్రాణనాదము , ఈదృశః=ఇటువంటి (విలక్షణమయిన జపానికి తగ్గది), జప్యః = జపింపదగిన విషయము.

**భావము:-** దేవీ! మృగలోచనా! జపపూజాదికాలని నీవడిగిన వన్నియు బాహ్యమయినవి. స్థూలదృష్టిలో చేయవలసినవి. కాని యిందులో జపమంటే మాటిమాటికి తన పరమాత్మ భావమును భావన చేయడమే. జపం చేయవలసి మంత్రం గూడా ఇట్టిదే. స్వయంగా ఏర్పడిన (అనాహంత) ప్రాణనాదమే మంత్రము. దానినే అనుసంధానం చేయవలయును.

---

**143. శ్లో॥ ధ్యానం హి నిశ్చలా బుద్ధిః నిరాకారా నిరాశ్రయా।**
**న తు ధ్యానం శరీరాక్షిముఖహస్తాదికల్పనా॥**

**ప్రతిపదార్థము:-** ధ్యానమ్ = ఈ ప్రక్రియలో ధ్యానము గూడా, నిరాకారా = ఆకారరహితము, నిరాశ్రయా = ఆధారరహితము, నిశ్చలా = అచంచలము అయిన, బుద్ధిః = బుద్ధియే / జ్ఞానమే. శరీర = శరీరము, అక్ష = కన్నులు, ముఖ = నోరు





/ మొగము, హస్త+ఆది = చేతులు మొదలగువాని యొక్క, కల్పనా తు = కల్పన అయితే, ధ్యానమ్ = ధ్యానము, న=కాదు.

**భావము:-** ఈ ఆధ్యాత్మిక ప్రక్రియలో అఖండ భైరవ భావనలో ధ్యానం అంటే నిరాకారము నిర్వికారము, నిరాశ్రయము అయిన అచంచల బుద్ధియే ధ్యానము. అంతేగాని, ఆకార, అవయవాలను ధ్యానించటం ధ్యానమే కాదు.

---

**144. శ్లో॥ పూజా నామ న పుష్పాద్యైః యా మతిః క్రియతే దృఢా**
**నిర్వికల్పే పరే వ్యోమ్ని సా పూజా హ్యాదరాల్లయః॥**

**ప్రతిపదార్థము:-** పూజా నామ = పూజ అనగా, పుష్పాద్యైః = పూలు మొదలగువాటిచేత, న = కాదు, నిర్వికల్పే = వికల్పరహితుడయిన, పరే = పరమమయిన, వ్యోమ్ని = ఆకాశ రూపుడయిన పరమాత్మయందు, యా = ఏ, మతిః = బుద్ధి, దృఢా = స్థిరముగా, క్రియతే = చేయబడునో, సా = అది, పూజా హి = పూజగదా!, ఆదరాత్ = ఆదరం వలన, లయః = లీనమగును.

**భావము:-**ఈ ప్రక్రియలో పూజ అంటే పూలతోచేసే అర్చనకాదు. నిర్వికల్ప పరమాకాశరూప భైరవతత్త్వము నందు దృఢధారణచేసి అందు లయమగుటయే పూజ.

---

**145. శ్లో॥ అత్రైకతమయుక్తిస్థే యోత్పద్యేత దినాద్దినమ్।**
**భరితాకారతా సాత్ర తృప్తిరత్యన్తపూర్ణతా॥**

**ప్రతిపదార్థము:-** అత్ర = ఈ ధారణలలో, ఏకతమ = ఒక, యుక్తి = యోగమునందు, స్థే = ఉన్న సాధకునియందు, దినాద్దినమ్ = రోజురోజుకు, యా = ఏ, భరితాకారతా = పూర్ణస్థితి, ఉత్పద్యేత = పుట్టునో, సా = ఆ, అత్యంతపూర్ణతా = పరిపూర్ణతయే, అత్ర = ఈ ప్రక్రియలో, తృప్తిః = తృప్తి అనబడును.

**భావము:-** ఈ 112 ధారణలలో ఒక ధారణలోనయినా దృఢంగా ఉన్నవానికి రోజు రోజుకూ ఒక పూర్ణాకారమయిన దశ పెరిగి నిలుస్తుంది. అదే భరితావస్థ, పూర్ణాహంత. అదే యీ భూమికలో తృప్తి.

---

**146. శ్లో॥ మహాశూన్యాలయే వహ్నౌ భూతాక్షవిషయాదికమ్।**
**హూయతే మనసా సార్ధం స హోమశ్చేతనాస్రుచా॥**

**ప్రతిపదార్థము:–** మహాశూన్యాలయే = మహాశూన్యస్థానమయిన భైరవతత్త్వమనెడి, వహ్నౌ = అగ్నియందు, భూత = పంచభూత సంబంధి విషయములు, అక్షవిషయ = ఇంద్రియవిషయములు, అధికమ్ = మొదలుగాగల పదార్థము, మనసా సార్ధమ్ = మనస్సుతో సహా, చేతనాస్రుచా = బుద్ధి అనే స్రుక్కుతో, హూయతే = హోమము చేయబడునో, సః = అదే, హోమః = హోమము.

భావము:– మహాశూన్యమయిన భైరవస్థానమే అగ్ని, ఇంద్రియసంబంధి పాంచభౌతిక పదార్థములన్నియు శూన్యమనే భావనతో ఇంద్రియసారథి అయిన మనస్సుతో సహా బుద్ధి అనే స్రుక్కుతో హోమము చేయవలయును అంటే సమస్త విషయాలు, ఇంద్రియాలు అన్ని శూన్యములన్న భావనతో సర్వమూలతత్వమయిన భైరవుని యందు మనసుతో సహా బుద్ధిపూర్వకంగా వాటిని త్యజించాలి. సర్వం భైరవార్పణం, భైరవమయం.

**147. శ్లో॥ యాగోఽత్ర పరమేశాని తుష్టిరానన్దలక్షణా**
**క్షపణాత్సర్వపాపానాం త్రాణాత్ సర్వస్య పార్వతి!**

**148. శ్లో॥ రుద్రశక్తిసమావేశః తత్క్షేత్రం భావనా పరా**
**అన్యథా తస్య తత్త్వస్య కా? పూజా కశ్చ? తృప్యతి॥**

**ప్రతిపదార్థము:–** పరమేశాని! = పరమేశ్వరి!, ఆనందలక్షణా = ఆనంద స్వరూపమయిన, తుష్టిః = సంతోషము, అత్ర = ఈ ప్రక్రియలో, యాగః = యజ్ఞము, పార్వతి! = పార్వతీ!, సర్వ = సమస్తమయిన, పాపానామ్ = పాపములయొక్క, క్షపణాత్ = నాశనము వలన, సర్వస్య = ప్రతి ఒక్కనియొక్క, త్రాణాత్ = రక్షణవలన, రుద్రశక్తి = రుద్రశక్తితో అనగా చిత్ / ఆనందశక్తితో, సమావేశః = కలయిక అనబడే, పరా = పరమయిన, భావనా = భావనయే, తత్ = సాధకులయొక్క, క్షేత్రమ్ = క్షేత్రము, అన్యథా = లేనిచో, తస్య = ఆ, తత్త్వస్య = తత్త్వమునకు, పూజా = పూజ, కా = ఏమి? కశ్చ = ఎవడు, తృప్యతి = తృప్తిచెందును.

**భావము:–** పరమేశ్వరీ! ఈ ప్రక్రియలో ఆనంద స్వరూపమయిన తుష్టియే యాగము. అలాగే రుద్రశక్తితో సమావేశమయ్యే పరమభావనయే క్షేత్రము. క్షేత్రము అంటే



సర్వపాపాలను క్షయం చేసేది. సర్వసాధకులను త్రాణం – రక్షణ చేసేది అని అర్థం. అట్టిశక్తి సాధారణ క్షేత్రాలకన్నా పరమభావనకే ఉన్నది. రూపరహిత సర్వవ్యాపి – అయిన ఆ తత్త్వమునకు పూజ ఏమిటి? స్వయం పూర్ణుడయిన ఆ భైరవుడు కొత్తగా తృప్తిజెందటం ఏమిటి?

---

**149. శ్లో॥ స్వతంత్రానన్దచిన్మాత్రసారః స్వాత్మా హి సర్వతః।**
**ఆవేశనం తత్స్వరూపే స్వాత్మనః స్నానమీరితమ్॥**

**ప్రతిపదార్థము:–** సర్వతః = అన్నివైపులా, స్వతంత్ర = స్వతంత్రమయిన, ఆనంద = ఆనంద స్వరూపమయిన, చిన్మాత్ర = జ్ఞానమాత్రమే, సారః = స్వరూపముగాగల, స్వాత్మా హి = తన ఆత్మయే ఉన్నదిగదా!, స్వాత్మనః = తన ఆత్మకు, తత్స్వరూపే = దాని స్వస్వరూపమునందు, ఆవేశనమ్ = కలిపి వేయటమే, స్నానమ్ = స్నానముగా, ఈరితమ్ = చెప్పబడినది.

**భావము:–** స్వతంత్రమయిన చిదానందమూర్తి అయిన ఆత్మరూపము సర్వత్ర వ్యాపించియే యున్నది. మన ఆత్మగూడా అదే తప్ప వేరుగాదని స్వస్వరూపం అనుసంధానం చేయటమే స్నానము.

---

**150. శ్లో॥ యైరేవ పూజ్యతే ద్రవ్యైః తర్ప్యతే వా పరాపరః।**
**యశ్చైవ పూజకస్సర్వః స ఏవైకః క్వ? పూజనమ్॥**

**ప్రతిపదార్థము:–** పరాపరః = పరాపర స్వరూపుడయిన భైరవుడు, యైః = ఏ, ద్రవ్యైరేవ = పదార్థములచేత, పూజ్యతే = పూజచేయబడునో, తర్ప్యతే వా = సంతృప్తి చేయబడునో, యశ్చైవ = ఏ, పూజకః = పూజించు, సర్వః = ప్రతివ్యక్తి గలడో వారందరు, సః = ఆ, ఏక ఏవ = ఒక్కడే, పూజనమ్ = పూజ, క్వ = ఎక్కడ?

**భావము:–** ఏ పూజాద్రవ్యముతో పూజిస్తామో అవి ఆ పరాపరుడు. ఏ పదార్థములతో ఆయనకు తృప్తి కలిగించాలనుకొంటామో అవి ఆ పరాపరుడే. అసలు పూజించేవాడు గూడా ఆ భైరవుడే. అసలు ఆయనొక్కడే అంతా. ఇక పూజ ఎక్కడ? ఎవరికి?

---

**151. శ్లో॥ వ్రజేత్ప్రాణో విశేజ్జీవః ఇచ్ఛయా కుటిలాకృతిః।**
**దీర్ఘాత్మా సా మహాదేవీ పరం క్షేత్రం పరాపరా॥**

**ప్రతిపదార్థము:–** యస్యాః = ఏ దేవతయొక్క, ఇచ్ఛయా = సంకల్పంచేత, ప్రాణః = ప్రాణము, వ్రజేత్ = నడచునో, జీవః= అపానరూపజీవుడు, విశేత్ = ప్రవేశించునో, సా = ఆ, ఇచ్ఛయా = తన సంకల్పంచేతనే, కుటిల 3 1/2 చుట్లు తిరిగిన, ఆకృతిః = ఆకారముగలదియు, దీర్ఘాత్మా = పొడవుగా అయిన స్వరూపముగలదియు, అగు, మహాదేవీ = కుండలినీ రూపభైరవి, పరమ్ = గొప్ప, క్షేత్రమ్ = పుణ్యక్షేత్రము, పరాపరా = పరం అపరము 2 తన స్వరూపముగా గలది.

**భావము:–** పరమయిన దివ్యలోకము అవసరమయిన అధోలోకాది విషయాలు '2' తన స్వరూపమే అయిన భైరవీశక్తి మన శరీరమునందు స్వేచ్ఛగా 3 1/2 వంపులు తిరిగినది. ఇచ్ఛతోనే వంకర తిరిగినది. ఇచ్ఛతోనే దీర్ఘంగా సాగగలదు. వంకరగా ఉంటే అపర స్వరూపము. దీర్ఘాత్మ అయితే పరస్వరూపము. ఆమె సంకల్పం వలననే ప్రాణము నడుస్తుంది. ఆమె ఇచ్ఛతోనే జీవుడులోనికి ప్రవేశించును. అట్టి కుండలినీ మహాదేవి సుషుమ్నాంతఃపురపు మహారాణి. ఆమెయే పరమ దివ్యక్షేత్రము.

---

**152. శ్లో॥ అస్యామనుచరంస్తిష్ఠన్ మహానన్దమయేఽధ్వరే।**
**తయా దేవ్యా సమావిష్టః పరం భైరవమాప్నుయాత్॥**

**ప్రతిపదార్థము:–** అస్యామ్ = ఈ మహాదేవియందు, తిష్ఠన్ = ఉంటూ, అనుచరన్ = అనుసరించి తిరుగుతూ, తయా = ఆ, దేవ్యా = దేవితో, మహానందమయే = 'సోహం' అనే అజపారూపమయిన ఆనందకరమయిన, అధ్వరే = హంసయాగము నందు, సమావిష్టః = కలిసినవాడై, పరమ్ = పరమయిన, భైరవమ్ = భైరవుని, ఆప్నుయాత్ = పొందవలయును.

**భావము:–** మహానందమయమయిన ఈ హంసయాగమున లేదా ఈ జ్ఞానయాగమున ఆ మహాదేవియందు లీనుడై ఏకాత్మభావమున అనుసరించుచూ ఆమెయందే కలిసి ఉండి పరమభైరవుని పొందవచ్చును.

---





**153. శ్లో॥ సకారేణ బహిర్యాతి హకారేణ విశేత్పునః।**
**హంసహంసేత్యముం మంత్రం జీవో జపతి నిత్యశః॥**

**ప్రతిపదార్థము:–** సకారేణ = 'స' అనే అక్షరంతో, జీవః = జీవుడు, బహిః = బయటకు, యాతి = పోవును. పునః = మఱల, హకారేణ = హకారముతో, విశేత్ = లోనికి వచ్చును. 'హంస హంస' = 'హం – స, హం –స', ఇతి = అను, అముమ్ = ఈ, మంత్రమ్ = మంత్రమును, జీవః = జీవుడు, నిత్యశః = నిత్యము, జపతి = జపించును.

**భావము:–** సోఽహం సోఽహం అనే దానిని అనగా అనగా 'హంసో హంసో' అని వినబడుతుంది. అందువలన దీనిని గోప్యంగా 'హంస' అన్నారు. అనగా 'శ్వాస' అని అర్థము. ఇందులో బయటకు పోవుగాలిని 'స' అని, లోపలకి వచ్చుగాలిని 'హ' అని సంకేతం. (కొన్నిచోట్ల ఇది తలక్రిందులుగా ఉన్నది.) ఈ హంస మంత్రాన్ని "ఉచ్ఛ్వాస నిశ్వాసలు"రూపంలో జీవుడు ప్రతిక్షణము జపించుచున్నాడు.

---

**154. శ్లో॥ షట్శతాని దివా రాత్రౌ సహస్రాణ్యేకవింశతిః।**
**జపో దేవ్యా స ముద్దిష్టః ప్రాణస్యాన్తే సుదుర్లభః॥**

**ప్రతిపదార్థము:–** దివా = పగలు, రాత్రౌ = రాత్రియందు, షట్శతాని = 600, సహస్రాణి = వేలు, ఏకవింశతి = 21, అనగా 21600సార్లు, జపః = సోఽహం సోఽహం (హంసో హంసో) అనే హంసజపము, దేవ్యా = కుండలినీదేవిచేత, సముద్దిష్టః = ఉద్దేశింపబడినది. ప్రాణస్య = ప్రాణముయొక్క, అంతే = చివర అనగా మరణం తర్వాత, ఈ జపము, సుదుర్లభః = మిక్కిలి అలభ్యము.

**భావము:–** ఈ జపము ప్రతిరోజు రాత్రి పగలు 21,600సార్లు ఈ జపము సాగును. ఇది హంస జపము. ఇదే కుండలినీ జపము. ఈ జపము జీవితకాలంలోనే సాధ్యము. మరణంతో ఇది అలభ్యము.

---

**155. శ్లో॥ ఇత్యేతత్కథితం దేవి! పరమామృతముత్తమమ్।**
**ఏతచ్చ నైవ కస్యాపి ప్రకాశ్యం తు కదాచన॥**

**156. శ్లో॥ పరశిష్యే ఖలే క్రూరే చాభక్తే గురుపాదయోః॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = పార్వతీ!, ఇతి = ఈవిధంగా, కథితమ్ = చెప్పబడిన, ఏతత్ = ఈ విషయము, పరమ = పరమయిన, అమృతమ్ = అమృతము. ఉత్తమమ్ = ఉత్తమమయినది. కస్యాపి = ఎవనికయినా, కదాచన =ఎప్పుడయినా, ఏతచ్చ = ఇది, నైవ ప్రకాశ్యం తు = ప్రకటింపదగినది కాదు. పరశిష్యే = ఇతరుల శిష్యునియందు, ఖలే = దుష్టునియందు, క్రూరే = క్రూరునియందు, గురుపాదయోః = గురుపదములందు, అభక్తే = భక్తుడు కాని వానియందు, న ప్రకాశ్యమ్ = ప్రకటింపదగినది కాదు.

**భావము:–** దేవీ! ఇపుడు నీకు చెప్పినదంతయు పరమపీయూషము. దీనిని ఎవ్వరికిని, ఎప్పుడును చెప్పరాదు. ముఖ్యంగా ఇతర గురువుల శిష్యులకు, అనగా సాంప్రదాయేతరునకు, దుష్టునకు, క్రూరునకు, గురుపాదభక్తిలేని వానికి చెప్పరాదు. ఈ శాస్త్రం విషయం తెలిసికొనటానికి మాత్రమే వాడు వస్తాడు. అతనికి ఇతర సంప్రదాయ భక్తి ఉంటుంది. దీన్ని తెలిసికొనటానికి విమర్శించటానికి అతను వస్తాడు. జిజ్ఞాసతో గాక కేవలం పండితుడనిపించుకొనటానికి అన్నింట్లో వేలు పెట్టే ఇట్టివాడిని "చుంబకుడు" అంటారు. అట్టి చుంబకులకున్ను చెప్పరాదు.

---

**నిర్వికల్పమతీనాం తు వీరాణామున్నతాత్మనామ్॥**

**157. శ్లో॥ భక్తానాం గురువర్గస్య దాతవ్యం నిర్విశఙ్కయా॥**

**ప్రతిపదార్థము:–** నిర్వికల్పమతీనాం తు = వికల్ప (సందేహం) రహిత బుద్ధిగలవారికి, ఉన్నతాత్మనామ్ = ఉన్నతమానసులకు, వీరాణామ్ = జితేంద్రియులకు, గురువర్యస్య = గురునియొక్క, భక్తానామ్ = భక్తులయిన శిష్యులకు, నిర్విశంకయా = నిస్సందేహంగా, దాతవ్యమ్ = ఇవ్వదగును.

**భావము:–** వీరులు అనగా జితేంద్రియులు, నిశ్శంకులు, ఉన్నతమానసులు అయిన గురుభక్తులకు నిరాక్షేపపణగా ఇవ్వవచ్చును.

---

**గ్రామం రాజ్యం పురం దేశః పుత్రదారకుటుమ్బకమ్॥**

**158. శ్లో॥ సర్వమేతత్పరిత్యజ్య గ్రాహ్యమేతన్మృగేక్షణే!॥**

67



**ప్రతిపదార్థము:–** మృగేక్షణే = మృగనయనా!, గ్రామమ్ = గ్రామమును, రాజ్యమ్ = రాజ్యమును, పురమ్ = పట్టణమును, దేశమ్ = దేశమును, పుత్ర = సంతానమును, దార =భార్యను, కుటుంబకమ్ = ఇతర కుటుంబమును, ఏతత్ = ఈ, సర్వమ్ = సమస్తమును, పరిత్యజ్య = విడిచి అయినా, ఏతత్ = ఈ భైరవశాస్త్రము / భావనాతంత్రము, గ్రాహ్యమ్ = గ్రహింపదగినది.

**భావము:–** ఈ శాస్త్రంలోకి రాదలచిన వారు అవసరమయితే తమ అధికారంలోని గ్రామాన్ని, రాజ్యాన్ని, పట్టణాన్ని, దేశాన్ని, సంతానాన్ని, భార్యను, కుటుంబాన్ని వదలి ఈ భావనాతంత్రాన్ని స్వీకరించాలి.

---

**కిమేభిరస్థిరైర్దేవి! స్థిరం పరమిదం ధనమ్॥**

**159. శ్లో॥ ప్రాణా అపి ప్రదాతవ్యాః న దేయం పరమామృతమ్॥**

**ప్రతిపదార్థము:–** దేవి! = పరదేవి!, అస్థిరైః = చంచలమయిన, ఏభిః = వీటితో, కిమ్? = ఏమి ప్రయోజనము, ఇదమ్ = ఇది, పరమ్ = ఉత్కృష్టమయిన, స్థిరమ్ = స్థిరమయిన, ధనమ్ = ధనము, ప్రాణా అపి = ప్రాణములయినను, ప్రదాతవ్యాః = ఇవ్వదగినవి కాని, పరమ = శ్రేష్ఠమయిన, అమృతమ్ = ఈ అమృతము, న దాతవ్యమ్ = ఇవ్వరానిది.

**భావము:–** దేవి! మిగిలినవన్నీ అస్థిరములు వాటి ఫలితము అస్థిరము. ఈ ధారణాతంత్రము స్థిరఫలమయిన అమృతమయిన మోక్షము ముఖ్య ధనము. ప్రాణములయినా వదలవచ్చును. కాని యీ పరమపీయూష విద్య ఎవరికినీ ఇవ్వరాదు.

----

**శ్రీ భైరవీ – ఉవాచ = శ్రీ భైరవి యిట్లనెను.**

**దేవదేవ! మహాదేవ! పరితృప్తాస్మి శఙ్కర!॥**

**160. శ్లో॥ రుద్రయామలతన్త్రస్య సారమద్యావధారితమ్॥**

**ప్రతిపదార్థము:–** దేవదేవా! = దేవాధిదేవ!, మహాదేవా! = మహాదేవ!, శంకర = శంకరా!, పరితృప్తా = తృప్తిచెందినను, అస్మి = అగుచున్నాను. రుద్రయామళ = రుద్రయామళమను, తంత్రస్య = తంత్రముయొక్క, సారమ్ = సారము, అద్య =

నేడు, అవధారితమ్ = నిశ్చితమయినది.

**భావము:–** శంకరా! మహాదేవ! నీ వివరణ వలన తృప్తిచెందితిని. రుద్రయామల సారము నేడు అవగతమయినది.

---

**సర్వశక్తి ప్రభేదానాం హృదయం జ్ఞాతమద్య చ॥**

**161. శ్లో॥ ఇత్యుక్త్వానన్దితా దేవీ కణ్ఠే లగ్నా శివస్య తు॥**

**ప్రతిపదార్థము:–** అద్య చ = నేడు, సర్వ = సమస్తమయిన, శక్తి ప్రభేదానామ్ = శక్తి భేదములయొక్క, హృదయమ్ = తత్త్వము, జ్ఞాతమ్ = తెలిసికొనబడినది. ఇతి = అని, ఉక్త్వా = పలికి, ఆనందితా = ఆనందం కల, దేవీ = పార్వతీదేవి, శివస్య తు = శివునియొక్క, కంఠే = కంఠమునందు, లగ్నా = కలిసినది అనగా కౌగిలించినది.

**భావము:–** దేవా! నీదయ వలన నాకు సమస్త శక్తి భేదాలు బాగా అర్థమయినవి. వాటి తత్త్వము తెలిసినది. అని పశ్యంతీ రూపమయిన ఆయన వాక్శక్తి ఆయన కంఠమునందణిగినది. అనగా పార్వతి శివుని కౌగలించినది.

ఇక్కడకు "కీటభ్రమరణా"వ్యాఖ్య సమాప్తము.

---